Islam Ek Zaroorat (Telugu)

# ఇస్లామ్ ఆవశ్యకత


రచన

సయ్యద్ ఖుతుబ్ షహీద్ (రహ్మాలై)

అనువాదం

కె.యం.ఏ. సుబ్‌హాన్

# విషయసూచిక





# ఇస్లామీయ వ్యవస్థ నిర్మాణంలో మానవ వనరుల వినియోగం

ఇస్లాం తనదైన ప్రత్యేక తాత్విక దృక్పథం కలిగివుంది. ప్రజలపై ప్రతిభావంతమైన ప్రభావం చూపడంలో సయితం తనదైన ప్రత్యేక ఆచరణను, ఇస్లాం కలిగి ఉంది. ఈ వాస్తవాన్ని నిర్లక్ష్యం చేసినదాని ఫలితంగా ఇస్లామీయ సిద్ధాంత వాస్తవికత, దాని చారిత్రక విలువల వ్యవస్థీకృత ఆచరణల పట్ల భయానకమైన అపోహలు ఏర్పడి ఉన్నాయి.

చాలా మందికి కలుగుతున్న సందేహం ఏమంటే; ఇస్లామీయ జీవన విధానం సృష్టికర్త అయిన అల్లాహ్ తరఫు నుండి స్వయంగా అవతరింపబడిన ధర్మమయితే మానవ నైజం, వారి ప్రత్యేకతలు, సహజ స్థితిగతులు, వారి శక్తి సామర్థ్యాలను పరిగణనలో తీసుకోకుండా ప్రతి కాలమాన స్థితిగతులలోనూ -వనరులతో సంబంధం లేకుండానూ ఒక మహత్యం లాగా స్థాపించబడాలి. కాని మనకు అలాంటి అనుభవం ఎదురుకావడం లేదు. సరికదా, దానికి భిన్నంగా ఇస్లామీయ జీవన వ్యవస్థను స్థాపించే ఉద్యమం, ఈ ఉద్యమ కార్యకర్తల పరిమిత శక్తిసామర్థ్యాలకు, పరిస్థితులకు అనుగుణంగానే సాగు తున్నట్లు కనబడుతుంది. అంతేకాక ఈ ఉద్యమ కార్యకర్తలలోని బలహీనతలు, దృఢదీక్షల కొరతలు కూడా సమాజంలోని సామాన్య ప్రజలపై, ఉద్యమ

స్థితిగతులపై ప్రభావం చూపుతున్నాయి అనేది మనకు అనుభవంలో వస్తున్న సత్యం. ఈ కారణంగా సాధారణ ప్రజలు దైవప్రసాదిత జీవన వ్యవస్థను స్థాపించే ఉద్యమానికి స్వాగతం పలకడానికి బదులు, దానిపట్ల మనసులో నిరాసక్తత, ఒక విధమైన నిర్లక్ష్యం ప్రదర్శించడం చేస్తారు. ఈ స్థితిలో సమాజం సుదీర్ఘకాలం కొనసాగడం వల్ల సమాజ సభ్యుల్లో నిరాశ, నిస్పృహలు చోటుచేసుకుని 'సత్యధర్మస్థాపన' అన్న విషయమే ఊహకు అందనిదిగా మారి పోతుంది. ఫలితంగా 'సత్యధర్మం' కేవలం కొన్ని సాంప్రదాయక ఆచరణా వ్యవహారాల సమాహారంగా మిగిలిపోతుంది. సత్యధర్మ స్థాపన లేక ఇస్లామీయ ధర్మస్థాపన దాని ప్రత్యేక నైజం, ఆచరణ–దాని సంపూర్ణ తత్వం, మన దృష్టి కోణం నుండి మరుగునపడిపోవడం వల్ల పైన పేర్కొన్న పొరపాటు అవగాహనలు, అభిప్రాయాలు ఏర్పడటానికి ప్రధాన కారణాలుగా ఉంటాయి.

ఇస్లాం సృష్టికర్తచే ఆదేశించబడిన జీవన వ్యవస్థ. ఈ జీవన వ్యవస్థను స్వయంగా మానవులే తమ నిరంతర కృషి, తమ శక్తుల సంపూర్ణ వినియోగం ద్వారా ఆయా పరిస్థితులలో, పరిమితులలో ఉంటూ సమాజంలో ఈ జీవన వ్యవస్థను స్థాపించవలసివుంది. మనిషి తనకు తాను ఇస్లామీయ వ్యవస్థను స్థాపించే ఉద్యమంలో సంపూర్ణంగా సంవిలీనమైపోవడం ద్వారానే ఈ లక్ష్యాన్ని సాధించగలడు. ఈ కృషిలో మనిషి, తనకున్న సమస్త శక్తులు, సామర్థ్యాలు, వనరులు అన్నీ కూడా ధారపోయవలసివుంది. ఈ వ్యవస్థ ప్రాథమికమైన ప్రత్యేకత మరియు ఔన్నత్యం ఏమంటే – ఈ వ్యవస్థ స్థాపన –కొనసాగింపుల ప్రతి మలుపులో మానవ నైజం, శక్తిసామర్థ్యాలతో పాటు భౌతిక పరిస్థితుల అనుకూలతలు అన్నీ కూడా తప్పనిసరిగా పరిగణనలోకి తీసుకోవడంలో ఒక్క క్షణం కూడా అలక్ష్యం, అశ్రద్ధ చేయడం సాధ్యమే కాదు. చరిత్రలో మనకు ఇటువంటి సాక్ష్యాలే మనోజ్ఞలంగా, మార్గదర్శకంగా గుణపాఠంగా దర్శన మిస్తూవున్నాయి. ఈ ఇస్లామీయ వ్యవస్థలో మాత్రమే మనిషి నిర్భయత్వం,

సంతృప్తి, శాంతి, ప్రశాంతతల మహోన్నత శిఖరాలను అధిరోహించగలడు. ఈ మహోన్నత స్థితికి చేరుకునే భౌతిక పరిస్థితులు మరి ఇతర ఏ మానవ నిర్మిత సైద్ధాంతిక వ్యవస్థలో పొందడం సాధ్యమే కాదు.

ఇస్లామీయ ఉద్యమ స్వభావాన్ని దాని లక్షణాలను సరిగా అర్థం చేసుకోని కారణంగా మహత్యాలు, అద్భుతాలపై నమ్మకాలు ఏర్పడి, సర్వోన్నతమైన మానవ కృషి, ఆచరణలు, వాటి అవసరాలు మన దృష్టిపథం నుండి మాయమైపోతాయి. ఫలితంగా మానవుల స్వభావంలోనే రాకూడని అనేక మార్పులు, విశ్వాసాలు తిష్ఠవేసుకుంటాయి. ఈ వాస్తవాలను హేతుబద్ధంగా ఆలోచించని కారణంగా, విశ్లేషించి చూడని ఫలితంగా మానవ మస్తిష్కంలో అనేక ప్రశ్నలు, అనుమానాలు చోటుచేసుకుంటాయి. ఉదాహరణకు, ఈ జీవన విధానం సృష్టికర్త అయిన అల్లాహ్‌చే అవతరించబడినది కాదా? ప్రతి విషయంపై అల్లాహ్‌కు అధికారం లేదా? లాంటివి. ఈ ప్రశ్నలకు జవాబు 'ఔను', 'వుంది' అని వస్తే దాని ఆధారంగా మరిన్ని ప్రశ్నలు మనకు ఎదురవుతాయి. ఇది అల్లాహ్ ఆదేశిత జీవన వ్యవస్థ అయితే, మరి మానవుల శక్తిసామర్థ్యాల పరిధిలోనే ఎందుకు దాని 'వికసన', 'స్థాపన' ఆధారపడి ఉంది? మానవ బలహీనతల, ప్రభావం ధర్మసంస్థాపనా కృషిపై ఎందుకు పడుతుంది? ఈ జీవన విధానపు వ్యవస్థ నిర్మాణం మొదటి నుండి కూడా మానవుల శక్తిసామర్థ్యాల వినియోగపు దయాదాక్షిణ్యాలపైనే ఎందుకు ఆధారపడుతుంది? నిరంతరం ఈ ఉద్యమం విజయవంతంగా ఎందుకు ముందుకు సాగలేదు? ఎన్నటికీ విజేతగా ఎందుకు నిలువలేదు? ఈ ఉద్యమాన్ని కొనసాగిస్తున్న కార్యకర్తలు ఎల్లప్పుడూ విజయులుగానే ఎందుకు ఉండరు? దైవదత్త ఈ జీవన విధానపు జయాపజయాలపై మానవుల బలహీనతలు, భౌతిక పరిస్థితులు, కార్యకర్తల మనోకాంక్షలు ఎలా ప్రభావం చూపగలవు? సత్య ధ్వజవాహకులు అసత్యవాదుల చేతుల్లో ఎందుకు ఓటమి పాలవుతారు? ఇస్లామీయ ఉద్యమం

స్వభావాన్ని అర్థం చేసుకోక పోవడం వల్లనూ –దాని పట్ల నిర్లక్ష్యం ప్రదర్శించిన దాని ఫలితంగానూ పై ప్రశ్నలు, సందేహాలు అన్నీ పుట్టుకొస్తాయి.

నిస్సందేహంగా సృష్టికర్త, సర్వశక్తి సంపన్నుడు అయిన అల్లాహ్ ఇస్లామీయ ధర్మం ద్వారాగాని, లేక మరి ఏ ఇతర విధానం ద్వారా గాని మానవుల స్వభావాన్ని సంపూర్తిగా మార్చివేసే శక్తి కలిగివున్నాడు. అయితే, ఏదో ఒక వివేకవంతమైన కారణంచేత మనిషిని, మనిషికి ఉన్న స్వభావం పునాదిపైనే సృష్టించాలని భావించాడు. తన ద్వారా ప్రసాదించబడే హితబోధ, మార్గదర్శకత్వాలను తన స్వంత నిబద్ధత, తన స్వంత కృషి ద్వారా మాత్రమే మానవుడు పొందాలని అల్లాహ్ భావించాడు. **"మా కొరకు తీవ్ర ప్రయత్నం చేసేవారికి మేము మా మార్గాలను చూపుతాము"** (అన్‌కబూత్-69) అని సెలవివ్వడం ద్వారా అల్లాహ్ తన దాసులు స్వభావరీత్యా నిత్యం నిత్యకృషీవలురుగా, నిత్య చైతన్యవంతులుగా వుండాలని కోరుకుంటున్నాడు.

"మానవ ఆత్మసాక్షిగా, ఆ ఆత్మను తీర్చిదిద్ది ఆపై దానికి సంబంధించిన మంచి చెడులను దానికి తెలియజేసిన వాని సాక్షిగా –నిశ్చయంగా తన ఆత్మను పరిశుద్ధపర్చుకొన్న వ్యక్తి సఫలుడయ్యాడు." (అష్ షమ్స్ :7-10)

మానవ జీవితంలో దైవ వ్యవస్థీకృత జీవన విధానం స్వయంగా మానవుల తీవ్ర కృషి, మానవుల శక్తిసామర్థ్యాల పరిధిలోనే స్థాపించబడాలని విశ్వప్రభువు కోరుతున్నాడు.

"యదార్థం ఏమిటంటే, ఒక జాతి స్వయంగా తన లక్షణాలను మార్చుకోనంత వరకు అల్లాహ్ దాని స్థితిని మార్చడు" *(అర్‌రాద్ -11)*

"ఈ విధంగా అల్లాహ్ మానవుల ఒక వర్గాన్ని మరొక వర్గం ద్వారా తొలగించకపోతే ఈ భూలోక వ్యవస్థ ఛిన్నాభిన్నమై ఉండేది"

*(అల్ బఖర : 251)*

మానవుడు తన తీవ్ర కృషిద్వారా ఈ ఉద్యమ మార్గంలో ఎదురయ్యే సకల కష్టనష్టాలను సహిస్తూ, సకల పరీక్షలను సహనంతో ఎదుర్కొంటూ, తన స్వంత వ్యక్తిత్వాన్నీ, తన చుట్టూ ఉన్న సమాజంలో పాతుకొనిపోయి ఉన్న సకల చెడులను, వైరుధ్యాలను నిర్మూలించే కృషిచేస్తాడో –దానికి తగినట్టుగానే అతను తన మార్గంలో ముందంజ వేయగలడు. ఈ విధమైన తీవ్రాతితీవ్రమైన కృషినే మానవుని నుండి విశ్వప్రభువు కోరుతున్నాడు.

"మేము విశ్వసించాము అని అన్నంత మాత్రాన్నే వారిని వదలివేయడం జరుగుతుందనీ, వారిని పరీక్షించడం జరుగదనీ ప్రజలు భావిస్తున్నారా? వాస్తవానికి మేము వారికి పూర్వం గతించిన వారినీ పరీక్షించాము. అల్లాహ్‌కు సత్యవాదులెవరో, అసత్యవాదులెవరో తప్పనిసరిగా చూడవలసి వుంది". *(అన్‌కబూత్ -2,3)*

సృష్టికర్త అయిన అల్లాహ్ ఇలాగే ఎందుకు కోరుతున్నాడు? అని ప్రశ్నించే అధికారం సృష్టిరాశులకు లేదు. ఎందుకంటే సమస్త సృష్టిలో వ్యవస్థీకృతమై ఉన్న విధానం, వాటి సూత్రబద్ధతలకు సంబంధించిన జ్ఞానం సృష్టిరాశులైన మానవులకు వుండే అవకాశమే లేదు. పై ప్రశ్న అటు దైవంపై సంపూర్ణ విశ్వాసంలేని అవిశ్వాసి వేయడు. దృఢ విశ్వాసికి అల్లాహ్ వాస్తవికత మరియు ఆయన గుణవిశేషాలకు సంబంధించిన జ్ఞానంతోపాటు మానవుడు, అతని స్వభావానికి సంబంధించిన పరిధులు, పరిమితులు గురించి కూడా స్పష్టంగా తెలుసు. కనుక తనను సృష్టించిన సృష్టికర్త ఉద్దేశాన్ని అతను ఎప్పుడూ ప్రశ్నించడు. అదే విధంగా ఒక నాస్తిక విశ్వాసికి దేవుని ఉనికిపైనే నమ్మకం వుండదు. కనుక ఈ ప్రశ్న అతనిలో ఉద్భవించనే ఉద్భవించదు. ఎవరైనాసరే, విశ్వప్రభువు అయిన అల్లాహ్‌ను అంగీకరించాడు అంటే – ఆ అంగీకారంతో పాటే అల్లాహ్ ఔన్నత్యం, సర్వస్తోత్రాలకు, విధేయతలకు అర్హుడైన ఆయన విశ్వసామ్రాజ్య ప్రభుసత్తాకాన్ని కూడా అంగీకరించితీరాలి.

"ఆయన చేసే ఏ కార్యాన్ని కూడా ప్రశ్నించ వీలుకాదు. కాని ఇతరులను ఆ విధంగా ప్రశ్నించడం జరుగుతుంది. ఎందుకంటే తన సృష్టి కార్యానికి దాని నిర్వహణకు సంబంధించిన సంపూర్ణ జ్ఞానం కలవాడు, సర్వశక్తి సంపన్నుడు ఆయన ఒక్కడే కనుక.

కనుక అల్లాహ్ సర్వస్వం సహా సర్వాధికారాన్ని ప్రశ్నించే మనిషి కేవలం అర్ధజ్ఞాని లేక మిడిమిడి జ్ఞాని అయి వుంటాడు. మిడిమిడి జ్ఞానం అజ్ఞానంతో సమానమైనదే కనుక అతని ప్రశ్నపై ఆలోచించవలసిన అవసరమేలేదు. అయితే విషయ పరిజ్ఞానం పెంచుకొనే ఉద్దేశ్యంతోనూ -తన జ్ఞానపరిధిని విశాలం చేసుకునే సదుద్దేశ్యంతోనూ ఎవరైనా ఈ ప్రశ్న వేస్తే అతనికి ఈ ప్రశ్నకు జవాబు ఇవ్వడానికి బదులు - ఈ సృష్టి, దాని నిర్వహణ, ఆ నిర్వాహకుని ప్రచండ శక్తిసామర్థ్యాలు, ఆయన విశ్వసామ్రాజ్య ప్రభుసత్తాకాన్ని గురించిన జ్ఞానం తప్పనిసరిగా అందించవలసి ఉంది. ఈ జ్ఞానాన్ని అతడు అంగీకరిస్తే సంపూర్ణ విశ్వాసిగా మారగలడు (ఇన్షాఅల్లాహ్). అంగీకరించని పక్షంలో నాస్తికునిగా ఉండిపోతాడు. ఎలా జీవించాలి అనేది అతని వ్యక్తిగత ఇష్టంపై ఆధారపడివుంటుంది. సృష్టితాలకు తన స్వభావాన్ని ఈ విధంగా ఎందుకు సృష్టించావు? అని తన సృష్టికర్తనే ప్రశ్నించే అధికారం అధికారం, హక్కు ఎప్పటికీ ఉండదు. సృష్టితమైన మానవుని స్వభావాన్ని నిరంతరం చైతన్య వంతంగా ఆయన ఎందుకు వుంచాడు? దైవంచే వ్యవస్థీకృతమైన వ్యవస్థను సుస్థాపించడం అన్నది మానవుని శక్తిసామర్థ్యాల పరిధిలో ఎందుకు వుంచాడు? ఒక అద్భుతంగా ఈ వ్యవస్థను స్థాపించే విధానాన్ని సృష్టికర్త ఎందుకు యిష్టపడ లేదు? లాంటి ప్రశ్నలను ప్రశ్నించే హక్కు సృష్టిరాశులకు లేదు, అలా ఎందుకు లేదు!

దైవంచే సృష్టించబడిన ప్రతి సృష్టితం తనకు హక్కుగా లభించిన తన స్వంత స్వభావం ద్వారా మానవ జీవితాన్ని నిరంతరం ప్రభావితం చేస్తూ

వుంటుంది. ఈ ప్రభావిత జీవితపు వెలుగులో, చారిత్రక సత్యాలైన సంఘటనలను జోడించి సత్యశోధన చేయాలి. ఈ సత్యశోధన ద్వారా తెలిసివచ్చే వాస్తవాలను అర్ధం చేసుకొని తాను చేసే ఆచరణలో, కృషిలో ఎదురయ్యే అవరోధాలన్నింటినీ నిరంతరం అధిగమించుతూ ముందుకు సాగాలి. ఈ గమనంలో అల్లాహ్ యొక్క వివేకవంతమైన ఈ సృష్టికీ, దాని విధివిధానాలకు అనుగుణంగా తన చైతన్యవంతంగా కొనసాగించే మార్గం మనకు స్పష్టమవుతూ వుంటుంది. ఈ విధంగా సృష్టిలోని ఇతర సృష్టిరాశులకు, స్వయంగా మానవునికీ, అతని జీవితానికి మధ్య ఒక అద్భుతమైన సయోధ్య, సహకారం, ఆలంబన జనిస్తుంది.

ఇతరుల వరకు ఈ సిద్ధాంతాన్ని అందించడం, వారి ముందు ఈ సిద్ధాంతాన్ని విశదపర్చడం ద్వారా కూడా ఈ వ్యవస్థ స్థాపించబడదు. ఆకాశాలలోనూ, ఇతర ప్రకృతి వనరులలోనూ దేవుని వ్యవస్థ ఏవిధంగా స్థాపించబడి వున్నదో అదేవిధంగా మానవ సమాజంలో కూడా ఈ వ్యవస్థ స్థాపించబడుతుందని భావించడం మహాపొరపాటు. తత్ వ్యతిరేకంగా ఈ ఇస్లామీయ వ్యవస్థను స్థాపించడానికి సంపూర్ణ విశ్వాసంతో తొణికిసలాడుతున్న సంస్థాపరమైన నిర్మాణంతో దృఢమైన ఒక మానవుల సంఘం అవసరమవుతుంది. ఈ కార్య నిర్వహణలో ఇస్లామీయ వ్యవస్థ పట్ల స్వంతంగా తమ మనస్సులలోనే కాక ప్రపంచంలోని ఇతర మానవుల మేథో మస్తిష్కాలలో కూడా అంగీకార భావనను జాగృతం చేయాలి. ఈ సంఘం తన సంపూర్ణ శక్తితో, నిరంతర శ్రమతో ప్రతి అవసరమైన విషయంలో అవిరళ కృషి చేయాలి. ఈ బాధ్యతను నెరవేర్చడానికి భ్రమలపై ఆధారపడకుండా తమ నిరంతర ఆచరణ ద్వారా తమ జీవితాలతో పాటు ఇతరుల జీవితాలను సైతం ప్రభావితం చేయాలి. వారి హృదయాలను గెలుచుకోగలగాలి. వారిలో చైతన్యం నింపడానికి, వారిని కార్యోన్ముఖులుగా మలచడానికి సర్వశక్తులూ ఒడ్డాలి. తమ స్వంత అంతరంగంలోని

స్వార్థం, కాంక్ష, కోరికలతో పోరాడుతూనే - ఈ దుష్టభావనలను పెంచి పోషించే శక్తులతోనూ, భావాలతోనూ నిరంతరం పోరాడాలి. ఈ అంతః బహిర్గత పోరాటం తర్వాత కూడా దైవవ్యవస్థ స్థాపన మానవ స్వభావం, వారి శక్తియుక్తులు, భౌతిక పరిస్థితులు, వనరులు వగైరాలపై ఆధారపడి మాత్రమే స్థాపించబడుతుంది. ఈ విశ్వాసుల సంఘం కొన్ని సందర్భాలలో తమ స్వంత మనస్సులపైననూ-తమ చుట్టూవున్న మానవుల హృదయాల పైననూ అద్భుత ప్రభావం చూపగలుగుతుంది. కొన్ని సందర్భాలలో ఈ సంఘం ఓటమికి కూడా గురికావలసి వస్తుంది. ఓటమి సందర్భంలో ఆత్మవిశ్వాసం, ఆత్మపరిశీలన, కృషిలోని లోపాలను గుర్తించాలి. భౌతిక పరిస్థితులను అంచనా వేయాలి. అన్నిటికంటే అధికంగా ఈ వ్యవస్థ స్థాపనకు నడుంకట్టిన ఈ సంఘ కార్యకర్త లలో ఈ వ్యవస్థ పట్ల దాని స్థాపన పట్ల ఎంతటి నిబద్ధత వున్నదో తరచి చూడాలి. సమాజంలో దైవసంక్షేమ వ్యవస్థ స్థాపనకు పూనుకునే కార్యకర్త, ముందుగా తనపై ఈ వ్యవస్థను ఏ మేరకు స్థాపించుకొన్నాడు? ఈ వ్యవస్థకు ప్రతినిధిగా ఏ మేరకు తననుతాను మలచుకొన్నాడు? అనేది అత్యంత గమనార్హ మైన విషయం.

ఇస్లామీయ వ్యవస్థ స్వభావం, ఆచరణా పద్ధతి, నిర్వహణపైన సూచించిన మాధ్యమంలోనే సాధ్యమవుతుంది. ఈ సత్యాన్నే అల్లాహ్ తన విశ్వాసులైన దాసులకు (కార్యకర్తలకు) తన వాక్యాల ద్వారా తెలియపర్చాడు.

"యదార్థం ఏమిటంటే - ఒక జాతి స్వయంగా తన లక్షణాలను మార్చుకోనంతవరకు అల్లాహ్ దాని స్థితిని మార్చడు" *(అర్రాద్ : 11)*

"ఈ విధంగా అల్లాహ్ మానవుల ఒక వర్గాన్ని మరొక వర్గం ద్వారా తొలగించకపోతే, భూలోక వ్యవస్థ ఛిన్నాభిన్నమై ఉండేది"

"మా కొరకు తీవ్ర ప్రయత్నం చేసేవారి కొరకు మేము మా మార్గాలను (తప్పకుండా) చూపుతాము." *(అన్కబూత్ :69)*

ఈ సత్యాన్ని ఉహద్ యుద్ధరంగంలో విశ్వాసుల సంఘానికి అల్లాహ్ ప్రత్యక్షంగా రుజువుపర్చి చూపాడు. యుద్ధరంగంలో ఒకవైపున రక్షణగా నిలిపిన సైనిక బృందంలో ఇస్లామీయ ఆలోచనా విధానపు ప్రతినిధితత్వ జాగరూకత ఎప్పుడైతే మసకబారిపోయిందో, ధనలాలస మనసులో ఆధిపత్యం వహించి యుద్ధ సొమ్ము సేకరణలో సత్యాన్ని, వాస్తవ పరిస్థితిని అలక్ష్యం చేశారో, విశ్వాసులమైనందుకు విజయం మనకు తప్పనిసరి అని ఎప్పుడైతే అపోహకు గురయ్యారో, భౌతిక పరిస్థితులకు అనుగుణంగా యుద్ధ ఫలితంలో పూర్తి వ్యతిరేకత చోటు చేసుకొంది. ఈ పరిస్థితినే వివరిస్తూ అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు.

"మీపై (ఉహద్ యుద్ధరంగంలో) ఆపద వచ్చిపడగానే ఇది ఎక్కడి నుంచి దాపురించింది? అని అంటారేమిటి? (బద్ర్ సంగ్రామంలో) దీనికి రెండింతల ఆపద స్వయంగా మీ చేతుల ద్వారా (మీ శత్రువులపై) పడిందికదా! ప్రవక్తా! వారితో ఇలా చెప్పు: "ఈ ఆపద స్వయంగా మీరు తెచ్చుకున్నదే!" *(ఆలిఇమ్రాన్ -165)*

మరోచోట

"అల్లాహ్ మీకు చేసిన (సహాయపు) వాగ్దానాన్ని నెరవేర్చాడు. ప్రారంభంలో ఆయన ఆజ్ఞ ప్రకారం (మీపై దాడి చేసిన అవిశ్వాసులను యుద్ధ రంగంలో) మీరే చంపుతూ వుండినారు. కాని, మీరు బలహీనతను ప్రదర్శించినప్పుడు, మీ కర్తవ్య విషయంలో పరస్పరం విభేదాలకు గురి అయినప్పుడు, మీరు వ్యామోహపడిన వస్తువును (విజయధనాన్ని) అల్లాహ్ మీకు చూపగానే మీరు నాయకుని ఆజ్ఞను ఉల్లంఘించారు. ఎందుకంటే మీలో కొందరు ఇహాన్ని కోరారు. మరికొందరు పరాన్ని కోరారు. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని పరీక్షించడానికి అవిశ్వాసులకు బదులుగా మిమ్మల్ని ఓటమి పాలు చేశాడు." *(ఆలి ఇమ్రాన్-152)*

విశ్వాసులు ఉహద్ యుద్ధరంగంలో కేవలం బెదరింపులు, ధూత్కారాల ద్వారా కాక తీవ్రమైన బాధలు, అంతులేని ప్రాణనష్టాన్ని పరిహారంగా చెల్లించడం ద్వారా ఈ సత్యాన్ని తెలుసుకున్నారు. విజయపు గడపలో వున్న వారు ఒక్కసారిగా అపజయపు గుంటలో పడిపోయారు. లాభం అందుకోబోయినవారు నష్టాల ఊబిలో చిక్కుకుపోయారు. చికిత్సకు సాధ్యంకాని గాయాలను పొందారు. మహావీరుడైన హజ్రత్ హమ్జా (రజి)తో పాటు ఉన్నత స్థాయిగల అనేకమంది సహాబాలు (ప్రవక్త అనుచరులు) అమరులయ్యారు. అంతేకాదు, విశ్వాసుల హృదయాలను పిండిచేసిన సంఘటనస్వయంగా విశ్వనాయకులైన ముహమ్మద్ (స) వారు తీవ్రంగా గాయపడ్డారు. తమ ముఖారవిందం నెత్తుటి ధారలతో ఎర్రబారిపోయింది. ముందుభాగపు నాలుగు దంతాలు అమరగతి పొందాయి. మక్కా నగరపు అవిశ్వాసి 'అబూ ఉమర్' ముస్లింలకు నష్టం కలిగించే ఉద్దేశ్యంతో యుద్ధభూమిలో త్రవ్వించిన గుంతలో ప్రవక్త (స)వారు పడిపోయారు. దుర్మార్గులు ప్రవక్త (స) వారిపై దాడిచేసి హతమార్చడానికి తీవ్ర ప్రయత్నం చేశారు. ఆ సమయంలో ప్రవక్త (స) వారికి రక్షక దళంగా బహుకొద్ది మంది సహాబాలు మాత్రమే ఉన్నారు. విశ్వనాయకుని రక్షించే కర్తవ్యంలో ఒకరి తర్వాత మరొకరు తమ ప్రాణాలను దైవమార్గంలో బలిచేయవలసివచ్చింది. హజ్రత్ అబూదజవా (రజి) గారు అవిశ్వాసుల బాణ ప్రయోగాల నుంచి ప్రవక్త (స) వారిని రక్షించేందుకు వారికి అడ్డంగా గోడలా నిలబడిపోయారు. శరపరంపరతో ఆయన దేహం నిండిపోయింది. ఓటమి పాలైన విశ్వాసుల సమూహం అతికష్టంతో తమ్ముతాము కాపాడుకోగలిగారు. వాస్తవపు చేదు అనుభవాన్ని చవిచూశారు.

మానవ శక్తిసామర్థ్యాల పరిధిలో, వారి నిరంతరకృషితో దైవవ్యవస్థాపనను ప్రత్యేకంగా జత చేయడంలో ఒక గొప్ప వివేకవంతమైన కారణం ఏమంటే దీని ద్వారా మనిషికి మానసిక, భౌతిక జీవితపు వైరుధ్యాలన్నీ పరిష్కరించబడతాయి. సమస్యలన్నీ సమసిపోతాయి. ఒక విశ్వాసి తనచుట్టూ

వున్న సమాజంతో నిరంతరం పోరాడనంతవరకు, సత్యస్థాపన కోసం నిరంతర కృషి జరపనంతవరకు అతనిలోని విశ్వాసపు స్థాయి ఉన్నత స్థానానికి ఎదగడం సాధ్యమే కాదు. సంపూర్ణ హృదయంతో తన చుట్టూ ఆవరించివున్న అజ్ఞానాంధ కారంలో పోరాడాలి. చెడును అసహ్యించుకోవాలి. ప్రజలను సత్యం, జ్ఞానం, ఇస్లాంల వైపు మలచడానికి అవిరళ కృషి జరపాలి. నోటితో అసత్యాన్ని దౌర్జ న్యాన్ని విమర్శించాలి. సత్యాన్ని, శాంతిని, జ్ఞానాన్ని ప్రచారం చేయాలి. దాని స్థాపనకు తీవ్ర కృషి చేయాలి. తమ స్వహస్తాలతో అధర్మం, దౌర్జన్య పూరితమైన వ్యవస్థను కూల్చివేయడానికి, దాని అనుకూలశక్తులను ఎదిరించి నిరంతరం అలుపెరుగక పోరాడటానికి సిద్ధపడాలి. ఈ మార్గంలో ఎదురయ్యే కష్టనష్టాలను దృఢంగా, నిలకడగా, సహనంతో భరించాలి. జయాపజయాలలో నిబ్బరాన్ని ప్రదర్శించాలి. విశ్వాసంపై దృఢంగా నిలవాలి.

ఈ పోరాటం జరగకుండా ఏ హృదయంలో కూడా విశ్వాసపు జాగ రూకత, దృఢత్వం సాధ్యమే కాదు, ఎందుకంటే, ఈ పోరాటంలో భాగంగా మనిషి తన అంతరంగంలో కూడా అంతర్గత పోరాటం కొనసాగిస్తూ ఉంటాడు. దాని ప్రత్యక్ష ఫలితం తప్పనిసరిగా అతను అందుకొనితీరుతాడు. ఈ విశ్వాసపు జాగరూకత, దృఢత్వాలు మౌనంగా, ప్రశాంతంగా ఒకచోట తిష్ఠవేసి కూర్చోవడం ద్వారా జనించడం సాధ్యమేకాదు. మనిషి తన అంతర్గత భావనలు, అభిప్రాయాలు, ఆలోచనలు, అలవాట్లు, స్వభావాలు, జాగరూకత, ఆదేశాల పునాదులపై అత్యంత కఠినమైన అనుభవాలను పొందడం ద్వారా మాత్రమే ఒక ఉన్నత స్థానానికి చేరుకోగలడు.

నిస్తేజం, చలనరాహిత్యం వల్ల మనసు కలుషితం అయిపోతుంది. ఆత్మ మసిబారిపోతుంది. ధైర్యసాహసాలు అడుగంటిపోతాయి. ఫలితంగా జీవిత మంతా మాలిన్యంతో నిండిపోతుంది. కొన్ని సందర్భాలలో చైతన్యం చలనాలు కేవలం జీవితపు సుఖభోగాలను ప్రోదిచేసుకోవడం వరకే పరిమితమైపోతుంది.

ఫలితంగా సంపదతోపాటు జనించే అన్ని అవలక్షణాలకు మనిషి ఎర అయి పోతాడు.

పైన వివరించిన విషయం ఆధారంగా ఏ స్వభావం మీద మనిషిని అల్లాహ్ సృజన చేశాడో, ఆ మనిషి విజయం కేవలం మనిషి జీవితంలో అల్లాహ్ వ్యవస్థను స్థాపించడంలోనే నిక్షిప్తమైవుందని రూఢీ అవుతుంది. ఈ దైవవ్యవస్థ నిర్మాణంలో మనిషి సర్వశక్తులు ధారపోయడంలోనే మనిషి సఫలత దాగివుంది. ఈ కృషిలో మనిషికి ఎదురయ్యే సమస్యలు, కష్టాలు, పరీక్షలు అన్నీ ఆ మనిషి హృదయ మాలిన్యాన్ని కడిగివేయడానికి ఉపయోగకారులవుతాయి. ద్వంద్వ స్వభావాన్ని, డాంభికతను, ప్రదర్శనాబుద్ధిని సహజంగానే ఈ కృషిలో విసిరివేయవలసి వస్తుంది. ఉహద్ యుద్ధరంగంలో ముస్లింల హృదయాలలో మెలకవేసిన 'యిలా ఎందుకయ్యింది?' అన్న ప్రశ్నకు జవాబుగా అల్లాహ్ వాస్తవాన్ని ఇలా తెలియపర్చడం జరిగింది.

> "ప్రవక్తా! వారితో ఇలా చెప్పు, ఈ ఆపద స్వయంగా మీరు తెచ్చు కున్నదే" *(ఆలి ఇమ్రాన్ : 165)*
>
> "పోరాటం నాడు మీకు కలిగిన నష్టం అల్లాహ్ అనుమతితోనే కలిగింది. ఎందుకంటే, తద్వారా మీలో విశ్వాసులెవరో కపటులెవరో అల్లాహ్ చూడదలిచాడు" *(ఆలి ఇమ్రాన్ -166)*
>
> "మీరు ప్రస్తుతం వున్న స్థితిలోనే అల్లాహ్ విశ్వాసులను ఏమాత్రం ఉండనివ్వడు. ఆయన పవిత్రులను అపవిత్రుల నుండి వేరుచేస్తాడు."
> *(ఆలి ఇమ్రాన్ : 179)*
>
> "మీలో నిజమైన విశ్వాసులెవరో అల్లాహ్ చూడదలిచాడు (సత్యానికి) నిజమైన సాక్షులెవరో ఏరదలిచాడు. ఎందుకంటే, దుర్మార్గులైన ప్రజ లంటే అల్లాహ్‌కు ఇష్టంలేదు. ఇంకా ఆయన పరీక్షద్వారా విశ్వాసులను వేరుచేసి, అవిశ్వాసులను తుదముట్టించదలిచాడు."
> *(ఆలిఇమ్రాన్ : 140, 141)*

విశ్వాసుల సంఘానికి, వారి అపజయానికి కారణమేమిటో స్పష్టంగా తెలియపర్చడమే పై ఆయత్ (వాక్యాల) ముఖ్య ఉద్దేశం. యుద్ధరంగంలో వారు వేర్వేరు స్థితులలో, పరిస్థితులలో విశ్వాసపు వాస్తవికతను సంపూర్ణంగా అర్థం చేసుకోలేకపోవడంతోపాటు, విశ్వాసానికి ప్రతినిధులుగా స్థిరంగా నిలబడలేక పోయారు. విశ్వాసంలో కొరత చూపించారు. కనుకనే అపజయానికి హక్కుదారులయ్యారు. ఇస్లామీయ సంఘానికి ఈ అపజయం ఒక శిక్షణగా అల్లాహ్ ఉపయోగించి చూపాడు. అల్లాహ్ విశ్వాసులపై కురిపించిన కారుణ్యం ఫలితంగా అపజయం చివరిగా విజయంగానే ఫలితాన్నిచ్చింది.

ఇస్లాం స్వభావం, ఆచరణా విధానం గురించి ఇక విషయం ఇక్కడే స్పష్టపర్చడం అత్యంత అవసరం. దైవవ్యవస్థను స్థాపించడానికి మానవ వనరుల వినియోగం, విభిన్న పరిస్థితులను సరిగా అన్వయించుకోవడం, మానవ శక్తియుక్తులన్నింటినీ ఉపయోగించడం ద్వారా మాత్రమే సాధ్యమవుతుందని ఎవరైనా భావిస్తే, అది పూర్తిగా ఇస్లామీయ స్వభావానికి విరుద్ధమైన భావనగా గుర్తించాలి. అల్లాహ్ అధికారం, వివేకం, సహాయసహకారం, కరుణా కటాక్షాల పట్ల కించిత్ అలక్ష్యం ప్రదర్శించినా, కేవలం మానవ కృషి ఎంతటి దృఢమైనదైనా సఫలత, విజయం సాధ్యంకాదు. ఈ విధమైన ఆలోచనా విధానం ఆచరణ ఇస్లామీయ స్వభావానికే విరుద్ధమైనదిగా గుర్తించాలి. దైవసహాయాన్ని అర్థిస్తూ కృషి చేసే నిరంతర కృషీవలులకు మాత్రమే దైవసహాయం ప్రాప్తమవుతుంది.

"మా కొరకు తీవ్ర ప్రయత్నం చేసేవారికి మేము మా మార్గాలను చూపుతాము." *(అన్‌కబూత్ -69)*

"ఒక జాతి స్వయంగా తన లక్షణాలను మార్చుకోనంతవరకు అల్లాహ్ దాని స్థితిని మార్చడు." *(అర్రాద్ -11)*

ఈ రెండు సాక్ష్యాల ద్వారా తెలిసేదేమంటే; మానవ తీవ్ర కృషి, దైవంతో

గాఢమైన సంబంధం ఈ రెండింటి మూలంగానే వరప్రసాదాలు వర్షించబడ తాయి. పై రెండింటిని జత చేసి ఆచరించడం ద్వారానే విజయాలు, సంబంధా లలో పరిపుష్టి వైరుధ్యాల పరిష్కారం సాధ్యమవుతుంది. చివరగా దైవ సంకల్పానికే విజయం లభిస్తుంది. ఈ దైవసంకల్పాన్ని, తన పక్షానికి పొంద కుండా కేవలం మానవ కృషి ద్వారా మనిషి సాధించగలిగేది కేవలం శూన్యం మాత్రమే. ఎవరైతే దైవం చూపిన మార్గంలో, దైవం సూచించిన పద్ధతిలో కృషి చేస్తాడో ఆ మార్గం పట్ల జ్ఞానం కలిగివుంటాడో ఆచరణలో నిరంతరం ఆయన సహాయం అర్థిస్తూ వుంటాడో ఆయన సూచించిన వ్యవస్థ స్థాపనకు అలుపెరు గని కృషి చేస్తూ వుంటాడో దైవసంకల్పం అతని పక్షమే వహిస్తుంది. అల్లాహ్ పెట్టిన పరీక్షలలో దృఢంగా, సహనంతో సాగిపోయినవాడి పక్షానికే అనంత మైన వరాలు అల్లాహ్‌చే వర్షించబడతాయి.

ఈ వాస్తవ చిత్రానే ఉహద్ యుద్ధం తర్వాత విశ్వాసుల సంఘానికి చూపబడింది. విజయం, అపజయం రెండూ కూడా స్వయంగా వారి ఆచరణల ఫలితంగానే లభిస్తాయన్న కఠోర సత్యాన్ని అల్లాహ్ విశ్వాసుల సంఘానికి స్పష్టపర్చాడు.

"అల్లాహ్ మీకు (సహాయం చేస్తానని) చేసిన తన వాగ్దానాన్ని నెర వేర్చాడు. ప్రారంభంలో ఆయన ఆజ్ఞప్రకారం మీరే వారిని చంపుతూ ఉన్నారు. కాని, మీరు బలహీనతను ప్రదర్శించినప్పుడు, మీ కర్తవ్యం విషయంలో పరస్పరం విభేదాలకు గురి అయినప్పుడు, మీరు వ్యామోహపడిన వస్తువును (అంటే విజయధనం) అల్లాహ్ మీకు చూపగానే, మీరు మీ నాయకుని ఆజ్ఞను ఉల్లంఘించారు. ఎందుకంటే మీలో కొందరు ఇహాన్ని కోరారు. మరికొందరు పరాన్ని కోరారు. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని పరీక్షించడానికి అవిశ్వాసులకు బదులుగా మిమ్మల్ని ఓటమి పాలు చేశాడు." *(ఆలి ఇమ్రాన్ : 152)*

ఆ తర్వాత అల్లాహ్ తన సంప్రదాయాన్ని (సున్నత్) ఇలా తెలియపర్చాడు.

"ఇప్పుడు మీరు దెబ్బతిన్నారు. నిజమే, ఇదివరకు మీ ప్రత్యర్థి కూడా ఇటువంటి దెబ్బనే తిన్నాడు కదా. ఇవి కాలం యొక్క మిట్టపల్లాలు. వాటిని మేము ప్రజల మధ్య తిప్పుతూ వుంటాము. ఇటువంటి కాలం మీకు ఎందుకు ప్రాప్తించిందంటే, మీలో నిజమైన విశ్వాసులెవరో అల్లాహ్ చూపదలిచాడు. (సత్యానికి) నిజమైన సాక్షులెవరో ఏర దలిచాడు. ఎందుకంటే -దుర్మార్గులైన ప్రజలంటే అల్లాహ్‌కు ఇష్టం లేదు. ఇంకా ఆయన ఈ పరీక్ష ద్వారా విశ్వాసులను వేరుచేసి అవిశ్వా సులను తుదముట్టించదలిచాడు." *(ఆలిఇమ్రాన్-140)*

ఈ విధంగా సంఘటనలు, వాటి ప్రయోజనాల వెనుక సృష్టికర్త ఉద్దేశ్యం, శక్తి మాత్రమే నిర్ణయాత్మక శక్తిగా వుంటుందన్న సత్యం ప్రస్ఫుటమవు తుంది. దీనిని ప్రశ్నించే శక్తి ఎవరికీ లేదు. ఎందుకంటే మానవులు అలా ప్రశ్నించలేకపోవడమే అల్లాహ్ మహోన్నత తత్వానికి నిదర్శనం. ఈ తత్వాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోవడమే విశ్వాసం ఉన్నతస్థాయి. మనసుకు ప్రశాం తత, ఆచరణలో సంపూర్ణత, ధర్మం స్వభావాన్ని అర్థం చేసుకోవడం, ఇవన్నీ పై విషయాన్ని దృఢంగా ప్రశాంత చిత్తంతో అంగీకరించబడటంలోనే దాగి వుంది.



# చక్కటి ఏకైక మార్గం

ఇస్లాం ఒక్కటే చక్కటి ఏకైక మార్గమని అంగీకరించిన తరువాత మన ముందు ప్రధానంగా ఒక ప్రశ్న వచ్చి నిలుస్తుంది. అదేమంటే, ఇస్లాం ఒక్కటే చక్కటి ఏకైక మార్గమైనప్పటికీ, దాని స్థాపన పూర్తిగా మానవ శక్తి సామర్థ్యాలపై, విభిన్న భౌతిక పరిస్థితులపై కార్యకర్తల తీవ్రాతితీవ్రమైన కృషి, ప్రయత్నాలపై ఆధారపడివుంటే మరి ఇస్లామేతర మానవ నిర్మిత సిద్ధాంతాలపై ఆధారపడిన వ్యవస్థల స్థాపన కూడా పై పరిస్థితులకు అనుగుణంగానే స్థాపించ బడతాయి. కనుక, ఈ రెండింటి మధ్య తేడా ఏమిటి? ఇస్లాంకు మాత్రమే ప్రాధాన్యత ఇవ్వవలసిన అవసరం ఏమిటి? ఇస్లాం మనుషుల స్వభావం శక్తి, భౌతిక పరిస్థితులకు అనుగుణంగా ఏర్పడే వ్యవస్థే అయితే ఇదే విధంగా ఏర్పడే మానవ నిర్మిత వ్యవస్థకు, ఇస్లామీయ వ్యవస్థకు మధ్య వ్యత్యాసం ఏముంది? ఇస్లామీయ వ్యవస్థ స్థాపన దైవం చూపించే అద్భుతంగా, దైవకారుణ్యంగా, ఆయన ఆజ్ఞ (కున్)గా ఏర్పడినప్పుడు దాని కోసం తీవ్రాతి తీవ్రమైన కృషి చేయవలసిన అవసరం ఏమిటి?

ఇస్లాం యొక్క సౌశీల్యవంతమైన లక్షణాలను తమలో జనింపజేసు కోవడానికి, ఇస్లామీయ వ్యవస్థ స్థాపన తప్పనిసరి. ఇస్లాం యొక్క అత్యంత ప్రాథమికమైన, మౌలికమైన విశ్వాసం ఏమంటే "అల్లాహ్ తప్ప మరెవ్వరూ ఆరాధ్యుడు లేడు, ప్రవక్త ముహమ్మద్ (స) ఆయన సందేశహరుడు." అని సాక్ష్యం యివ్వడం. దేవుని ఏకత్వానికి సాక్ష్యమివ్వడం అంటే, ఆరాధనలు అన్నీ

కూడా కేవలం అల్లాహ్‌కు మాత్రమే చెందుతాయని విశ్వసించడమే, ఆయన గుణవిశేషాలలో ఎవరికీ భాగస్వామ్యం కల్పించకుండా వుండటమే. ఆరాధ్యుడు అన్న పదంలోనే సర్వాధికారి అనే అర్థం నిక్షిప్తమైవుంది. తన పాలిత దాసుల కొరకు చట్టనిర్దేశన, జీవన విధానం, జీవితపు ప్రాథమిక అవసరాల కల్పనల అధికారం అల్లాహ్‌కు మాత్రమే ప్రాప్తమైవుంది. అల్లాహ్‌కు మాత్రమే నా జీవిత విధానాన్ని నిర్దేశించే అధికారం, హక్కు వుంది. అని మనసా, వాచా, కర్మణా, అంగీకరించనంతవరకు **'లాయిలాహ యిల్లల్లాహ్'** అని ఒక ముస్లిం పలికే సాక్ష్యం పరిపూర్తి కాదు. ఎవరైనా ఒక మానవ సమాజానికి ఒక జీవిత విధానాన్ని తనకు తానుగా ఆలోచించి, యోచించి అందిస్తున్నాడు అంటే ఆ వ్యక్తి, ఆ సమూహానికి ఆరాధ్యుడి హక్కు కోరుతున్నాడు అనియే అర్థం. మరి ఎవరైనా వ్యక్తి మానవ నిర్మిత జీవన విధానాన్ని అంగీకరించాడంటే, ఆ సిద్ధాంతాన్ని ఆమోదించాడంటే ఆ సిద్ధాంత నిర్మాతను, అల్లాహ్‌కు బదులుగా తనకు ఆరాధ్యునిగా చేసుకున్నాడని విశదమవుతుంది.

ప్రవక్త ముహమ్మద్ (స)ను దేవుని సందేశహరునిగా (రసూల్) అంగీకరించడమంటే అర్థమేమిటి? అల్లాహ్‌చే ప్రసాదించబడిన ఏ జీవిత విధానాన్ని ప్రవక్త (స) మనకు అందజేశారో ఆ జీవిత విధానమే మనకు వాస్తవ జీవన విధానం. ఈ జీవిత విధానాన్ని విశ్వాసి అయిన వ్యక్తి ముందుగా తనపై స్వయంగా స్థాపించుకోవాలి. ఆ తరువాత సమస్త మానవ సమాజంలో ఈ విధానాన్నే స్థాపించడానికి అనితర కృషి సలపాలి. ఈ విధంగా ఇస్లాం నా జీవన విధానం నేను దానికి ప్రతినిధిని అని ప్రకటించుకొన్న ప్రతి వ్యక్తిపై, ఈ జీవన విధానాన్ని స్థాపించే పని విధి అయిపోతుంది. ఈ విధి అయిన విషయాన్నే కలిమయే తయ్యిబా **'లాయిలాహ యిల్లల్లాహ్ ముహమ్మదు రసూలుల్లాహ్'**ను సాక్ష్యం పలకడం జరుగుతుంది. ఈ సాక్ష్యం పరిపూర్తి అవడానికి ఒకే ఒక్క షరతు ఏమిటంటే, మన జీవిత విధానంలో ఆరాధన, ఆజ్ఞాపించే

అధికారం కేవలం అల్లాహ్‌కు మాత్రమే హక్కుగా ఉండాలి. ప్రవక్త ముహమ్మద్ (స) తెచ్చిన జీవన విధానాన్ని మాత్రమే స్థాపించడానికి కృషి చేయాలి.

ఈ మార్గం ప్రత్యేకతల రీత్యా కూడా ఈ వ్యవస్థను స్థాపించడానికి విశ్వాసుల బృందం నిబద్ధమై ఉంటుంది. ఈ ఏకైక చక్కటి మార్గంలో మాత్రమే మానవ ఔన్నత్యం అద్భుత శారీరక నిర్మాణాన్ని గౌరవిస్తూ, వాస్తవికమైన స్వేచ్ఛను పొందగలదు. మానవుల దాస్యాన్నుండి మానవులకు విముక్తి కలిగించి ఏకైక సృష్టికర్త ఆజ్ఞాపాలన వైపునకు పిలిచే ఏకైక మార్గం ఇది మాత్రమే. ఈ విధంగా మానవతకు దైవదాస్యపు పరిధిలో సంపూర్ణమైన, సహజ మైన స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. ఈ సమస్త భూమండలంపై గల ఇంతటి అద్భుత మైన, సహజమైన ప్రత్యేక వ్యవస్థ మరొకటి లేదు. ఇస్లాం కొంతమంది మానవు లను ఇతర మానవులకై ఆరాధ్యులుగా, సర్వాధికారులుగా, చట్ట నిర్దేశకులుగా, సర్వాధికారులుగా మారే సకల విధానాలను నిర్ద్వంద్వంగా రద్దుచేసివేస్తుంది. కేవలం సృష్టికర్త, పోషకుడు, సర్వాధికారి, చట్టనిర్దేశకుడు అయిన అల్లాహ్‌కు మాత్రమే ఆ హక్కును ప్రత్యేకించివేస్తుంది. ఈ సర్వోన్నతుడైన ప్రభువు వైపునకే సర్వమానవాళిని ఆహ్వానిస్తుంది. దైవ వ్యవస్థలోని ఈ ప్రత్యేకత కేవలం ప్రకటించడం వరకే పరిమితంకాక ఆచరణకు కూడా ఉత్తేజితం చేస్తుంది. ఈ కారణం వల్లనే దైవప్రవక్తలందరి లక్ష్యం, ఆరాధనలన్నీ కేవలం అల్లాహ్‌కు మాత్రమే ప్రత్యేకింపచేయడంగా వుండేది. ప్రజలందరి ముందు ఈ సత్యాన్ని, దాని ప్రత్యేకతను స్పష్టపర్చడంలో వారు ఎప్పుడూ కించిత్ కూడా అలక్ష్యం ప్రదర్శించనేలేదు. ప్రజలకు తాము స్వయంగా ఒక జీవన విధానాన్ని అందించ గలమని చెప్పడం ద్వారా దేవుని ఏకత్వాన్ని, సర్వాధికారాన్ని తృణీకరించే వారిని ఉద్దేశించి అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు. నిజానికి ఈ క్రింది మాటలు యూదులు, క్రైస్తవులకు ఉద్దేశించబడినవి. కానీ, సర్వమానవులకు ఇవి ఎన్నటికీ హెచ్చరికలే!

"వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులను, తమ సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు. ఇదే విధంగా మర్యమ్ కుమారుడైన మసీహ్‌ను కూడా. వాస్తవానికి ఒకే ఒక దేవుని దాస్యం తప్ప మరెవరి దాస్యాన్నీ చేసే ఆజ్ఞ వారికి యివ్వబడలేదు. ఆయన తప్ప ఆరాధనకు అర్హుడైన వాడెవడూ లేడు. ఆయన పరిశుద్ధుడు. వారు చెప్పే షిర్క్ మాటలకు అతీతుడు. *(తౌబా : 31)*

నిజానికి యూదులు, క్రైస్తవులు తమ ఆధ్యాత్మిక నాయకులను దేవుళ్లుగా పూజించేవారు కారు. కాని వీరికి కూడా దేవునితో పాటు, దైవ ధర్మంలో మార్పులు చేర్పులు చేసే, దేవుడు ఆదేశించిన జీవిత విధానంలో స్వకల్పిత పద్ధతులను చేర్చే అధికారం వుందని మాత్రమే భావించేవారు. వారి ఈ ప్రయత్నాలనే ఆరాధనల్లో భాగస్వామ్యంగా, దేవుని ఏకత్వాన్ని ధిక్కరించే చర్యలుగా అల్లాహ్ ప్రకటించాడు. వీరిని ముష్రిక్కులుగా స్థిరీకరించాడు.

ఇమామ్ అహ్మద్, తిర్మిజీ మరియు ఇబ్నె జరీర్‌లు అనేక ఆధారాల ద్వారా ఈ క్రింది హదీసును ఉల్లేఖించారు. ఇందులో పై ఖుర్‌ఆన్ వాక్యంలోని విషయం అత్యంత స్పష్టంగా అర్థం చేయబడింది. ప్రవక్త ముహమ్మద్ (స) ద్వారా ఇస్లామీయ సందేశాన్ని అదీ బిన్ హాతిమ్ (రజి)కు అందించబడింది. అప్పటికింకా హాతిమ్‌గారు ఇస్లాం స్వీకరించలేదు. క్రైస్తవమతానుసరణలో ఉండేవారు. ఆయన ఇస్లాం సందేశాన్ని విని భయపడి తన తెగను, ఆ ప్రాంతాన్ని వదలి పారిపోయారు. ఆయన తెగవారిని, ఆయన సోదరిని ఇస్లామీయ సైన్యం తన ఆధీనంలోకి తీసుకొన్నది, హాతిమ్ తన తెగకు నాయకునిగా ఉండేవారు. ఈయన గారి తండ్రి హాతిమ్‌తాయి ఆ కాలంలో ప్రఖ్యాతిగాంచిన దాతగా పేరొందారు. ప్రవక్త ముహమ్మద్ (స) వారు 'అదీ' గారి సోదరికి స్వేచ్ఛను ప్రసాదించి, తన యిష్టమైన చోటుకు వెళ్లవచ్చని అనుమతి యిచ్చారు. ఆమె నేరుగా తన సోదరుడు 'అదీ'ను కలుసుకొంది. ప్రవక్త (స) గారి కారు

ణ్యాన్ని, తాను గమనించిన ఇస్లామీయ నైతిక విలువలను, ఔన్నత్యాన్ని వివరించి ఇస్లాం స్వీకరిద్దామని తన సోదరుని ఉత్సాహపర్చింది. వారిరువురూ ప్రవక్త (స) వారి సన్నిధికి చేరుకున్నారు. ఆ సమయంలో 'అదీ'గారి మెడలో ఒక వెండి గొలుసు వ్రేలాడుతూ వుండింది. వారు ప్రవక్త(స) గారి వద్దకు చేరే సమయానికి ప్రవక్త (స)పైన వివరించిన సూరా తౌబా 31వ ఆయత్ (వాక్యం)ను పఠిస్తూ వున్నారు. అందులో యూదులు, క్రైస్తవుల ఆచరణను ఖండిస్తూ ఇలా చెప్పబడింది. "వారు అల్లహ్‌ను కాదని తమ పండితులను, తమ సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు."

ఈ ఖుర్‌ఆన్ వాక్యం విన్న 'అదీ'గారు ప్రవక్త (స) వారితో, "ఓ ప్రవక్తా! వారు తమ పండితులను, సన్యాసులను ఆరాధించరు కదా!" అని అడిగారు. దానికి దైవప్రవక్త (స) వారు ధర్మసమ్మతమైన (హలాల్‌ను) దానిని నిషేధిత మైనదిగా (హరామ్‌గా), నిషేధితాన్ని ధర్మసమ్మతమైనదిగా చేశారు. యూదులు, క్రైస్తవులు దానిని ఆమోదించి ఆచరించారు. ఇదే వారి ఆరాధన మరి వారు దైవగ్రంథాన్ని తమ వీపులవెనుక పారవేశారు. మానవుల నుండి మార్గదర్శ కత్వం పొందే ప్రయత్నం చేసారు అని వివరించారు. ఈ విషయంగా అల్లాహ్ వాస్తవానికి ఒకే దేవుని దాస్యంతప్ప మరెవరి దాస్యాన్నీ చేసే ఆజ్ఞ వారికి ఇవ్వబడలేదు అని హెచ్చరించాడు. అంటే అల్లాహ్ ఏ వస్తువునైతే నిషేధించాడో అది నిషేధించబడాలి. మరి దేనినైతే ధర్మబద్ధం చేశాడో అది ధర్మబద్ధమై పోవాలి, అమలు చేయబడాలి. అల్లాహ్‌చే ఆజ్ఞాపించబడిన ఆజ్ఞ విధించబడిన చట్టం అనుసరణ మనిషికి తప్పనిసరి అయిపోవాలి. ఈ ఏకైక ఇస్లామీయ సిద్ధాంతం మాత్రమే మనిషిని దైవేతరుల దాస్యం నుండి విముక్తి ప్రసాదించ గలుగుతుంది. దైవేతర వ్యవస్థలను వదలి ఈ సహజ విముక్తి సిద్ధాంతపు పునాదుల పట్ల నిష్ఠ కలిగివుండటం దైవదాసులైన మానవులకు తప్పనిసరి అయిన విధి.

ఇస్లామీయ సంక్షేమ వ్యవస్థ స్థాపనకు తీవ్రాతితీవ్రమైన కృషి సలపడం ఎంతటి విధి అంటే ఈ వ్యవస్థ స్థాపనకై కృషి సలపకుండా వుండలేని నిస్సహాయ స్థితిలో విశ్వాసులు వుంటారు. ఎందుకంటే, ఈ వ్యవస్థలో మాత్రమే స్వచ్ఛత, సరళత, సమత, సమన్యాయం లాంటి సార్వజనీనతలు వుండగలవు. మానవ నిర్మిత సిద్ధాంతాలలో వ్యక్తిగతమైన స్వార్థం లేక వర్గం, దేశం, జాతి, తెగలాంటి స్వార్థపర విషయాలు చోటు చేసుకోక తప్పదనే కఠోర సత్యాలను చరిత్ర మనకళ్ల ముందు నిలిపింది. మానవులలోని బలహీనతలు సమస్త, మానవ నిర్మిత సిద్ధాంతాలలో, వారి పాలనా వ్యవస్థలలో వుండక తప్పవు. కేవలం సృష్టికర్త అయిన అల్లాహ్‌చే ఆదేశించబడిన జీవన వ్యవస్థలో మాత్రమే ఎటువంటి లోపాలైనా వుండే వీలులేదు. ఎందుకంటే సృష్టికర్త ఏ ఒక్క జాతికో, తెగకో, దేశానికో, ప్రాంతానికో చెందినవాడు కాడు. సమస్త మానవులు ఆయన సృష్టితాలే. కొందరిపై ఆయనకు ప్రత్యేకమైన ప్రేమ వుండనే వుండదు. అలా వుండటం సృష్టికర్త (అల్లాహ్) గుణవిశేషణాలకు విరుద్ధమైన విషయం. ఈ విషయం దివ్యఖుర్ఆన్‌లో ఇలా స్పష్టం చేయడం జరిగింది.

> "విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్ కొరకు సత్యంపై స్థిరంగా వుండండి. న్యాయానికి సాక్షులుగా వుండండి. ఏదైనా వర్గంతో వైరం కారణంగా మీరు ఆవేశానికి లోనై న్యాయాన్ని త్యజించకండి. న్యాయం చెయ్యండి. ఇది దైవ భక్తికి సరిసమానమైనది. అల్లాహ్‌కు భయపడుతూ వ్యవహరించండి. మీరు చేసేదంతా అల్లాహ్‌కు పూర్తిగా తెలుసు.
>
> *(అల్‌మాయిద : 8)*

పై ఆదేశాన్ని ఉల్లంఘించే సాహసం ఒక విశ్వాసుల సంఘం ఎన్నటికీ చేయజాలదు. ఇస్లామీయ వ్యవస్థ వాస్తవిక చిత్రం ఒక నిజ విశ్వాసి మనోమస్తిష్కాలపై స్థిరంగా ముద్రించబడివుంటుంది. ఇస్లామీయ వ్యవస్థను స్థాపించే కృషి ఒక్కటే తమ ఇహపరలోకాల సాఫల్యానికి షరతు అని వారు స్పష్టంగా

సంపూర్ణంగా గ్రహించి వుంటారు. అలాంటి కృషిలో ఏ మాత్రం లోపమున్నా దాని ఫలితంగా ఎదురయ్యే అనేక కష్టనష్టాలను ఎదుర్కొనవలసి వుంటుందనీ, తాము పతనావస్థకు చేరుకోవడం తప్పనిసరి అని వారు పూర్తిగా విశ్వసిస్తారు. కనుక దైవాదేశాలను ధిక్కరించడం కాదుకదా కనీసం ఆ ఆలోచనను సైతం తమ మనస్సులో రావడానికి వారు అంగీకరించరు. ఈ ఆచరణాత్మకమైన సత్యాన్నే విశ్వప్రభువు యిలా తెలియపర్చాడు.

"అల్లాహ్ తనకు సహాయం చేసేవారికి తప్పకుండా సహాయపడతాడు. అల్లాహ్ మహాశక్తిమంతుడు, మహాబలవంతుడూను. మేము గనక వారికి భూమిపై అధికారాన్ని ప్రసాదిస్తే వారు నమాజ్‌ను స్థాపిస్తారు. జకాత్ యిస్తారు. మంచి చేయమని ఆజ్ఞాపిస్తారు. చెడు నుండి నిరోధిస్తారు. సకల వ్యవహారాల అంతిమ నిర్ణయం అల్లాహ్ చేతుల్లోనే వుంది." *(అల్‌హజ్ - 40 ,41)*

విశ్వాసుల ఈ సంఘం విశ్వప్రభువు పక్షంలో, అల్లాహ్ కారుణ్యం నుండి వారు వెలివేయబడతారని వారికి స్పష్టంగా తెలుసు. సృష్టికర్త ఏ ఏ పనులను అయితే చేయమని ఆదేశించాడో ఆ పనులకన్నా విశ్వాసుల సంఘానికి ప్రియమైన పనులు మరేవీ వుండవు. ఆ పనులను అత్యంత ఉన్నత రీతిలో పరిపూర్తి చేయడంలో కించిత్ అశ్రద్ధ కూడా చూపదు. ఇస్లామీయ విశ్వసమన్యాయ వ్యవస్థ, మరి ఏ ప్రాపంచిక ఇస్లామేతర వ్యవస్థ చట్రంలో యిమడజాలదు. కనుక ఆ వ్యవస్థను ఆ వ్యవస్థగానే స్థాపించే కృషి చేయవలసి వుంటుంది. విశ్వ ప్రభువుచే ఆదేశించబడిన ఈ వ్యవస్థ ఒక్కటే మనిషి అజ్ఞానపు హ్రస్వదృష్టి కోణం నుండి, సంకుచిత ఆలోచనల నుండి, వాటి ప్రభావాల నుండి సురక్షితమై వుంది.

ఈ సృష్టిలోని గోచర, అగోచర జ్ఞానం కేవలం సృష్టికర్తకు మాత్రమే వుంది. సృష్టించిన వానికే విశ్వరహస్యాలు సమస్తం ఎరుక. ఆదం సంతతి

అయిన సమస్త మానవాళికి ఆయన ఒక వ్యవస్థను ఆదేశిస్తున్నాడు అంటే మానవాళికి ఆ వ్యవస్థలోనే సకల శుభాలు నిక్షిప్తం చేసి వుంచాడని అర్థం. గతం, వర్తమానం, భవిష్యత్తుకు సంబంధించిన సంపూర్ణ జ్ఞానం కేవలం సృష్టికర్తకే వుంది కనుక, ఆయన మనిషికి ఏదైనా నిషేధిస్తున్నాడు అంటే, అందులో మనిషి క్షేమం, సాఫల్యమే నిగూఢమైవుంటుంది. ఇంతటి విశాలమైన దృష్టి, అనంతమైన జ్ఞానం, అపారమైన నిర్మాణ దక్షత మానవునికి వుండే అవకాశమే లేదు. కనుక, మావుడు తన కోసం ఒక సంపూర్ణ వ్యవస్థను తనకు తానుగా నిర్మించుకునే అవకాశం, విజ్ఞత, వివేకం, అధికారంలేని వివశుడైన జీవి. మనిషి తన జీవన వ్యవస్థ నిర్మాణం కొరకు సృష్టికర్త వైపునకు మరలడమే ఉత్తమమైనది. ఈ విషయంలో సృష్టికర్త అయిన అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు

"(దైవాభీష్టమైన) సత్యమే గనక వారి కోరికలను అనుసరించి వుంటే, భూమ్యాకాశాలు వాటిలోని జీవరాశి వ్యవస్థా ఛిన్నాభిన్నమై వుండేవి."

*(అల్ మోమినూన్ -18)*

"మేము నిన్ను ధర్మం విషయంలో ఒక స్పష్టమైన రాజమార్గంపై స్థిర పర్చాము. కనుక నీవు దానిపై మాత్రమే నడువు. జ్ఞానహీనుల కోరికలను అనుసరించకు." *(అల్‌జాసియహ్ -18)*

మానవునికి సంపూర్ణమైన జ్ఞానం పొందే అవకాశమే లేనప్పుడు అతను తన కోసం ఒక జీవన వ్యవస్థను స్వయంగా సృష్టించుకోవడం సాధ్యమే కాదు. అటువంటి నిష్ఫల ప్రయత్నం చేయడం కేవలం సర్వాధికారి, చట్ట నిర్దేశకుడు, విశ్వసామ్రాట్టు కార్యంలో వేలుపెట్టే, తలదూర్చే ప్రయత్నం అవుతుంది. ఈ ప్రయత్నం భయంకరమైన ద్రోహంగా విశ్వప్రభువు సామ్రాజ్యాధిపత్యంలో భాగం పొందడానికి చేసే కడు ఘోరమైన నేరంగా మాత్రమే పరిగణించబడుతుంది.

దైవ వ్యవస్థ స్థాపనకై అవిరళ కృషి జరపడం విశ్వాసులకు ఒక

అత్యవసర కార్యంగా దర్శనమవుతుంది. ఎందుకంటే మానవుని ఉనికి, అతని విలువ, సృష్టిలో అతని ఉన్నత స్థానాల వాస్తవ స్థితిపై ఈ వ్యవస్థ ఆధారపడి ఉంది. మానవ ఉనికి అసలు లక్ష్యం దాని వివరణ, అవగాహనా పునాదులపై ఈ వ్యవస్థ నిర్మింపబడుతుంది. మానవ పరిమిత మేధస్సు నుండి, స్వయం కల్పిత ఊహల లేక ఆదర్శాల నుండి ఊడిపడిన వ్యవస్థలలో ఉండే ఇరుకు తనం, సంకుచితత్వం, అజ్ఞానం వ్యక్తిగత లేక వర్గాల ఆశలు మనోకాంక్షలకు ఈ వ్యవస్థలో చోటు ఉండదు. లోపరహితమైన, మానవ నైజానికి తగిన ఈ దైవిక వ్యవస్థ (ఖిలాఫత్ వ్యవస్థ) స్థాపనకు (లేక నిర్మాణానికి) కృషి చేసే మార్గమే సరళమైనదేకాక చక్కనైనది కూడా.

ప్రాపంచికమైన ఇతర సామాజిక వ్యవస్థలన్నీ మానవుని వాస్తవ ఔన్నత్యాన్ని బహిర్గతపర్చలేవు. ఎందుకంటే, వాటి పునాదులు మానవ సమాజపు సహజ నైజం పునాదులపై ఉండవు. మానవ నిర్మిత జీవన వ్యవస్థల (సామాజిక వ్యవస్థ) పరిధులు అత్యంత పరిమితులు కలిగివుంటాయి. ఈ వ్యవస్థలు ఉనికిలో ఉన్నంతకాలం మానవ జాతి అత్యంత దౌర్భాగ్యపు స్థితిలో ఉండితీరుతుంది. క్రమేణా మానవ సహజ నైజం, స్వయంగా ఈ వ్యయం నిర్మిత వ్యవస్థను ధ్వంసం చేసి తన సహజ మార్గం వైపు ప్రయాణం కొనసాగి స్తుంది.

మానవ జీవితానికి సంబంధించి దైవవ్యవస్థ ఏ అవగాహన మనకు అందిస్తుందో – ఆ అవగాహనయే సత్యమైనది. ఎందుకంటే మనిషిని సృష్టించి, అతని జీవితానికి ఒక లక్ష్యాన్ని ఏర్పరచిన సృష్టికర్త వైపు నుండి ఈ అవగాహన అందించబడింది. మానవుని ఉనికి అతని జీవిత లక్ష్యం మానవుని కంటే ఉన్నతమైనవి. ఈ కారణంగానే మానవుని కొరకు మానవుల చేత నిర్మింపబడే ఏ వ్యవస్థ కూడా శాస్త్రీయం కాజాలదు. అతని నైజానికి పొసగనూ పొసగదు. మానవుని ఆలోచనలు అతని స్వంత ఔన్నత్యాన్ని సయితం గుర్తించజాలవు.

ఈ కారణంగానే మానవుడు తన సృష్టికి కారణాన్ని, జీవిత లక్ష్యాన్ని తెలుసుకోవ డానికి తనను సృష్టించిన సృష్టికర్త మార్గదర్శకత్వం పొందడం అనివార్యమవు తుంది. ఈ మార్గదర్శకత్వాన్ని పొందడానికి ముందస్తు షరతుగా తన మనో మస్తిష్కాల్లో తిష్ట వేసి వున్న కల్పిత వ్యవస్థలను త్యజించడం, దైవ మార్గదర్శ కత్వం కోసం తన హృదయాన్ని స్వచ్ఛపర్చుకోవడం అత్యంత అవసరం.

మానవునికి లక్ష్యం, విలువ, ఔన్నత్యాల గురించి తెలుసుకునేందుకు ప్రచారంలో వున్న తాత్విక దృక్పథాలను పరిశీలిస్తే అంతులేని గందరగోళానికి గురికాక తప్పదు. ఒక తాత్వికుని మాటను మరో తాత్వికుడు గందరగోళ పర్చడం మనకు అనుభవంలో వున్న విషయమే. ఈ గందరగోళానికి స్వయంగా తాత్వికుడు కూడా మానవుడు కావడమే కారణంగా మనం తెలుసుకోగలం. తాత్విక మైదానం బుద్ధి, వివేకాలు, దైవమార్గదర్శకత్వంలో శూన్యమైతే జీవితపు విలువలు అధః పాతాళానికి చేరుకోక తప్పదు. మానవుని పరిశీలన, జ్ఞానసము పార్జనల మైదానం తన స్వంత జీవితంలోనూ తన చుట్టూ వున్న భౌతిక ప్రపం చంలోనూ తన 'దైవ ప్రతినిధితనం'లో (ఖలీఫాతనంలో) భద్రపర్చబడి వుంది. దైవ ప్రతినిధి తత్వపు వ్యవస్థ (ఖిలాఫత్ వ్యవస్థలో) మాత్రమే సృష్టికర్త సహాయం, సంరక్షణ, వరప్రసాదాల వెల్లువ సాధ్యమవుతుంది. ఈ వ్యవస్థలో మాత్రమే మానవునికి, అతని జీవిత లక్ష్యం పూర్ణత్వం పొందగలదు. ఈ కారణంగా దైవ వ్యవస్థ లేక ఖిలాఫత్ వ్యవస్థ స్థాపన కోసం నిరంతర కృషి జరపడం విశ్వాసుల తప్పనిసరి విధి అయిపోతుంది. ఈ వ్యవస్థ ఒక్కటే మానవ నైజానికి అత్యంత తగినది, శాస్త్రీయమైనది, అత్యంత సహజసిద్ధమైనది కూడా.

విశ్వవ్యవస్థతో సానుకూలత కలిగిన ఏకైక మానవ జీవన వ్యవస్థ ఖిలాఫత్ వ్యవస్థ. మిగిలిన మానవ నిర్మిత సాంఘిక జీవన వ్యవస్థలన్నీ విశ్వ వ్యవస్థకు వ్యతిరేకమైనవి. ఈ కారణంగా ఖిలాఫత్ వ్యవస్థను స్థాపించడానికి కృషి సల్పడం, అంతిమంగా స్థాపించడం విశ్వాసుల సంఘానికి అత్యంత

అవసరమవుతుంది. ఖిలాఫత్ వ్యవస్థ స్థాపన ద్వారా మానవ సమాజం దాని జీవన వ్యవస్థ విశ్వవ్యవస్థలో (సృష్టిలో) భాగం కావడంతో పాటు సృష్టి నుండి నిరంతరం సహాయం పొందడానికి అర్హత పొందుతుంది. తత్ఫలితంగా మానవ సమాజం సృష్టి సహాయ నిరాకరణ నుండి రక్షింపబడుతుంది. అంతేకాదు, సృష్టి వ్యవస్థ నుండి సహకారం పొందే హక్కు కలిగి వుంటుంది. విశ్వవ్యవస్థ సంపూర్ణ సహకారం లేకుండా మానవుడు భూమిపై 'ఖలీఫా' (దైవ ప్రతినిధి) బాధ్యతను నిర్వహించడం సాధ్యమే కాదు. విశ్వవ్యవస్థ లేక సృష్టి వ్యవస్థతో మానవ సాంఘిక వ్యవస్థ సమ్మిళితమైనప్పుడు లేక మమేకమైనపుడు మాత్రమే విశ్వవ్యవస్థ సంపూర్ణ సహకారపు జ్ఞానవిజ్ఞాన ద్వారాలు తెరవబడతాయి. విశ్వాగ్నిలో కాలిబూడిద అయ్యే బదులు దాని నుండి వేడి, వెలుతురు, శక్తి లాంటి లాభాలను (ప్రయోజనాలను) పొందగలడు.

విశ్వవ్యవస్థలో మన భూమి, అందులోని మానవ సమాజం, విడదీయ లేని భాగమైన కారణంగా, అనివార్యంగా మనిషి నైజం కూడా విశ్వ వ్యవస్థకు అనుగుణంగా వుంటుంది. విశ్వ వ్యవస్థ మొత్తంగా సృష్టికర్త అయిన దేవుని చట్టాలకు బద్ధమై కొనసాగుతుంది. మన చుట్టూవున్న ప్రకృతి, స్వయంగా మానవ దేహం కూడా ఈ చట్టాలకే (విధి విధానాలకే) లోబడి వుంది. ఈ కారణంగా మానవ జీవన వ్యవస్థ కూడా సృష్టికర్త చట్టాలకు లోబడే కొనసాగ వలసివుంది. ఎప్పుడైతే మనిషి సహజసిద్ధమైన ఈ ప్రకృతి వ్యవస్థను వదలి, తన కోసం తనకు తానుగా ఒక వ్యవస్థను (విధి విధానాల సమాహారాన్ని) నిర్మించుకుంటాడో అప్పుడే విశ్వవ్యవస్థ నుండి మనిషి బహిష్కరింపబడతాడు లేక విశ్వ వ్యవస్థకు వ్యతిరేకిగా మారుతాడు. ఈ కారణంగా అనివార్యంగా తన స్వంత నైజానికి కూడా వ్యతిరేకి అవుతాడు. ఫలితంగా తన ఉనికిని తానే నాశనం చేసుకునే దౌర్భాగ్యపు స్థితికి చేరుకుంటాడు. విలువల భ్రష్టత్వానికి నమూనాగా నిలుస్తాడు. ఈనాటి సాంకేతిక మానవ ప్రపంచం విరివిగా జ్ఞానం

కలిగివున్నప్పటికీ భౌతిక వనరులు, అవకాశాలు విస్తృతంగా అందుబాటులో వున్నప్పటికీ నిరాశ, నిస్పృహలకు, అశాంతి అభద్రతలకు లోనవుతున్నాడు. ఈ అసంతులన జీవితం, దాని ప్రభావం మూలంగా మనిషి పై బలహీనతల నుండి బయటపడటానికి, సమాజాన్ని సంస్కరించడానికి కృషి చేయకపోగా దాని నుండి పారిపోవడానికి ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నంలో గంజాయి, నల్లమందు, బ్రౌన్ షుగర్‌లాంటి మత్తు పదార్థాలకు అలవాటై క్రమంగా వాటికి బానిస అవుతున్నాడు. ఈ క్రమం అత్యంత వేగంగా పతనావస్థకు చేరుకుంటుంది. భౌతిక సుఖం, ఆహార పదార్థాల ఉత్పత్తిలో ఇతోధిక అభివృద్ధి అనుకూలతలు కలిగివున్నప్పటికీ అసహనం, అశాంతి, అభద్రతా భావాలు రోజురోజుకూ పెరిగి వటవృక్షాలవుతున్నాయి. సంస్కరణాభిలాషులు, మానసిక శాస్త్రవేత్తలు ఎంత ప్రయత్నించినా మానవ సమాజం ఈ జాడ్యాల నుండి విముక్తి పొందలేకపోవడం సరికదా మరింతగా అందులో కూరుకుని పోతుంది.

ఏ కాస్త పరిశీలనా శక్తి వున్న వ్యక్తి అయినా, అమెరికా, రష్యా లాంటి అభివృద్ధి చెందిన దేశాలకు వెళ్తే అతను, మొట్టమొదట "ఈ అభివృద్ధి చెందిన ప్రజలు తమ నుండి తామే పారిపోవడానికి తీవ్ర కృషి చేస్తున్నారని" ఇట్టే గుర్తిస్తాడు. భౌతిక సుఖాల వెంపర్లాటలో, నైతిక విలువల పతనపు ఊబిలో ఈ అభివృద్ధి చెందిన వారు మరింతగా కూరుకొనిపోతున్నారని గ్రహిస్తాడు. కాంక్షలు కోరికల వెంపర్లాట, నైతిక గమ్యరాహిత్యం, ఉద్రేక పూరిత జీవితం ఫలితంగా నేరాలకు పాల్పడుతున్న మానసిక అసంతులనం తరతరాలుగా భద్రపర్చుకుంటూ వస్తున్న సభ్యతా సంస్కారాలు, మానవ విలువల విధ్వంసంపై సమాజాల విధి లిఖితమైపోయాయి.

నిత్యపరిశోధనల ఫలితంగా వైద్య ఆరోగ్య రంగాలలో అద్భుత ప్రగతి సాధించబడింది. అతి తీవ్రమైన వ్యాధులకు సయితం ఆధునిక వైద్య సదుపాయాలు నేడు మనకు అందుబాటులో ఉండటం గర్వించదగ్గ విషయం.

వ్యవసాయ రంగంలో విశేషమైన ఆవిష్కారాలు నేడు మన స్వంతం. వాతావరణ పరిశోధనల అద్భుతమైన ప్రగతిని తలచుకుంటూనే హృదయం ఉప్పొంగు తుంది. కృత్రిమ ఉపగ్రహాలు, స్కైలాబ్‌లు మానవ విజ్ఞాన ప్రగతికి నిదర్శనా లుగా నిలిచి వున్నాయి. శాస్త్ర సాంకేతిక రంగాలలో అభివృద్ధి జెట్ వేగంతో సాగుతుంది : కాని, పై శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధి మానవ జీవితంపై, అతని వ్యక్తిత్వ వికాసంపై ఎటువంటి ప్రభావం చూపుతున్నాయి? అనేది అసలు ప్రశ్న. అలజడి, అశాంతిమయమైన మానవ జీవితానికి స్థిరత్వం, శాంతి ప్రాప్తమయ్యాయా? మానసిక రంగం అభద్రతా భావం నుండి ముక్తి లభిం చిందా? ప్రశాంతత పొందగలిగిందా? అని ప్రశ్నించుకుంటే సమాధానం 'లేదు' అనే వస్తుంది. పైన పేర్కొన్న సాంకేతిక రంగాలలో సాధించిన ప్రగతి మూలంగా లిభించవలసిన సకారాత్మక స్థితి లభించకపోగా తత్ వ్యతిరేకంగా అశాంతి, అలజడి, అస్థిరత, అభద్రతా భావాలు రోజురోజుకు పెరిగిపో తున్నాయి. ఈ అభివృద్ధి ద్వారా మానవుని ఉనికికి కారణమేమిటి? అతని జీవిత లక్ష్యం ఏమిటి? లాంటి ఉన్నత స్థాయి ఆలోచనలు ఉద్భవించడం లేదు. మానవుని ఉనికి, అతని లక్ష్యాలను ఇస్లామీయ తాత్విక దృష్టితో పరిశీలిస్తే నేటి పాశ్చాత్య సభ్యతా సంస్కారాలు, యాంత్రిక అమానవీయ సంస్కృతులు మరు గుజ్జుల్లా, మానవ జాతికి శాపంలా కనిపిస్తాయి.

ఈ శాస్త్ర సాంకేతిక విజయాల వీరులు తమ దేశ ప్రజలకు సరికొత్త దేవుళ్లను (ఆరాధ్యులను) సృజించి యిచ్చారు. వాటి ఆరాధనే వీరు లక్ష్యంగా చేసుకున్నారు. ధన పిపాస, మనో కాంక్షల వెంపర్లాట, పేరు ప్రతిష్ఠలకై పాకు లాట, ఆధిపత్య జాత్యాహంకారాలు నేడు దైవాలుగా పూజించబడుతున్నాయి. మానవుని ఉనికి – జీవిత లక్ష్యం లాంటి ఉన్నత భావాలు, ఆదర్శాలు నేటి మానవ సమాజానికి లేని కారణంగా దాని అనివార్య ఫలితంగా వాస్తవ దైవా రాధన వంటి అత్యుత్తమ ఆచరణ నుండి దూరంగా జరిగిపోతుంది. దైవేతర విషయాలకు, భావాలకు, వ్యవస్థలకు దాసోహమవుతుంది.

మానవ సమాజాన్ని సృష్టికర్త – ప్రభువు, అయిన నిజదైవం వైపునకు మరల్చడానికి సృష్టిలో మానవుని ఔన్నత్యానికి, నైజానికి అనుగుణంగా అత్యుత్తమ మానవ లక్ష్య సాధన వైపునకు మలచడానికి దైవ వ్యవస్థ లేక ఇస్లామీయ వ్యవస్థ లేక ఖిలాఫత్ వ్యవస్థను స్థాపించే కృషి చేయడం మానవ సమాజానికి తప్పనిసరి విధి అవుతుంది. ఖిలాఫత్ వ్యవస్థలో మాత్రమే సృష్టి సూత్రాల విధి విధానాల వ్యవస్థకూ, మానవ సమాజ విధి విధానాల వ్యవస్థకూ మధ్యనున్న వైరుధ్యం పరిష్కరించబడుతుంది. ఈ సత్యాన్నే చివరి దైవగ్రంథం దివ్యఖుర్‌ఆన్ పలుమార్లు తేటతెల్లం చేసింది. దైవేతర వ్యవస్థల్లోని లోపాలను ఎత్తి చూపింది. సహజమైన, మానవ నైజానికి తగిన, శాస్త్రీయమైన జీవన వ్యవస్థను ఈ క్రింది మాటలలో వ్యక్తం చేసింది.

> "(విశ్వసించని) ఈ ప్రజలు అల్లాహ్‌కు విధేయత చూపే జీవన విధానాన్ని వదలిపెట్టి, మరొక జీవన విధానాన్ని కోరుతున్నారా? నిజానికి భూమ్యాకాశాలలో వున్న సకల వస్తువులు (విశ్వ వ్యవస్థ మొత్తంగా) ఇష్టం వున్నా –లేకపోయినా అల్లాహ్ విధేయతకు కట్టుబడి ముస్లిములై జీవిస్తున్నాయి. ఆయన వైపునకే సమస్తం మరలిపోవలసి ఉంది."
>
> *(ఆలి ఇమ్రాన్ 3:83)*



# సరళమైన, సులభమార్గం ఇస్లామ్

అత్యంత ఉన్నత స్థాయి నైతిక విలువలు, కఠినమైన నియమ నిబంధనల పునాదిపై నిర్మింపబడే ఇస్లామీయ సామాజిక వ్యవస్థలో మానవులు ఎక్కువ కాలం మనుగడ సాగించలేరనే విమర్శ తరచూ విమర్శకులు చేస్తుంటారు. "ఇస్లామీయ (ఖిలాఫత్) వ్యవస్థను స్థాపించిన సహాబాల (రజి) తరువాత ఈ వ్యవస్థలో అనేక రుగ్మతలు, ఇస్లామేతర ఆచరణలు చోటు చేసుకోవడం జరిగింది. ఆ తరువాత వారు ఇతర జీవన వ్యవస్థలపై దృష్టి మరల్చారు" అని సహేతుకంగా వాదించేవారూ ఉన్నారు.

పై విమర్శలను, వాదనలను పైపైన గమనిస్తే అవి 'నిజం' అని భావించబడతాయి. అనేక మంది రచయితలు, చరిత్రకారులు, విమర్శకులు పై విషయాన్ని రూఢీ చేయడానికి తీవ్రంగా ప్రయత్నించారు. "ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థ ఆచరణకు సాధ్యంకాని ఒక ఆదర్శం మాత్రమే. ఇందులోని కఠిన నియమ నిబంధనలు, నిబద్ధతలు మానవ నైజానికి పొసగనివి కనుక, ఈ వ్యవస్థను మానవులు సుదీర్ఘకాలం భరించలేరు" అని రుజువు చేయడానికి ఈ రచయితలు, చరిత్రకారులు, విమర్శకులు బహుదా ప్రయత్నాలు చేశారు. నిజానికి ఈ విమర్శల వెనుక అత్యంత మోసపూరితమైన కుట్ర దాగి వుందని నిశితంగా పరిశీలిస్తే అర్థమవుతుంది. ఖిలాఫత్ వ్యవస్థ (ఇస్లామీయ వ్యవస్థ) స్థాపన పట్ల దాని కార్యకర్తల మనోమస్తిష్కాల్లో సందేహాలు, నిరాశా నిస్పృహలు

రేకెత్తించడమే ఈ విమర్శల ఉద్దేశంగా వుందనేది మనకు అర్థమవుతుంది. అత్యంత సంక్షేమకరమైన దైవవ్యవస్థ స్థాపన కోసం మానవ వనరులన్నింటినీ వెచ్చిస్తూ సాగుతున్న తీవ్రమైన కృషిని నిరోధించడానికి ఈ విమర్శకులు ప్రయత్నం చేస్తున్నారనేది కాదనలేని సత్యంగా రుజువవుతుంది. ప్రవక్త సహచరులు హజ్రత్ ఉస్మాన్ (రజి)గారి హృదయవిదారకమైన హత్య, ఆపై చోటుచేసుకున్న పరిణామాలు, హజ్రత్ అలీ (రజి), హజ్రత్ మావియా (రజి)ల మధ్య చెలరేగిన రాజకీయ వైషమ్య వైరుధ్యాలు, వాటి వల్ల సంభవించిన బాధాకరమైన సంఘటనలు ఈ కుట్రపూరిత విమర్శకులకు ఆధారభూతాలుగా అవకాశాలు అందిస్తున్నాయి. తమ విమర్శలను రుజువు చేయడానికి పై చారిత్రక సంఘటనలను వక్రీకరించి కొంత, మసిపూసి మరికొంత, భూతద్దంలో చూపి మరింతగా చూపిస్తున్నారు. కొంతమంది నిజాయితీపరులైన రచయితలు ఈ కుట్రలో నిజాయితీగానే పాల్గొన్నారు. లేక సహకరించారని, సహకరిస్తున్నారని చెప్పవచ్చు. ఇస్లామీయ తత్వశాస్త్ర అధ్యయన లోపం వల్ల, ఇస్లాంను రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యవస్థగా కాక కేవలం ఒక ధార్మిక వ్యవస్థగా చూపడం ద్వారా దాని రాజకీయ వ్యవస్థలోని వైరుధ్యపూరిత కాఠిన్యం నుండి ఇస్లాంను రక్షించే ఉద్దేశ్యంతో ఈ నిజాయితీపరులైన విమర్శకులు పూనుకున్నారు. దైవవ్యవస్థ స్థాపకులైన ప్రవక్త ముహమ్మద్ (స), ఆయన తర్వాత వారి సహచరులైన అబూబక్ర్ (రజి), ఉమర్ (రజి)ల కాలాన్ని మాత్రమే వీరు ఆదర్శంగా భావించారు. తమ చైతన్యలోపం, అవగాహనా రాహిత్యాల కారణంగా ఇస్లామీయ జీవన విధానం లేక వ్యవస్థ 'జీవన విధానంగా' విస్తరించడం ఆగిపోయినట్లుగా వీరు సిద్ధాంతీకరించుకున్నారు. ఈ కారణంగా దైవవ్యవస్థ స్థాపన కోసం చేయవలసిన అవిరళ కృషి నుండి, మానవ విలువలు చేరవలసిన ఉన్నత శిఖరాల నుండి, ఉజ్వలమైన భవిష్యత్తు నుండి తమ్ముతాము వేరుపర్చుకున్నారు.

కాని, ఇస్లామీయ దృక్పథాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడానికి దాని సంపూర్ణ రూపాన్ని మొత్తంగా అధ్యయనం చేయవలసి వుంది. దాని ఆలోచనా విధానంతోపాటు, సదరు వ్యవస్థ నిర్మాణంలో మానవ వనరుల పాత్ర ఏ మేరకు వినియోగించబడింది? సుదీర్ఘ కాలం మానవ సమాజానికి మార్గదర్శకత్వం అందించడంలో ఇస్లామీయ వ్యవస్థ పని విధానం ఎలా ఉంటుంది? అనే విషయాలను కూలంకషంగానూ, మరింత లోతుగానూ అధ్యయనం చేయ వలసివుంటుంది.

మనిషి శక్తికి మించిన పని మనిషికి ఇవ్వడం వల్ల (అప్పగించడం వల్ల), మనిషి ఆ పనిని భరించలేని స్థితికి చేరుకుంటాడనే విమర్శ నిజానికి పసలేనది. విమర్శకులు విమర్శించినట్లు దైవవ్యవస్థ స్థాపన తీవ్రమైన, ఉన్నత స్థాయిగల కృషిని ఆశిస్తుంది. అయితే ఈ కృషి పూర్తిగా మానవ నైజానికి తగినది కావడమే విశేషం. మనిషి నైజంలోని ప్రతిభను అది సంపూర్ణంగా విశ్వసిస్తుంది. దానిని ఆచరణకై ఉత్సాహపరుస్తుంది. దైవవ్యవస్థ స్థాపనలోని మరో విశేషం ఏమిటంటే, అది మానవ నైజంలోని ఉన్నత స్థాయిని అది ముందుగానే గుర్తెరిగివుంటుంది. మనిషి ఆలోచనలను, అతని హృదయాన్ని ఏ పునాదులపై ఎలా మలచవలెనో (దైవవ్యవస్థకు) పూర్తి జ్ఞానం వుంది. మానవ స్వభావంలోని సరళతలు, సంక్లిష్టతలు అది బాగా ఎరుగు. మనిషి ఆచరణ, ఆలోచనల రహదారులను అది అత్యంత సుందరంగా తీర్చిదిద్ద గలదు. మానవుని శక్తిసామర్థ్యాలు, ప్రతిభాపాటవాలు, స్థిరచిత్తాల గురించి ఖిలాఫత్ వ్యవస్థకు సంపూర్ణ అవగాహన ఉంటుంది. అంతేకాదు మానవుని కోరికలు, కాంక్షలు, ఆశలు, అవసరాలపై కూడా లోతైన అవగాహన కలిగి ఉంటుంది. ఈ కారణంగా దైవవ్యవస్థ నిర్మాణానికి మనిషికి అవసరమైన పూర్తి స్వేచ్ఛను అది అందిస్తుంది.

దైవ వ్యవస్థలోని మహోన్నతలు, విశాలతత్వం, పవిత్రత, స్వచ్ఛతలు

అన్నీ కూడా ఈ భూమిపై నివసిస్తున్న మనిషి కోసమే. ముందే వివరించినట్లుగా దైవవ్యవస్థ మానవ నైజానికి తగిన సహజ ధర్మాలన్నింటినీ గౌరవిస్తుంది. వాటిని పరిపూర్తి చేస్తుంది. ఈ కారణంగా స్వేచ్ఛ కలిగిన మానవుడు తన నిజ స్వభావానికి అనుగుణంగా తన ఆలోచనలను, ఆచరణలను ఎప్పుడైతే మమేకం చేస్తాడో అతని కోరికలు, కాంక్షలు, ఆశలు, లక్ష్యాలు పరిపూర్తి చేయబడటానికి మార్గాలు సుగమం అవుతాయి. ఈ కారణంగా జీవితంలో సరళత్వం చోటు చేసుకుని ఆచరణ సులభతరమవుతుంది. తన సహజత్వానికి తగిన ఉన్నత శిఖరాలను అధిరోహించడానికి, తన నైజానికి తగిన సహజ మార్గాలను అన్వేషిస్తాడు... అందులో ప్రయాణం కొనసాగిస్తాడు. ఈ సుదీర్ఘ ప్రయాణంలో తన అంతరాత్మకు ప్రశాంతత, శాంతి, స్థిరత్వం, అపారమైన విశ్వాసపు విధులు సంప్రాప్తమవుతాయి.

ఎవరైతే ఈ దైవవ్యవస్థ స్థాపన గురించి స్వయంగా అనుమానాలకు గురై, ఇతరులను కూడా అనుమానాలకు గురిచేస్తున్నారో వారు నిజంగా ఈ వ్యవస్థలోని నైతిక విలువల సమున్నతిని చూసి వారు భయాందోళనలు చెందుతున్నారు. ఎందుకంటే, నైతిక విలువల ఆచరణ వారికి ఓ ఖైదులా గోచరిస్తుంది. ఈ నైతిక విలువల దైవవ్యవస్థలో విశృంఖలత్వానికి, విచ్చలవిడితనానికి తావులేదు. విషయాన్నే వ్యక్తి స్వేచ్ఛతో ముడిపెట్టి, స్వేచ్ఛలేని సమాజంలో కోరికలు, కాంక్షలు, ఆశలు ఆశయాలు నెరవేరలేవని సిద్ధాంతీకరిస్తారు. నిజానికి ఈ వాదం కేవలం స్వీయ మానసిక ధోరణికి చెందినది తప్ప వాస్తవం కాదు. ఇస్లామీయ తాత్విక దృక్పథాన్ని అర్థం చేసుకోని కారణంగానూ, ఇస్లాం పట్ల విపరీతమైన ద్వేషాన్ని పెంచుకున్న కారణంగానూ ఈ విమర్శకులలో ఒక విచిత్రమైన మానసిక ధోరణి చోటుచేసుకుని ఉంది. ఇస్లామీయ నైతిక వ్యవస్థ, కేవలం ఒక కఠినమైన నియమ నిబంధనల జాబితా కాదు. అది ఒక నిర్మాణాత్మకమైన శక్తి. మానవ సమాజాన్ని నిరంతరం, అభివృద్ధి వైపునకు మార్గదర్శకం

చేసే ఉద్యమం. తద్వారా మనిషి స్వయంగా తన వాస్తవికతను అత్యంత సుం దరంగా ఆవిష్కరింపచేసుకుంటాడు.

ఖిలాఫత్ వ్యవస్థలో నైతికతకు కొలమానాలుగా, సైద్ధాంతిక ఆమోదం, ఆచరణలుంటాయి. మానవ జీవిత లక్ష్యానికి చేరుకునే పయనంలో అడ్డంకులుగా మారే, చైతన్యరాహిత్యం, నిరాశానిస్పృహలు ఈ వ్యవస్థకు బద్ధ శత్రువులు, ఇస్లామీయ అవగాహన ప్రకారం దైవసృష్టితమైన ఈ భూమిపై దైవాదేశితమైన ఖిలాఫత్ వ్యవస్థను స్థాపించడానికి దైవప్రసాదితాలైన మానవ శక్తి, సామర్థ్యాలను పూర్తిగా వినియోగించడమే మానవ జీవిత లక్ష్యంగా వుంటుంది. ఇస్లామీయ నైతిక వ్యవస్థ అసలు లక్ష్యం, మంచిని స్థాపించడం, చెడును నిరోధించడమే. ఈ పనిలో మనిషి ఉనికి ప్రాథమిక ప్రతిభలు ఖర్చు చేయబడతాయి. ఇస్లాం దృష్టిలో ఈ ఆచరణ మాత్రమే అత్యంత సుందర మైనదిగా భావించబడుతుంది. బయటికి ఖైదుగా(?), స్వేచ్ఛా రహితమైనదిగా (?) కనబడుతున్న ఇస్లామీయ నైతిక వ్యవస్థ నిజానికి అంతర్గతంగా అత్యంత స్వేచ్ఛాయుతమైన ఆచరణగా సాక్షాత్కరిస్తుంది. ఉదాహరణకు, అక్రమ లైంగిక సంబంధాల ద్వారా పొందే సుఖాల నుండి, తన్నుతాను నిరోధించుకునే చర్యనే తీసుకోండి. అది పైకి వ్యక్తి లైంగిక స్వేచ్ఛకు అభ్యంతరకర మైనదిగా కనిపిస్తుంది. కాని, అది వ్యక్తిని లైంగిక విశృంఖలత్వపు బానిసత్వం నుండి విముక్తిని ప్రసాదిస్తుంది. అదే సమయంలో సృష్టికర్త ద్వారా, ధర్మబద్ధం చేయబడిన మార్గాల ద్వారా తన సహజమైన లైంగిక కోరికలను, అవసరాలను తీర్చుకొనేం దుకు సంపూర్ణమైన స్వేచ్ఛను ఆ వ్యక్తి కలిగి వుంటాడు.

ఇదే విధంగా తోటి మానవుడిని ఆదుకోవడం, సహాయపడటం లాంటి త్యాగపూరిత చర్యలనే తీసుకోండి. అవి పైకి ఇతరుల అవసరార్థం తన కోరికలను అణుచుకోవడంగా, స్వేచ్ఛకు భంగకరంగా కనిపిస్తుంది. కాని, పై చర్య నిజానికి వ్యక్తిని పిసినారితనం నుండి విముక్తి కలిగిస్తుంది. స్వార్థం,

అత్యాశలపై వ్యక్తిత్వం ఆధిపత్యం వహించే చర్యలా, మంచిని స్థాపించే పరిస్థితు లను విశాలపర్చే కృషిలా మనకు కనిపిస్తుంది. ఇదే విధంగా అనేక ఉదాహర ణలు చెప్పవచ్చు. కాని ఇస్లామీయ నైతిక విలువల వ్యవస్థపై వర్షించే విమర్శ లకు, సకారాత్మక జవాబు ఇవ్వడం, ఇస్లామీయ నైతిక వ్యవస్థ వాస్తవిక స్థితిని, దాని ఆత్మను విశదపర్చడమే ప్రధాన ఉద్దేశ్యం.

ఇస్లాం, పాపకార్యాలు, ధర్మవిరుద్ధ కార్యాలకు ఖైదు విధిస్తుంది. ఇస్లా మీయ నైతిక వ్యవస్థపై ధర్మవిరుద్ధ పాప, కల్లోలజనిత కార్యాలకు, పరిస్థితులకు బేడీలు వేయడం ద్వారా సమాజంలో శాంతి, నైతిక విలువల సమున్నత వాతావరణం సృష్టిస్తుంది. ఇస్లాం వ్యతిరేకులు ఈ పరిస్థితినే స్వేచ్ఛారహిత మైనదిగా విమర్శిస్తున్నారు. ఇస్లాం మనిషిలోని 'మంచి' అనే సహజ స్వభావాన్ని పుష్పించేలా చేస్తుంది. అల్లాహ్ మనిషిని అద్భుతంగా సృష్టించాడు. ఎప్పుడైతే సహజంగా మంచి స్వభావం కలిగిన మనిషి, తన సహజ నైజానికి విరుద్ధంగా ప్రవర్తిస్తాడో, అప్పుడే కడునీచునిగా, అధమాధమునిగా మారిపోతాడు. ఈ విషయాన్ని చివరి దైవగ్రంథమైన దివ్యఖుర్ఆన్ ఇలా హృద్యంగా విశదపరి చింది.

> "మేము మానవుడిని అద్భుతమైన ఆకృతిలో సృజించాము. తరువాత మేము అతడిని వెనక్కి తిప్పి నీచాతినీచునిగా మార్చివేశాము. (అయితే) విశ్వసించి సత్కార్యాలు చేసేవారు తప్ప. అలాంటి వారికి అనంతమైన ప్రతిఫలం లభిస్తుంది." *(దివ్యఖుర్ఆన్ 95 :3-5)*

మంచి ఆధారంగా మనిషిలో ఉన్న సహజ నైజాలను గౌరవించే వాటిని ఉన్నత శిఖరాలకు చేర్చే వ్యవస్థయే మనిషికి తగినది. ఈ వ్యవస్థ అశ్లీలం, అనైతికత, నీచత్వం పునాదులపై వున్న 'చెడు' అనే అసహజాల నుండి మనిషిని, మానవ సమాజానికి విముక్తి, స్వేచ్ఛ ప్రసాదిస్తుంది. ఈ మంచీ చెడుల పోరా టంలో మనిషికి మంచి వైపున సహకారిగా వుంటుంది. ఇస్లాం మానవ

సమాజానికి మార్గదర్శిగా, కాపలాదారునిగా ఉండే బాధ్యతాయుత వ్యవస్థను స్థాపించ కోరుతుంది. సమాజంలో మంచిని స్థాపించే కృషి చేసే వ్యక్తులకు, గ్రూపులకు బలాన్ని, శక్తిసామర్ధ్యాలను అందించే సామాజిక వాతావరణం ఏర్పరిచే కృషిచేస్తుంది. తద్వారా సహజమైన 'మంచి'కి మంచిని స్థాపించే కృషికి మధ్యనున్న అడ్డంకులను తొలగించడం సాధ్యమవుతుంది.

ఎవరైతే, ఇస్లామీయ నైతిక వ్యవస్థ మానవ స్వభావంపై భరించలేని భారమని భావిస్తున్నారో మానవ సమాజంలో ఈ వ్యవస్థను స్థాపించడం అసాధ్యమని భావిస్తున్నారో వారు, ఇస్లామీయ వ్యతిరేక వ్యవస్థలో జీవిస్తూ, ఆ వ్యవస్థ కంటి అద్దాల నుండి ప్రపంచాన్ని వీక్షిస్తున్నారు. ఇస్లామీయ భావ జాలానికి వ్యతిరేకమైన వాతావరణంలో వుంటూ, దాని ప్రభావం నుండి బయటపడని వారికి నిజంగా ఇస్లామీయ నైతిక వ్యవస్థ భరించలేని భారంగానే ఉంటుంది. దుర్గంధపూరితమైన మురుగు వాతావరణానికి అలవాటుపడిన నాసికలు సుగంధ భరిత సువాసనలను భరించలేవు కదా. ఈ విధంగానే అశ్లీలం, అనైతికత, విచ్చలవిడి వాతావరణమున్న సమాజంలో శీలం, స్వచ్ఛత, నైతిక విలువలు భరించరాని బరువుగా భావించడం సహజమే. ఉన్నతమైన మానవీయ విలువలు గల ఇస్లామీయ వ్యవస్థలో సమాజపు ఆచరణ అత్యంత సహజంగా ఉంటుంది. సహకారం, మమకారం, మంచితనం, పరోపకారం, స్వచ్ఛత, పరస్పర హక్కుల బాధ్యతల చైతన్యం లాంటి సకారాత్మక విలువల పట్ల ఈ వ్యవస్థ అత్యంత జాగరూకత కలిగి ఉంటుంది. నిరంతరం మానవ విలువల ప్రగతి, విస్తృతి కోసం కృషి చేస్తూనే ఉంటుంది. అదే సమయంలో వ్యతిరేక స్వభావాలైన దుర్గుణాలకు వ్యతిరేకంగా మొత్తం సమాజం సంపూర్ణ శక్తితో సమీకరింపబడి ఉంటుంది.

ఇస్లామీయ వ్యవస్థ మొత్తంగా నైతిక విలువలకు కాణాచిలా నిలుస్తుంది. ఈ వ్యవస్థలో మానవీయ విలువలు ఉన్నత శిఖరాలకు చేరుకుంటాయి.

ఎవరైనా దుష్టత్వానికి ప్రతినిధిగా నిలవాలని ప్రయత్నించినా వ్యవస్థలోని సమస్త నకారాత్మక శక్తులు ఒక్కటై ప్రతిఘటిస్తాయి. దుర్గుణాలకు కారకాలైన సమస్త ద్వారాలను మూసివేస్తాయి. ఒక్క మాటలో ఇస్లామీయ వ్యవస్థలో మనిషి చెడ్డవాడిగా జీవించడం దుర్లభమైపోతుంది. మంచివాడిగా జీవించడం అత్యంత సులభమైపోతుంది.

వ్యక్తిగతంగా 'వ్యక్తి'పైనా, సామూహికంగా 'సమాజం' పైనా కేవలం సృష్టికర్త అయిన అల్లాహ్ ఆధిపత్యమే వుండాలని, దేవుని ఆదేశిత వ్యవస్థ మాత్రమే స్థాపించబడాలని ఇస్లాం ఆశిస్తుంది. దానికై తీవ్రమైన కృషి చేస్తుంది. మానవ సమాజంపై ఏ వ్యక్తి లేక వర్గం, తెగ లేక పార్టీ ఆధిపత్యాన్ని అది అంగీకరించదు. దైవంచే సృజన చేయబడిన మనిషిపై, అతని సామూహిక జీవన విధానంపై కేవలం దైవానికి మాత్రమే ఆధిపత్యం వుండాలి తప్ప సృష్టితాలైన మానవ వర్గానికి ఆ అధికారం లేదు. అలా అధికారముందని వాదించడం, దానికై పరుగులు పెట్టడం, దైవధిక్కారంగా, ద్రోహంగా, దైవాధికారంలో జోక్యం చేసుకోవడంగా భావించబడుతుంది. ఇస్లామీయ వ్యవస్థలో పాలనాధికారం, చట్ట నిర్మాణం కేవలం సృష్టించిన సృష్టికర్తకే చెల్లుతుంది. మరో మాటలో దైవ వ్యవస్థను మానవ సమాజంపై స్థాపించడమే ఇస్లామీయ ధ్యేయంగా ఉంటుంది. 'లా యిలాహ ఇల్లల్లాహ్' అనే విశ్వాస ప్రకటనకు, సాక్ష్యానికి అసలు అర్థం ఇదే మరి. ఇస్లామీయ వ్యవస్థ చల్లని సంక్షేమకర నీడలో ఒక విశ్వాసి తన జీవన విధానాన్ని, జీవితపు నిజ విలువలతో, సుఖంగా, సులభంగా, సరళంగా జీవించగలగాలని ఇస్లాం కాంక్షిస్తుంది. మానవునికి, మానవుని జీవిత లక్ష్యాల విషయంలో ఇస్లామీయ తాత్విక దృక్పథం మిగిలిన ఇతర తాత్విక భావాలకంటే భిన్నమైనది, ప్రత్యేకమైనది కూడా. ఇస్లామీతర భావజాలాలన్నీ దైవాదేశాలకు, దైవమార్గ దర్శకత్వానికి వ్యతిరేకమైనవిగా ఇస్లాం సిద్ధాంతీకరిస్తుంది. ఈ సిద్ధాంతం ద్వారా ఇతర భావజాలాల నుండి తన్ను తాను ప్రత్యేక పరచు కుంటుంది. ఇతర భావజాలాలతో రాజీపడే ప్రశ్నే వుండదు.

ఇస్లామీయ భావజాలానికి ఒక ప్రత్యేక సామాజిక వాతావరణం అవసరం. ఈ వాతావరణంలోనే ఇస్లాం ప్రాథమిక ప్రత్యేకతలు బహిర్గతమవుతాయి. అజ్ఞానపూరిత సామాజిక వాతావరణంలో దానికి సంబంధ బాంధవ్యాలు వుండనే వుండవు. పై ప్రత్యేక వాతావరణంలోనే ఇస్లామీయ భావజాలం దాని నిజరూపంలో వ్యక్తమవుతుంది. దాని వ్యవస్థీకృతమైన సౌందర్యం బహిర్గతమవుతుంది. తద్వారా మనిషికి భౌతికంగా (శారీరకంగా), మానసికంగా ఉన్నత స్థాయి పొందడానికి సంపూర్ణ స్వేచ్ఛ లభ్యమవుతుంది. ఈ మహా ప్రస్థానంలో ప్రయాణీకునికి ఎలాంటి అడ్డంకులు ఎదురుకావు. ఈ వ్యవస్థలోనే ఒక విశ్వాసి సహజమైన ప్రశాంతత మరియు శాంతిమయమైన జీవితాన్ని పొందగలడు. 'మంచి' చేయడానికి, వ్యక్తికి సంపూర్ణ సహకారం లభించేది ఈ వ్యవస్థలోనే. నైతిక విలువల అనుసరణలో చైతన్యవంతమైన సామాజిక శాంతి లభ్యమయ్యేదీ ఈ వ్యవస్థలోనే. సకారాత్మకమైన సంపూర్ణ వికాసం సాధ్యమయ్యేది ఇస్లామీయ దైవ వ్యవస్థలో మాత్రమే.

ఇస్లామేతర వ్యవస్థలలో ఒక విశ్వాసి జీవితం దుర్భరం. లేకపోతే కష్టతరం అవుతుంది. సంపూర్ణ విశ్వాసిగా జీవించడం ఈ వ్యవస్థలో సాధ్యమే కాదు. అలా సాధ్యమవుతుందని చెప్పడం అమాయకత్వం లేక మోసకారితనం అవుతుంది. ఇస్లామీయ వ్యవస్థలో మాత్రమే మనిషికి జీవితం సరళం, సులభతరం కాగలుగుతుంది. ఈ కారణంగానే ఈ వ్యవస్థ స్థాపనకై అవిరళ కృషిచేయడం అత్యంత అవసరమైన కర్తవ్యంగా వుంటుంది.

ఇస్లామీయ వ్యవస్థలో జీవించే వ్యక్తి ఇస్లామేతర వ్యవస్థలో జీవించే వ్యక్తి కంటే ఎక్కువ శ్రమపడవలసి ఉంటుందనీ, కట్టుదిట్టమైన పద్ధతులు పాటించవలసి ఉంటుందని విమర్శించేవారి విమర్శల్లో పసలేదని మనకు అర్థమైంది. దైవమార్గదర్శకత్వం నుండి విడివడి స్థాపించుకునే ఇస్లామేతర వ్యవస్థ ఎప్పటికీ సంపూర్ణం కాజాలదు.

మనిషిలోని బలహీనతలు పరిధులు, పరిమితులతో కూడిన అతని ఆలోచనల తాలూకు కొరతలు గతంలో వున్నాయి... వర్తమానంలో ఉన్నాయి.. భవిష్యత్తులో వుండి తీరుతాయి. ఏ మేరకు ఈ కొరతలు లేక వైరుధ్యాల స్థాయి వుంటుందో ఆ మేరకు మానవ సమాజం దాని నిర్మాణం శ్రమపడవలసి వుంటుంది. జీవితంలోని సరళత తగ్గిపోతూ మరింత క్లిష్టత పెరుగుతూ వుంటుంది. మానవ నిర్మిత వ్యవస్థ దాని చైతన్యం సహజంగానే తన పరిమిత జ్ఞానం రీత్యా సమస్యల పరిష్కారాలపై సైతం పరిమిత ప్రభావమే చూపగలుగుతుంది. ఒక తప్పును సరిదిద్దబోయి మరో తప్పు చేసే పద్ధతి వుంటుంది. జీవితం మొత్తం కాక, కేవలం జీవితపు కొన్ని పార్శ్వాలను మాత్రమే పరిగణనలోకి తీసుకుంటుంది. ఫలితంగా సమస్యల చర్చలో పరిమితి చోటుచేసుకొని, మానవ జీవిత సమస్యలు సంపూర్ణంగా పరిష్కరించబడజాలవు. వ్యాధి నిరోధాన్ని గురించికాక, వ్యాధి చికిత్స గురించి చర్చించడంలో వున్న తేడాయే జీవితానికి వర్తిస్తుంది. దైవ మార్గదర్శకత్వంలో ఏర్పడే ఖిలాఫత్ వ్యవస్థ మాత్రమే మానవ జీవితాన్ని సంపూర్ణంగా పరిశీలిస్తుంది. ఏకకాలంలో జీవితపు సమస్యలను పరిశీలించడం, పరిష్కారాలను సూచించడం ఈ ఒక్క వ్యవస్థకు మాత్రమే సాధ్యమవుతుంది. వ్యాధికి చికిత్సతో పాటు, వ్యాధి నిరోధకాలను కూడా అది సమాజానికి అందిస్తుంది. చరిత్రను నిజాయితీగా పరిశీలిస్తే మానవ నిర్మిత వ్యవస్థలలో పీడనలు, సమస్యలు, దౌర్జన్యాలు, వైరుధ్యాలు, మారణకాండలు పతాకస్థాయిలో వుండటం గమనిస్తాం (ఈ వాస్తవాన్నే మహాకవి శ్రీశ్రీ 'ఏ దేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం' అని చెప్పాడు). దైవ వ్యవస్థ అయిన ఖిలాఫత్ పైన పేర్కొన్న సామాజిక దౌష్ట్యాలు కనీస స్థాయిలో ఉండటాన్ని ఇస్లామీయ వ్యతిరేక విమర్శకులు సైతం అంగీకరించి వున్న సత్యం. చరిత్రలో సజీవంగా నిలిచివున్న సాక్ష్యం.

దైవ వ్యవస్థ మనిషిని ఒక ఉన్నత స్థానానికి చేర్చేలా ప్రయత్నిస్తుంది. ఈ వ్యవస్థ ప్రత్యేకత ఏమంటే, ఇందులో మార్గభ్రష్టత్వం, గతి తప్పి నడవటం సాధ్యమేకాదు. వడివడిగా పరుగెత్తడాలు, అంతస్తులు అధిగమించడాలు వుండవు. దైవ వ్యవస్థ మనిషి ముందు ఒక విశాలమైన, ఉన్నతమైన లక్ష్యాన్ని వుంచుతుంది. ఈ లక్ష్యసాధనకు ఒక జీవితకాలం చాలదు. ఈ సుదీర్ఘ ప్రయాణంలో మనిషికి మరణపు భయం దరిదాపుకు కూడా చేరదు. అదే ప్రాపంచిక వ్యవస్థ నిర్మాణ కృషిలో మనిషి నిరంతరం మరణపు భయానికి లోనవుతూ ఉంటాడు. తన మరణానికి ముందు ఫలానా ఫలానా అంతస్తులు దాటాలని ఫలానా లక్ష్యాలను ఛేదించాలని తొందరపడతాడు. అందుకై పరుగు లంకించుకుంటాడు. స్వాభావికమైన, నిబ్బరమైన ప్రయాణం కోరే సహనం ఈ వ్యక్తిలో లోపిస్తుంది. ఫలితంగా లక్ష్యసాధనలో ఇతరుల హక్కులను కాలరాచి వేయడం న్యాయమైన చర్యగా భావిస్తాడు. క్రమంగా రక్తపాతానికి కారకుడవుతాడు. ఫలితంగా వ్యవస్థలో సమతుల్యత నాశనమవుతుంది. సామాజిక వ్యవస్థలో కల్లోలం, అలజడి ప్రారంభమవుతుంది. ఈ కల్లోల పరిస్థి తుల కబంధ హస్తాల్లో సమాజంతోపాటు తాను కూడా బందీ అయిపోతాడు. దానికి తగిన సహజ ప్రతిఫలం లేక మూల్యం చెల్లించక తప్పని స్థితికి గురవుతాడు.

తద్భిన్నంగా ఇస్లామీయ వ్యవస్థ దాని సహజ ధోరణిలో నెమ్మదిగా దృఢంగా తన ప్రయాణాన్ని ముందుకు సాగిస్తుంది. (అప్పుడప్పుడూ కప్ప గంతుల వంటి దూకుడులూ వుండవచ్చు). సందర్భానుసారం తన దిశను నిర్దేశించుకుంటూ, లోపాలను సరిదిద్దుకుంటూ సాగుతుంది. విధ్వంసం ద్వారా మానవ నైజానికి వ్యతిరేకమైన చర్యలు అది ఎన్నటికీ చేపట్టదు. దూరాలోచ నతో, చైతన్యం తొణికిసలాడే వ్యక్తిగా సహనంతో లౌక్యంతో పని చేస్తుంది. తన సుదూర లక్ష్యసాధనకై సంపూర్ణ విశ్వాసంతో పయనిస్తుంది. ఎదురైన చేదు

అపజయాలను విజయాలకు పునాదులుగా మలచుకుని తన ప్రయాణం కొనసాగిస్తుంది. ఒకటి.. రెండు.. మూడు.. నాలుగు.. ఇలా వేయిసార్లు అపజయాలు ఎదురైనా, దైవంపై సంపూర్ణ విశ్వాసంతో వెయ్యిన్నొకటవసారీ విజయం పొందే కృషి ఎలాంటి లోపం లేకుండా చేస్తుంది. విజయం సాధించి తీరుతుంది. లక్ష్యసాధనలో, దుర్గమమైన మార్గంలో, అంకుఠిత దీక్షతో సాగ డమే తన కర్తవ్యంగా ఈ వ్యవస్థ సాగుతుంది. ఒక ఆరోగ్యవంతమైన పచ్చటి చిన్న మొలక, భూమిలో తన వ్రేళ్లను ఎలా పటిష్ఠపర్చుకుంటుందో కొమ్మలను, రెమ్మలను మెల్లమెల్లగా ఎలా విస్తరింపజేసుకుంటుందో అదే విధంగా ఇస్లా మీయ వ్యవస్థ మానవ హృదయంలో ఆలోచనల్లో దృఢంగా, లోతుగా తన వ్రేళ్లను పటిష్ఠపర్చుకుంటుంది. క్రమంగా దాని విస్తృతిని ప్రశాంతంగా, మృదువుగా, దృఢంగా కొనసాగిస్తుంది. చివరగా దాని ప్రమాణానికి సరిపడే స్థాయికి ఎదుగుతుంది.

ఇస్లామీయ వ్యవస్థ తన తాత్వికతా విత్తనాలను మానవ సమాజ మనోమస్తిష్కాలలో నాటుతుంది. దానిని పర్యవేక్షిస్తుంది. పూర్తి ప్రశాంతతతో దానికి సర్వోన్నత శిఖరస్థాయికి చేరే సంపూర్ణ స్వేచ్ఛ ప్రసాదిస్తుంది. ఈ ధర్మసంస్థాపనా కృషిలో ఒక్కోసారి ఉదాసీనత కూడా చోటుచేసుకునే అవకాశం ఉంది. మరికొన్ని సందర్భాల్లో మడమ తిప్పి పలాయనమూ సంభవమే. వీటిని చాలా సహజమైన పరిణామాలుగా భావించాలి. ఉదాహరణకు, ఒక పంట పొలం, దాని రైతును తీసుకోండి. కళకళలాడే పచ్చని పంట తెగులు సోకడం వల్ల ధ్వంసం అయ్యే అవకాశాలు వున్నాయి. అతివృష్టి, అనావృష్టి వల్ల పైరు పాడయ్యే అవకాశాలూ లేకపోలేదు. పైరు పాడవడానికి ఇతర అనేక కారణాలు సహజంగా మనకు దర్శనమిస్తాయి. కానీ, సుదూర దృష్టి కలిగిన రైతు తాను ఎదుర్కొన్న తాత్కాలిక ఒడిదుడుకులకు భీతి చెందడు. నిరాశాపడడు. వ్యవ సాయం మానివేయడు. ఎందుకంటే అడ్డంకులు, ఇబ్బందులు ఎన్ని వచ్చినా

వ్యవసాయం నిరంతరంగా సాగుతుందని ఆ రైతుకు తెలుసు. ప్రతికూల పరిస్థితులు మారిన వెంటనే వ్యవసాయంలో అభివృద్ధి సాధ్యమవుతుందనీ, అనుకూల పరిస్థితుల్లో లాభదాయకంగా మారుతుందనీ ఆ రైతుకు తెలుసు. ఈ కారణంగా ఆ తెలివిగల రైతు నష్టాలకు వెరవక, వ్యవసాయానికి స్వస్తి పలకక, నిరంతర కృషి సాగిస్తాడు. చివరకు అద్భుత ఫలితాలను సాధించి తీరుతాడు.

పరిమిత జ్ఞానపు లేక సంకుచిత జ్ఞానపు మానవ నిర్మిత వ్యవస్థను అంగీకరించేవారి అమాయకత్వం లేక మూర్ఖత్వపు కారణంగా నేటి ప్రపంచం ఎదుర్కొంటున్న సమస్యలను ఏకరువు పెట్టవలసిన అవసరం ఎంతమాత్రమూ లేదు. తూర్పు నుండి పడమర వరకు, ఉత్తరం నుండి దక్షిణం వరకు ఈనాడు ప్రపంచం అనుభవిస్తున్న దౌర్భాగ్యకరమైన, ప్రమాదకరమైన పరిస్థితులను గురించి ఆలోచనాపరులు, మేధావులు పెడుతున్న పొలికేకలు, గగ్గోలులు ప్రబల సాక్ష్యాలుగా మనముందు ఉన్నాయి.

దైవ వ్యవస్థ అయిన ఇస్లాం ఎక్కువ కాలం 'మనగలగలేదు' అనే విమర్శ నిజాయితీతో కూడుకున్న విమర్శ కాదు. కసి, కుట్రతో కొందరు ఈ విమర్శను చేయగా మరికొందరు అమాయకత్వం, హ్రస్వదృష్టి ద్వారా చేస్తున్నారు. వాస్తవమేమంటే, ఈ ఉన్నతమైన, సంక్షేమకరమైన ఇస్లామీయ వ్యవస్థ దాని తాత్విక, ఆధ్యాత్మిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ పునాదుల వ్యవస్థీకరణకు పట్టిన కాలం అతి స్వల్పమైన ఒక శతాబ్దం లేక దానికంటే తక్కువ అనేది నిర్వివాదాంశం అయినప్పటికీ పద్నాలుగు వందల సంవత్సరాల నుండి తనపై జరుగుతున్న క్రూరమైన దాడులు, వ్యతిరేకతలు, కష్టాలు, నిర్బంధాల నుండి తనను తాను కాపాడుకుంటూ దానికి నిరంతరం పోరాడుతూ వస్తుంది. భయానకమైన ఈ భౌతిక, మానసిక దాడులు దాని పునాదులను పెకలించి వేయాలని చూస్తున్నాయి. ప్రపంచంలోని ఇస్లామేతర మేధావులు, తత్వవేత్తలు,

ఈ వ్యవస్థ వెంటపడి వున్నారు. ఇన్ని ప్రతికూల పరిస్థితుల్లో సయితం దాని పునాది విశ్వాసాలను, తాత్విక పునాదులను ఈ దాడులు కదిలించలేక పోయాయి. దాని పటాన్ని చెరిపివేయలేకపోయాయి. ఈ పునాదులు ఇప్పటికి కూడా నూతన తరాలకు విప్లవ స్ఫూర్తిని అందించేందుకు సిద్ధంగా వున్నాయి. అందిస్తూ వున్నాయి కూడాను.

పై చారిత్రక సత్యాన్ని, దాని వాస్తవ విలువలను అర్థం చేసుకోవడానికి, మానవ నిర్మిత వ్యవస్థల్లోని డొల్లతనాన్ని, బలహీనతను తప్పక చూడవలసి ఉంది. ఉదాహరణకు, రోము రాజ్య వ్యవస్థనే తీసుకోండి. ఈ రాజ్య వ్యవస్థ నిర్మాణానికి దాదాపు వెయ్యేళ్ల కాలం పట్టింది. కాని, ప్రతికూల పరిస్థితులు ఎదురైన వెంటనే వాటిని తట్టుకొని నిలిచే శక్తి అంతర్గతంగా లేనందున కేవలం ఒక శతాబ్ద కాలంలోనే అది కుప్పకూలిపోయింది. దానిని పునర్నిర్మించడానికి దాని పునాదులే లేకుండా పోయాయి. దైవ ఆదేశిత వ్యవస్థ మరియు మానవ నిర్మిత వ్యవస్థల్లో ఈ తేడాను మనం చూడగలము.

ఇస్లామీయ చరిత్ర నిజం చెప్పాలంటే మానవ చరిత్ర మొత్తంలో అత్యంత విలువైన కాలంగా, మానవ చరిత్రలోనే ఒక మహోన్నత స్థానం కలిగినదిగా విరాజిల్లింది. ఇది విమర్శకులు కూడా కాదనలేని సత్యం. తన ప్రణాళికా బద్ధ ఆచరణ ద్వారా సర్వోత్కృష్టకాలంగా పరిగణించబడింది. కాలపరిధి రీత్యా సమయం చాలా క్లుప్తమైనదిగా కనిపించవచ్చు. కాని, ఇస్లామీయ తాత్విక దృక్పథానికి, ఆచరణకు అది ఒక ధ్వజస్థంభంలా (మీనార్‌లాగా) నిలిచి ఉంది. సృష్టికర్త అయిన అల్లాహ్ ఈ మీనార్‌ను రానున్న తరాల వారికి ఆదర్శంగా, మార్గదర్శకంగా మరియు ప్రమాణంగా నిలబెట్టాడు. (చివరి దైవప్రవక్త ముహమ్మద్ (స) నుండి నలుగురు ఖలీఫాల కాలం వరకు ఈ సర్వోన్నత కాలం వుండింది) ఈ ప్రమాణ స్థాయికి చేరువ కావడానికి భవిష్యత్తు తరాలు చైతన్యవంతంగా కృషి చేయవలసి వుంది. ఈ కృషిలో పాల్గొనేవారి ఆచరణ,

చైతన్య స్థాయిల పునాదులపై వారికి దైవ ప్రసన్నతా స్థాయిలో గౌరవోన్నతుల స్థానాలు ఇవ్వబడ్డాయి.

ఈ క్రమంలో మరచిపోకూడని మరో సత్యమేమంటే, ఆ సర్వోత్కృష్టమైన కాలం లేక వ్యవస్థ ఒక అద్భుతంలాగా లేక చమత్కార భరిత మంత్రం లాగా అవతరించలేదు. అది మానవుల సమూహంచే నిరంతరం జరిపిన అవిరళకృషి మరియు శ్రమల ఫలితంగా ఉనికిలోకి వచ్చింది. ఈ కృషిలో మొదటి తరానికి చెందిన విశ్వాసుల బృందం తమ సర్వస్వాన్ని ధారపోసింది. ఎప్పుడైనా, ఎక్కడైనా ఇటువంటి తీవ్ర కృషి జరిగితే, ఈ మహోత్కృష్ట కాలం లేక ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థ తిరిగి ఉనికిలోకి వస్తుంది. స్థాపించబడుతుంది.

ఇస్లామీయ వ్యవస్థ మానవ సమాజపు విభిన్న రంగాలలో తన బాధ్యతలను నెరవేరుస్తూనే వస్తుంది. మానవ చరిత్రలో తరం తర్వాత తరానికి నిరంతరంగా తన ప్రభావాన్ని చైతన్యవంతంగా అందిస్తూనే వస్తుంది. సమస్త మానవ జాతిపై ఈ వ్యవస్థ తనదైన ముద్రను వేసి, తన ప్రభావానికి గురిచేసింది. ఈ ప్రభావమే నేటి తరానికి, ఈ మహోన్నతమైన ఇస్లామీయ వ్యవస్థను స్థాపించడానికి తీవ్రమైన కృషి చేసేలా పురికొలుపుతూ ఉంది. దైవ సహాయంతో ఆ కృషిలో విజయం సాధిస్తుంది.



# ప్రభావశీల వ్యవస్థ ఇస్లామ్

ఇస్లామీయ వ్యవస్థ ఉచ్ఛస్థితిలో తన సంపూర్ణ స్వరూపంతో విరాజిల్లిన కాలం, చారిత్రకంగా బహు స్వల్పమైనదే. అయినప్పటికీ మానవ జీవితపు ఔన్నత్యం, నడవడికల సౌందర్యం, ఆచరణాత్మక అద్భుతాలను ప్రపంచానికి అందించింది. మానవ చరిత్రలో ఈ స్వల్పకాలం, ఆ తర్వాత ప్రపంచ పటంపై ఏతెంచిన మానవ సమాజాలకు ఆదర్శప్రాయమైనదిగా నిలిచివుంది. భవిష్యత్ తరాలకు ప్రళయ కాలం వరకు మొదటి వరుసలోని ఆ ప్రథమ విశ్వాసుల వర్గం (ప్రవక్త ముహమ్మద్(స) తర్వాతి సహాబాల బృందం) స్ఫూర్తిని, ఉత్సాహాన్ని, మార్గదర్శకత్వాన్ని నిరంతరం అందిస్తూనే ఉంటుంది. మానవ సమాజ ప్రయాణంలోని ప్రతి మలుపులో, అంతస్తులో, భావజాలాలలో, ఆచరణాత్మక కృషిలో ఈ అడుగుజాడలు స్పష్టంగా కనబడుతూనే ఉంటాయి. అనుకూల పరిస్థితులైనా, అననుకూల పరిస్థితులైనా ఆ ప్రథమ విశ్వాసుల వర్గం మనకు స్మరణీయులుగానే ఉంటారు. ఈ ప్రథమ విశ్వాసుల వర్గపు కాలాన్ని, దాని ప్రభావాలను, క్లుప్తంగా ఇక్కడ వివరించడం అత్యంత అవసరం. ప్రపంచ చరిత్రలో, సమస్త మానవ జాతుల నాగరికతల చరిత్రలో ఈ కాలపు ప్రత్యేకతలు ఉదాహరణలుగా, మైలు రాళ్ళుగా, దిక్సూచీలుగా కేవలం ముస్లింలకే కాదు, సమస్త మానవ జాతికి మార్గం చూపగలవు.

ప్రవక్త ముహమ్మద్(స) జీవితం- కృషి కలగలిపి ఆ కాలం ఒక ఆదర్శ ప్రాయులైన మానవ బృందాన్ని ప్రపంచానికి అందించింది. మానవ జీవితపు ఔన్నత్యాన్ని, దాని ఉన్నత శిఖరాలకు చేర్చిన మానవ బృందం కేవలం మనకు ఈ కాలంలోనే కనిపిస్తుంది. ఈ దైవవ్యవస్థలో ప్రవక్తశ్రీ వారి పర్యవేక్షణలో శిక్షణ పొందిన ఈ ఆదర్శప్రాయమైన బృందంలోని వ్యక్తులు తమ వ్యక్తిత్వాలలో మనకు వటవృక్షాల్లో దర్శనమిస్తారు. ఆ కాలానికి చెందిన లేక ఆ తర్వాతి కాలానికి చెందిన దైవేతర వ్యవస్థలు అందించిన ఉన్నత వర్గ మానవులు సైతం వీరిముందు కేవలం మరుగుజ్జుల్లా కనిపించక మానరు. బలహీనతలు గల అసంపూర్ణులుగా మనముందు నిలుస్తారు. అతి స్వల్పకాలం ఉనికిలో వుండిన ఈ దైవవ్యవస్థ ఒక పెద్ద మానవ బృందాన్ని నైతిక విలువల కాణాచులైన వ్యక్తిత్వ పర్వతశిఖరాలను మనకు అందించింది. చరిత్ర పరిశోధకులు, విమర్శకులు సైతం ఈ అత్యల్పకాల వ్యవధిలో ఇంతటి ప్రభావశీలురైన వ్యక్తుల బృందం ఉనికిలోకి రావడం చూసి ఆశ్చర్యచకితులయ్యారు. పరిమిత వనరులు గల ఒక ఎడారి ప్రాంతం నుండి, ప్రత్యేకంగా భావించబడుతున్న ఆ కాలం నుండి (అంధకార యుగంగా చరిత్రకారులు పేర్కొన్న కాలం) ఈ అద్భుతమైన మానవ బృందం ఎలా తయారయ్యింది? హేతుబద్ధ కార్యాచరణ గతితర్క చారిత్రక వాదులకు సైతం జవాబు దొరకని ప్రశ్న ఇది.

మానవ జాతికే ఆదర్శప్రాయులైన ఈ ప్రవక్త అనుచరుల బృందం వారి వ్యక్తిత్వాల ఆవిష్కరణ నేడు మనకు అత్యంత అవసరం, అనుసరణీయం. ఎందుకంటే, ప్రపంచంలో ఈ బృందం మాత్రమే, మహోన్నతమైన ఆదర్శాలను ఆచరణను మనం జీవిస్తున్న ఈ ప్రపంచానికి అందించారు. వీరి ఆదర్శాల అమలు ముందు ప్రపంచ దైవేతర వ్యవస్థల్లోని ప్రముఖులు అసంపూర్ణులుగా మనకు ఎదురవుతారు. వీరి మహోజ్వల ఆదర్శం ఏమంటే, ప్రపంచంలో అప్పటి వరకు ప్రజలు ఏమాత్రం ఎరుగని సంక్షేమకర, సమన్యాయవంతమైన,

దైవిక రాజ్య వ్యవస్థను ఆవిష్కరించి స్థాపించి చూపారు. అదే సమయంలో మానవులుగా వారి శారీరక, భౌతిక అవసరాలను కూడా పూర్తి చేసుకున్నారు. తమ నైజాలను, సహజత్వాలను సైతం వారు పరిరక్షించుకున్నారు. తమకు పునాదులుగా వున్న సమస్త శక్తులను, వనరులను వారు వ్యర్థం చేయక సద్వినియోగపర్చారు. అదే సమయంలో తమ శక్తికిమించిన పని, శ్రమలను వారు తమ శరీరాలకు అందించనూలేదు. మానవ జీవితంలోని ప్రతి మాధుర్యాన్ని కూడా వారు అనుభవించారు. ఆనాటి ప్రపంచం, పరిసరాలు, వరప్రసాదాలను కూడా సమయోచితంగా అనుభవించారు. వారు ఎదురుదెబ్బలనూ తిన్నారు, కిందపడ్డారు, పడిలేచారు కూడా. తమనుతాము సంభాళించుకున్నారు... సంస్కరించుకున్నారు కూడా. సాధారణ మనుషుల్లాగానే అప్పుడప్పుడు వారు నిరాశానిస్పృహలకు, మానవ బలహీనతలకు లోనయ్యారు కూడాను. వెంటనే ఉత్సాహం పొంది తమ బలహీనతలపై అదుపును సాధించారు కూడా.

పై వాస్తవికమైన చిత్రపటం మనలను నిరంతరం జ్ఞానవంతమైన ఆచరణకు పురికొల్పుతూనే ఉంటుంది. మానవ సమాజానికి నిత్యచైతన్యం అందిస్తూ ముందుకు... మున్ముందుకు ఉరకలు వేసేలా ప్రోత్సాహం అందిస్తూంది. పైన పేర్కొన్న అతి స్వల్పకాలపు ఆ ఆదర్శం వరకు (దైవిక వ్యవస్థాపన వరకు) చేరుకునే చైతన్యాన్ని, ఉత్సాహాన్ని నిరంతరం అందిస్తూనే ఉంటుంది. మానవ సమాజానికి తనపై తనకు నమ్మకం కలిగించే తన సహజ నైజం వాస్తవికతలను తెలియపర్చే, తనలో నిగూఢమై ఉన్న శక్తులను గుర్తించి వెలికితెచ్చే స్ఫూర్తి పై చిత్రపటం నుండి మాత్రమే మనం పొందగలం. ఈ స్ఫూర్తి ద్వారా సంక్షేమకరమైన సామాజిక వ్యవస్థను (దైవిక వ్యవస్థను లేక ఖిలాఫత్ వ్యవస్థను) స్థాపించగలం. దానిని మానవ నైజపు ఉన్నత ప్రమాణం వరకు చేర్పించగలం. ఈ ప్రయాణం అద్భుతాలతో కూడుకున్నది ఎంతమాత్రమూ కాదు సుమా. మానవ వనరుల, శక్తియుక్తుల వినియోగం ద్వారా తప్పనిసరిగా ఏర్పడేదే ఈ వ్యవస్థ. ఈ వ్యవస్థ గతంలో, స్వల్పకాలంలో తన ఉనికిని చాటి మహోజ్వలంగా

దీపపు స్థంభంలా నిలిచివుంది. మరలా దాని పరిధిలోకి నేటి సమాజాన్ని చేర్పించే కృషిని తీవ్రాతితీవ్రం చేయవలసి వుంది. మానవ జాతి చరిత్రలోనే మహోన్నత ఆదర్శాలను ఆచరించి స్థాపించిన ఈ వ్యక్తిత్వాలను నేటి ప్రపంచా నికి పరిచయం చేయడం అత్యంత చారిత్రక అవసరంగా భావించాలి.

ఈ ఆదర్శవంతమైన వ్యక్తిత్వాల బృందం ఎడారి సముద్రం నుండి ఉద్భవించింది. తెగల మధ్య ఘర్షణ, జ్ఞానరాహిత్యం, క్షణికావేశాలు, వనరుల లేమి ఈ బృందపు గత చరిత్ర. ఈ అననుకూల పరిస్థితుల నుండే ఈ విశిష్ట మైన చైతన్యలహరి ఉవ్వెత్తున ఎగిసింది. మరి నేటి అధునిక, జ్ఞానవంతమైన, అనుకూల పరిస్థితులు గల నేటి ప్రపంచంలో ఈ చైతన్య లహరి ఎందుకు విజయవంతం కాదు? తప్పనిసరిగా విజయవంతమవుతుంది. మానవుల హృదయాలను తప్పనిసరిగా జయించి తీరుతుంది. అయితే ఈ వ్యవస్థ నిర్మాణం జీవిత లక్ష్యంగా సాగే ఒక సంఘం వుండటం దీనికి ముందస్తు షరతుగా ఉంటుంది. ప్రస్తుత ప్రపంచంలో, మానవ నైజానికి తోడుగా వనరులు, జ్ఞానం కూడా తోడై వుంది కనుక ఈ దైవవ్యవస్థ నిర్మాణం మరింత సులభతరం అయ్యింది. కాలగమనంలో, ఈ దైవవ్యవస్థ నిర్మాణ కృషిలో భాగంగా అనేక కుట్రలు, దౌర్జన్యాలు, దాడులు, దౌష్ట్యాలు, మానవ హననాలు అన్నింటినీ ఎదుర్కొని నిరాఘాటంగా పయనిస్తూ ఉంటుంది. ఆదర్శవంతులైన ప్రథమ బృందపు వారసులు ఈ ప్రపంచానికి అందించబడుతూనే ఉన్నారు. ఈ వారసుల వ్యక్తిత్వాలు ఆయా కాలాల్లోనేకాక భవిష్యత్ కాలానికి కూడా తమ అడుగుజాడలను చైతన్యపూరిత పాదముద్రలను, ప్రభావాలను చరిత్రలో వదలివెళ్ళాయి. వీరు మానవ జాతి జీవన గమ్యాలను, లక్ష్యాలను పూర్తిగా మార్చివేసేలా తమ పరిసరాలను ప్రభావితం చేశారు. దైవవ్యవస్థ నిర్మాణ కృషి లోని అత్యంత ప్రత్యేకమైన అంశం ఇదే మరి. ఎప్పుడైనా ఈ వ్యవస్థ స్థాపనకు కృషి జరిగినప్పుడల్లా లక్ష్య వ్యతిరేకతలు ఎదురైనా, నైతిక విలువలు, భౌతిక, శారీరక సహజత్వాలు, అంతర్గత శక్తుల ఆవిష్కరణలు అత్యున్నత శిఖరాలకు

చేరుకోవడం మనం గమనిస్తాం. మనిషిలోని అనంతమైన అంతర్గత శక్తులు, ప్రకృతిలోని సహజ వనరుల వ్యవస్థలో, దైవ వ్యవస్థ తత్వంతో మమేకమై పోవడం మనం చూస్తాం. అప్పుడు సంక్షేమకరమైన జ్ఞానపు నీటిబుగ్గలు ఒక్క సారిగా పెల్లుబుకుతాయి. సమాజాన్ని దాని మాధుర్యపు వెల్లువలో ముంచివేస్తాయి.

ఈ స్వల్పకాలపు దైవవ్యవస్థ వ్యవధి మానవ జీవితాన్ని అత్యున్నత స్థాయికి చేర్చడానికి అవసరమైన భావజాలం, పద్ధతులను, అధికార బాధ్యత లను సమాజానికి అందించింది. తద్వారా జీవితాన్ని లోతుగా, విశాలంగా అధ్యయనం చేయడానికి, ఆచరించడానికి అవసరమైన ఉత్సాహం, జ్ఞానం, సహనం, చైతన్యలహరులను మానవ జాతికి అందించింది. మనిషి వ్యక్తిగతం గానూ, సామూహికతలో సభ్యునిగానూ, జీవించడానికి అవసరమైన నైతిక ఔన్నత్యాలను, సత్యసంధతలను, అవగాహనలను అందించింది. ప్రపంచ చరిత్రలో మరే ఇతర భౌతిక వ్యవస్థలు లేక మానవ నిర్మిత వ్యవస్థలు మానవ సమాజానికి ఇంతటి ఉత్తమమైన, ఉదాత్తమైన జీవన విధానాన్ని అందించినట్లు మనం చూడలేము. మానవ జీవితపు అన్ని కోణాలను విప్లవీకరించినట్టి జీవన విధానం కేవలం దైవ వ్యవస్థస్థాపితమైన ఈ పరిమిత కాలంలోనే మనం చూడగలుగుతున్నాం. మానవునిలో వాస్తవ దైవభావన, ఆ దైవంతో సంబంధం, తన ఉనికి లక్ష్యం, తన జీవన విధానపు గమ్యస్థానం, భౌతిక ప్రపంచం, దాని వనరులతో తనకున్న సంబంధ బాంధవ్యం, ఈ విశ్వవ్యవస్థలో మనిషి స్థానం, హోదా (అంతస్తు) విధులు, అవసరాలు లాంటి తాత్విక, భౌతిక విషయాలన్నిం టినీ విప్లవీకరించిన కాలం దైవవ్యవస్థ విరాజిల్లిన ఈ పరిమిత స్వల్పకాలమే. సాంఘిక విషయాలకు సంబంధించి మానవుని వాస్తవికత, అతని హక్కులు, బాధ్యతలు, తనను, తన ఇంటివారిని, తన తోటి సామాజిక సోదరులను సృష్టికర్త అయిన విశ్వప్రభువుతో సంబంధం కల్పించే కృషి, నిరంతర శ్రమ-తపనలకు ఈ కాలమే నిలువెత్తు సాక్ష్యంగా నిలిచివుంది. తన రాజకీయ,

సామాజిక, ఆర్థిక, వ్యవస్థీకృత సంస్థ ఈ పరిమితకాల పరిధిలోనే రూపుదిద్దు కుని దాని ఉన్నత శిఖరాలకు చేరుకుంది. ఒక్కమాటలో జీవితానికి సంబంధిం చిన అన్ని కోణాలకు, అన్ని వ్యవస్థలకు భౌతిక సంబంధాలకు, దైవవ్యవస్థ, వ్యక్తిగతంగా, సామూహికంగా అత్యుత్తమ మార్గదర్శకత్వం అందించింది.

పైన పేర్కొన్న మహా అద్భుత భారాత్మక విప్లవం సంభవించింది. ఎక్కడ? ఎటువంటి పరిస్థితుల్లో? ఈ విప్లవం సంభవించింది, దానికి పూర్తిగా వ్యతిరేక, ద్వేషపూరిత వాతావరణంలోనే అనేది గమనార్హం. ఈ కాలంలో ప్రపంచం మానవీయ విలువలకు ఏ మాత్రం తావులేని స్థితిలో వుండింది. స్థానిక వ్యతిరేకతలతోపాటు చుట్టూ వున్న దేశాల, నాగరికతల, భావజాలాల, తాత్విక దృక్పథాల వ్యతిరేకతను, దండయాత్రలను తట్టుకొని మొట్టమొదటి సారిగా ఇస్లాం అమానవీయ విలువలకు పునాదులు వేసింది. ఈ పునాదులపై రాజకీయ, ఆర్థిక, సామాజిక, నైతిక, ఆధ్యాత్మికపరమైన దైవవ్యవస్థనుఏ స్థాపించింది. తన తాత్విక భావజాలం ద్వారా నూటికి నూరుశాతం ప్రజల హృదయాలను గెలుచుకోకపోయినా అత్యధికుల మనసులను గెలుచుకుంది. వారు స్వయంగా, స్వచ్ఛందంగా, స్వేచ్ఛగా ఈ జీవన విధానాన్ని అంగీకరిం చారు. ఈ విజయం ఖడ్గశక్తి పునాదులపైనో, బలప్రయోగం ద్వారానో సంభవిం చినది కాదు. మానవ స్వభావానికి, అతని నైజానికి తగిన దైవవ్యవస్థ నిర్మాణం ద్వారానే ఇది సాధ్యమైంది. ఇస్లామీయ సైద్ధాంతిక దైవధర్మం తన సంపూర్ణ స్వరూపంలో విశాలమైన, లోతైన భావజాలంతో ప్రజల ముందు ప్రత్యక్షపర్చ బడింది. మానవ నైజాన్ని స్వార్థం నుండి, స్వలాభాపేక్షల నుండి ఇస్లాం విముక్తి ప్రసాదించింది. అంధకారయుగంలోని జ్ఞానరహిత, వివేకరహిత స్థితి నుండి ప్రజలను మహోజ్వలమైన స్థాయికి ప్రస్థావింపజేసింది. మానవ జాతిపై సంపూర్ణ విశ్వాసంతో సమస్త చెడులకు వ్యతిరేకంగా మానవులలోని మంచిని అది ప్రేరేపించింది... జాగృతపరచింది. అసంపూర్ణ, లోపభూయిష్టమైన వ్యవస్థ స్థానంలోనే, సంపూర్ణ, లోపరహిత దైవవ్యవస్థను ప్రజలకు అందించి, ప్రజల ద్వారానే స్థాపింపజేసింది. జ్ఞానశూన్యమైన దైవేతర వ్యవస్థలు మానవ

సమాజంపై వేసే ప్రభావాలను, దైవవ్యవస్థ తక్కువగా అంచనా వేయదు. తద్భిన్నంగా సకల దుష్ప్రభావాల నుండి సమస్త మానవాళిని పరిరక్షించే వ్యవస్థను అందజేస్తుంది. మానవాళికి సహనంతో, హృద్యంగా, స్నేహపూర్వకంగా సంస్కరించే కృషిని నిరంతరం కొనసాగిస్తుంది. మనిషిలోని సహజమైన సకారాత్మక అంశాలను వెలికితెచ్చేలా తర్ఫీదునిస్తుంది. ఈ తర్ఫీదు నిరంతర, అవిరళ కృషి ఫలితంగా సమాజం తన చుట్టూ వున్న సమస్త వ్యతిరేకాంశాలను, భౌతిక మానసిక పరిస్థితులను ఒక్కమాటలో సకల అననుకూల పరిస్థితులను అనుకూలంగా మార్చుకుంటుంది. ఒకసారి అరబ్ ఎడారిలో స్థాపించబడినట్లుగా, మరోసారి, మరో చోట తప్పక స్థాపించబడుతుంది.

సంక్షేమకర మానవ విలువలమయమైన ఈ దైవవ్యవస్థ సమస్త వ్యతిరేకతలను తట్టుకొని, అననుకూల పరిస్థితులను అనుకూలంగా మార్చుకొని ఒక ప్రత్యేక కాలంలో, ఒక ప్రత్యేక ప్రాంతంలో ఏర్పడింది. నేటి కాలంలో దానిని పోల్చుకుంటే ఈ దైవవ్యవస్థ స్థాపనకు నాటి పరిస్థితులకంటే, నేటి పరిస్థితులే ఎన్నో వేల రెట్లు అనుకూలంగా వుంది. దైవ వ్యవస్థను స్థాపించ పూనుకునే శక్తులు గతంకంటే నేడు ఎన్నో రెట్లు అధికంగా ఉన్నాయి. ఈ వ్యవస్థను స్థాపించడం ద్వారా సకారాత్మక శక్తులు మరింతగా శక్తిమంతం కాగలవు. భౌతిక వనరుల లేమి, అంధకారబంధురమైన ఆ కాలంలోనే అజ్ఞానపు చీకటి పరదాలను చీల్చుకొని మానవ సహజ నైజం వెలుగు వైపునకు ప్రయాణించే శక్తి కలిగివున్నప్పుడు– భౌతిక వనరులు, జ్ఞానదీపికలు సముచిత రీతిలో లభ్యమవుతున్న నేటి కాలంలో ఈ సకారాత్మక మానవ సహజ నైజపుశక్తి మరింతగా ప్రస్ఫుటం కాగలదు. మానవ సమాజాన్ని చీకటి కుహరాల నుండి జ్ఞాన కిరణాల వైపునకు– ప్రపంచ గమనాన్ని సరైన దిక్కుకు మార్చే మార్గాన్ని దైవవ్యవస్థ సుగమం చేయగలదు. మార్గదర్శకత్వమూ అందిస్తుంది. మానవ సహజ నైజాన్ని సృష్టి స్వభావానికి అనుగుణంగా మరల్చి విజయం వైపునకు పయనింపజేస్తుంది.

ఇస్లామీయ దైవవ్యవస్థ భావజాలాన్ని అర్థం చేసుకోలేనివారు నేటి భౌతిక పరిస్థితులను, అననుకూల వాతావరణాన్ని చూసి నిరాశా నిస్పృహలకు గురవ్వడం సహజం. నేటి ఈ కష్టతర, దుర్భర పరిస్థితులను ఎదుర్కోవడం, దానిని మార్చడం, అననుకూల పరిస్థితుల నడుం విరగ్గొట్టడం సాధ్యం కాదని భావిస్తారు. కాని, ఇది కేవలం అపోహ మాత్రమే. దృఢ సంకల్ప రాహిత్యం నుండి వెలువడిన బలహీన అభిప్రాయం తప్ప మరేమీ కాదు. మానవ నైజం స్వయంగా ఒక వాస్తవిక శక్తి. ఈ శక్తి నేటి అననుకూల పరిస్థితులను అంతర్గతంగా అంగీకరించడం లేదు. ఈ వాస్తవం తూర్పు పడమరలన్నీ గొంతెత్తి పొలికేకలు పెడుతున్నాయి. మానవ నైజం నేటి పరిస్థితులను ధిక్కరిస్తుంది. మానవుని సహజ నైజం ప్రారంభంలో అపసవ్య వ్యవస్థతో ఢీకొంటుంది. దాని పర్యవసానంగా అప్పటివరకు వ్రేళ్ళూనుకొని వున్న పాత వ్యవస్థ సహజంగానే తన అధీనంలో వున్న భౌతిక వనరుల శక్తి ద్వారా మానవ నైజపు సహజత్వాన్ని తన అదుపులో తీసుకొనే ప్రయత్నం తీవ్రంగా చేస్తుంది. అందులో ఎంతోకొంత విజయం సాధిస్తుంది కూడాను. కాని, మానవ సహజ నైజం, భౌతిక వనరుల శక్తికంటే మహాశక్తివంతమైంది. అది అంతిమంగా దైవవ్యవస్థ విజయపు బావుటాను సమున్నతంగా ఎగురవేస్తుంది. మరీ ప్రత్యేకంగా ఈ కృషిని కొనసాగించే మానవ బృందం ఉనికిలో ఉంది. దాని చేతిలో భౌతిక వనరులు ఉంటే, ఈ మానవ సహజ నైజం మరింతగా వికసిస్తుంది. విశ్వవ్యవస్థతో సమైక్యతకై పరుగిడుతుంది.

పైన వివరించిన సమైక్యత చరిత్రలో ఒకసారి సంభవించి వుంది. దైవ వ్యవస్థ అరబ్బీ ద్వీపకల్పంలో ప్రత్యక్షంగా- ప్రపంచం మొత్తంలో పరోక్షంగా పోరాడింది. అమలులో ఉన్న దైవేతర వ్యవస్థను దాని కూకటి వ్రేళ్ళతో సహా అరబ్బు దేశంలో పెకలించివేసింది. దాని పునాదులను ధ్వంసం చేసి అప్పటి వరకు ఉన్న తలక్రిందుల సామాజిక వ్యవస్థను దాని కాళ్ళపై నిలబెట్టింది. ఇది ఒక అద్భుతంలాగా సంభవించనేలేదు' అన్నది మరువకూడని సత్యం. దైవ

సంప్రదాయానికి అనుగుణంగా, మానవ శక్తియుక్తుల వినియోగం ఆధారంగా, మానవ సమాజపు నిరంతర కృషి ఫలితంగా ఈ వ్యవస్థ సంభవమైంది. ఇదే కృషి, ఇదే చైతన్యం, దృఢదీక్షలతో ఎప్పుడు కృషిసలిపినా ఈ అద్భుతమైన, సహజమైన దైవవ్యవస్థ నిర్మాణం ఈ భూమిపై సంభవమై తీరుతుంది. గడిచిన దైవవ్యవస్థ స్వల్పకాల వ్యవధి, దాని చరిత్ర మానవ జాతికి నిరంతరం ఈ వ్యవస్థ నిర్మాణపు కృషికి అడుగడుగునా మార్గదర్శకత్వం అందిస్తూనే ఉంటుంది.

దైవవ్యవస్థ స్వల్పకాల వ్యవధి మానవ జీవితానికి బలమైన ఆచరణాత్మక, తాత్విక పరమైన పునాదులను వేసింది. ఈ పునాదులపైనే దాని శక్తి సామర్థ్యాలు ఆధారపడి ఉన్నాయి. ఆ కాలవ్యవధి (సహాబాల కాలం) గడిచి పోయిన తర్వాత కూడా ఈ తాత్విక, నాగరిక, ఆచరణాత్మక విలువలు, దాని పునాదులు ఏమాత్రం చెక్కుచెదరక నేటికీ నిలిచివున్నాయి. నిలిచివుండటమే కాదు– శతాబ్ద కాలంలో ప్రపంచంలోని ప్రతి భూభాగానికి అది విస్తరించింది. ఈ దైవవ్యవస్థ భావజాలం తన ప్రభావాన్ని ఇతర నాగరికతలపై గరిష్ఠ స్థాయిలో విస్తృతమైన, బలమైన ప్రభావం పడవేసింది. దాని ప్రభావానికి లోను కాని మానవ సమూహాలు బహుఅరుదు. ఈ ప్రభావం వల్ల ఆయా సమాజాలు సంక్షేమకరమైన, సామాజిక న్యాయపరమైన లబ్ధిపొందాయి తప్ప కోల్పోయింది దాదాపు శూన్యం. ఇస్లామీయ వ్యవస్థ ఆలోచనా విధానం, ఆచార వ్యవహారాలు, దాని సకారాత్మక జ్ఞానం, నాగరికత వంటి ప్రభావాలు తరిగిపోని విధంగా ప్రపంచానికి అందించింది. ప్రపంచపు ప్రతి మూలలో దాని ప్రభావాలు నాడు సజీవంగా వుండినాయి. నేటికీ తన సజీవతత్వాన్ని కోల్పోలేదు. దాని ప్రభావాలు నేటికీ మానవ చైతన్యాన్ని కుదిపివేస్తున్నాయి. ఈ ప్రచండ శక్తికి ఆనాడు ఎదురునిల్చిన శక్తులన్నీ నేడు తమ ఉనికిని కోల్పోవడమో లేక కుచించుకుని పరిమితమైపోవడమో జరిగింది. ఈనాడు యూరప్‌ను పట్టిపీడిస్తున్న జాడ్యాలన్నీ కూడా గ్రీకు, రోము నాగరికతల అజ్ఞానపు అంధకారాలే తప్ప మరేమీ కావు.

మానవ సమాజంలో నేడు ఉనికిలో ఉన్న ఉన్నత స్థాయి మానవ విలువలు, దృక్పథాలు దాని నిర్మాణాలు ఏ జ్ఞానపు మాటల నుండి మనకు అందినాయో నేటి ప్రపంచానికి తెలియదు. తెలిసినా అది చాలా స్వల్పమే. విలువల, జ్ఞానకరమైన నిర్మాణాల సంబంధం నేరుగా దైవవ్యవస్థ జ్ఞానపు గనుల నుండి లభ్యమవుతాయి. నేటి రంగురంగుల వలల మధ్య జీవిస్తున్న నిస్సారమైన ధాంబిక జీవితం నుండి విముక్తి పొందడం, దైవవ్యవస్థ జ్ఞాన సరోవరం వైపునకు అడుగులు వేయడం పెద్ద కష్టమైన పని కాదు. సరికదా అత్యంత సహజమైన చర్య. రానున్న భాగాలలో ప్రపంచం ముక్తకంఠంతో అంగీకరించిన అనేక ప్రాధాన్యతలు గల విషయాలను మీ ముందు వుంచే ప్రయత్నం ఇన్షాఅల్లాహ్ జరుగుతుంది. 1430 సంవత్సరాల క్రితం ఇస్లాం ప్రతిపాదించిన విషయాలను నాటి ప్రపంచం తీవ్రంగా వ్యతిరేకించింది. కాని ఆ విషయాలనే నేటి ప్రపంచం సంతోషంగా, అత్యవసరంగా అంగీకరించింది. ఈ సుగుణాల వసంతాన్ని అనుసరించిన దాని ఫలితంగానే నేటి ప్రపంచం 'ఇస్లాం'ను అంగీకరించకుండానే- అర్థం చేసుకోకుండానే, దానికి (ఇస్లాంకు) అత్యంత సమీపంగా చేరుకుంది, జీవిస్తుంది. దానిని స్థాపించడానికి పరిస్థితుల పరంగా సర్వఅనుకూలతలూ నేటి ప్రపంచం కలిగివుంది. నేటి మానవ సమాజం వద్ద గతానికి సంబంధించిన ఇస్లామీయ అద్భుత అనుభవాల జలాశయం సిద్ధంగా వుంది. దానికితోడుగా ఆ తర్వాతి చరిత్ర ద్వారా అనుభవంలోకి వచ్చిన అనేక సమస్యలు, వాటి ఆచరణాత్మక పరిష్కారాలు, అనుభవాలు మనకు అండదండలుగా ఉన్నాయి.

పైన వివరించిన విషయాల సరంజామా అంతా ప్రజల చేతికి మహాశక్తి మంతమైన అనుభవాల ఆయుధంగా అందివస్తుంది. తద్వారా దైవవ్యవస్థను ప్రాథమిక స్థాయిలో మానసికంగా, తాత్వికంగా అంగీకరించడం జరుగుతుంది. తదుపరి దైవకృప, సహాయాల వల్ల దానిని స్థాపించే పరిస్థితులు వచ్చి తీరుతాయి.



# సహజమైన వ్యవస్థ ఇస్లామ్

ఇస్లాం ధర్మం స్థాపించే కృషి జరిగినప్పుడల్లా దానిముందు ఒక పెద్ద అడ్డుగోడ నిలిచివుండింది. ఈ అవరోధపు అడ్డుగోడ ప్రత్యేకంగా అరబ్బు ప్రాంతానికి చెందినదైనప్పటికీ సాధారణంగా ప్రపంచం మొత్తానికి ప్రతీకగా– నమూనాగా వుండింది. అరబ్బు పరిస్థితులు, మొత్తం ప్రపంచ పరిస్థితులకు దర్పణం. ఇస్లాం దారిలో ఆనాటి పాత విశ్వాసాలు, పురాతన వ్యవస్థలు, వాటి ప్రమాణాలు, అధికార హోదాలు, పరిస్థితులు, తెగల సంస్కృతులు, జాతులు, తెగలు వాటి ప్రయోజనాలు అన్నీకూడా అడ్డంగా నిలిచాయి. ఆనాటి అరబ్బు ప్రాంత సామాజిక పరిస్థితులకు అనేక సారూప్యతలు వుండేవి. ఇస్లాం మానవ సమాజాన్ని ఏ ఉన్నత శిఖరాలపై నిలబెట్టాలని భావిస్తుందో– ఆ శిఖరాలు నాటి ప్రపంచానికి బహుదూరంగా ఉండేవి. ఈ అడ్డుగోడకు అదనంగా చరిత్రలోని అనేక అపోహలు, అహంభావాలు తోడుగా ఉండేవి. ఈ పరిస్థితులన్నీ ఇస్లాం మార్గానికి అవరోధాలుగా నిలిచాయి. ఇస్లాం, కేవలం విశ్వాసాలు, వాటి ప్రమాణాలు, పరిస్థితులు, సాంఘిక, సామాజిక సభ్యతలనేకాక, మొత్తం జీవన విధానాన్నే విప్లవీకరించే కృషి చేసింది. అందులో ప్రభుత్వ వ్యవస్థ, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలతోపాటు సంపద, సహజవనరుల పంపిణీని సైతం విప్లవీకరించి పూనుకుంది. ఈ విధంగా ఇస్లాం మానవ జాతిని అజ్ఞానం, దుర్మార్గ పూరిత పాలనా వ్యవస్థ (తాగూత్) నుండి విముక్తి కలిగించి, సంక్షేమకర,

మానవీయ విలువల నెలవు అయిన దైవవ్యవస్థ వైపునకు మరల్చింది. పైన వివరించిన సామాజిక, సాంస్కృతిక నేపథ్యంలో ఎవరైనా ఈ ఇస్లామీయ ఉద్యమం విజయం సాధిస్తుందని, దైవేతర వ్యవస్థలను ఓడించి దైవవ్యవస్థను స్థాపించి తీరుతుందని సమస్త మానవ జాతి సభ్యతా, సంస్కారాలను, సాంస్కృతిక నేపథ్యాలను, ఒక్కమాటలో సర్వాన్ని మార్చివేస్తుందని చెపితే అతను ఎగతాళికి- వెటకారానికి గురికాకతప్పదు. కాని, ఈ విషయం ఒక చారిత్రక సత్యంగా మనముందు నిలిచివుంది. అత్యంత శక్తిమంతమైన నాటి అజ్ఞాన వ్యవస్థ, అతి తక్కువ కాలంలోనే తన స్థలం నుండి వైదొలగిపోయింది. నూతన (ఇస్లామీయ) నాయకత్వానికి మార్గదర్శకత్వపు బాధ్యత అప్పగించింది. మానవ జాతిని అజ్ఞానపు చిమ్మచీకట్ల నుండి వెలికితీసే జ్ఞానపు ఉజ్వలమార్గం వైపునకు పయనింపజేసే బృహత్తర బాధ్యత ఈ నూతన నాయకత్వం చేపట్టింది. ఇస్లామీయ ధ్వజపు నీడలో, దైవ వ్యవస్థ ప్రత్యేకత అయిన సమన్యాయపు ధర్మశాస్త్ర పరిధిలో ఈ నూతన నాయకత్వం మానవ జాతికి సుసంపన్నమైన మార్గదర్శకత్వం అందించింది.

ఎవరైతే పరిస్థితుల అడ్డుగోడలకు అధిక ప్రాముఖ్యం ఇస్తారో- ఈ అడ్డుగోడల పునాదులపై అభిప్రాయాలను ఏర్పర్చుకుంటారో- వారికి వాస్తవికమైన దృష్టికోణం లేదని స్పష్టమవుతుంది. ఏదైతే అసాధ్యమని భావించబడిందో అది పరమ సత్యమై సాక్ష్యాత్కరించింది. ఒక అబ్దుల్లా కుమారుడైన ముహమ్మద్(స) సమస్త ప్రపంచానికి ఎదురునిల్చి లేదా కనీసం మొత్తం అరబ్బు భూభాగానికి వ్యతిరేకంగా, సమస్త భావాలతో, ఆలోచనా విధానాలతో, విశ్వాస జీవన విధానాలతో, సభ్యతా సంస్కారాలతో, ఒక్క మాటలో సమస్త వ్యవస్థలతో ఒంటరిగా ఎలా పోరాడారు? పోరాడటమేకాదు పాత వ్యవస్థను కూకటివ్రేళ్ళతో సహా పెకలించి, నూతన వ్యవస్థ అయిన ఇస్లాంను విజయవంతంగా స్థాపించారు. పాతను మార్చివేసి నూతన జీవన విధానాన్ని, పరవళ్ళు తొక్కే నూతన చైతన్యపూరిత మహోన్నత వ్యవస్థను స్థాపించారు.

ఈ నూతన వ్యవస్థ స్థాపకుడైన ప్రవక్త ముహమ్మద్(స) ఆనాటి విశ్వాసాలు, ఆలోచనా విధానాలు, ఆచరణలతో కనీస సయోధ్యను కూడా పాటించలేదు. ఆనాటి వారి మనోభావాలను కనీసం గౌరవించనూలేదు. వారి దైవాలతో – మార్గదర్శకులతో కనీస మెతక వైఖరి కూడా అవలంబించలేదు. తద్భిన్నంగా మొదటి రోజు నుండే మక్కా నగరంలోని ఆనాటి ఆధిపత్య శక్తులన్నింటితో శత్రుత్వం తెచ్చుకున్నారు. ఆయన(స)కు ఈ క్రింది విధంగా ప్రకటించమని దైవం వైపు నుండి ఆజ్ఞాపించబడింది.

> "ఓ ప్రవక్తా!) ఇలా ప్రకటించు. ఓ అవిశ్వాసులారా! మీరు ఆరాధించే వాటిని నేను ఆరాధించను. అలాగే నేను ఆరాధించే ఆయన్ని (అల్లాహ్‌ను) మీరు ఆరాధించరు. మీరు ఆరాధిస్తున్నవాటిని నేను ఆరాధించేవాడిని కాను. అలాగే నేను ఆరాధించే ఆయనను మీరు ఆరాధించేవారు కారు. 'మీ ధర్మం మీదే– నా ధర్మం నాదే'
>
> *(దివ్యఖుర్‌ఆన్– 109 : 1-6)*

ప్రవక్త(స) తన ధర్మాన్ని పూర్తిగా, పునాదిపరంగానే ఖురైష్ మరియు అరబ్బు ప్రజలతో వేరుపర్చుకున్నారు. ప్రవక్త ముహమ్మద్(స)కు వర్తమానంలోనే కాదు. సుదూర భవిష్యత్తులో కూడా ఈ రెండు ధోరణుల మధ్య ఐక్యత సాధించబడదని– అటువంటి ఆలోచనలకు మనస్సులో కనీస చోటు కూడా వుంచరాదని ఆజ్ఞాపించబడింది. పైన పేర్కొన్న చివరి దైవగ్రంథం దివ్యఖుర్‌ఆన్ లోని వాక్యాలు "మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించను. నేను ఆరాధించే ఆయన్ని మీరు ఆరాధించేవారు కారు" అని నొక్కి మరీ వక్కాణించబడ్డాయి. అంతేకాదు, అతి స్పష్టంగా తన ధార్మిక విధానాన్ని ప్రకటించడం జరిగింది. "మీ ధర్మం మీదే– నా ధర్మం నాదే" దైవేతర శక్తులతో, భావాలతో ఎక్కడా రాజీవుండదని ప్రకటన చేయబడింది. ప్రవక్త(స) ప్రకటించిన తన దృఢత్వానికి నేపథ్యంగా, తనకు అతీత శక్తులున్నాయనిగాని, తనకు అగోచరాల జ్ఞానం

కలదనిగాని, రహస్య వనరులున్నాయని గాని ఎక్కడా ప్రస్తావించలేదు. తద్భిన్నంగా యిలా ప్రకటించమని దివ్యఖుర్ఆన్ ద్వారా ఆజ్ఞాపించబడింది.

> ప్రవక్తా! వారితో ఇలా చెప్పు : నా వద్ద అల్లాహ్ నిధి నిక్షేపాలు వున్నాయనిగాని– నాకు అగోచర జ్ఞానం కలదనిగాని– నేను మీతో చెప్పటం లేదు. ఇంకా నేను దైవదూతనని కూడా అనటంలేదు. నేను కేవలం నాపై అవతరింపజేయబడే 'వహీ' (దైవవాణి)ని మాత్రమే అనుసరిస్తాను' *(అల్అన్ఆమ్ – 6: 50)*

ప్రవక్త ముహమ్మద్(స) తన విరోధులపై విజయం సాధించిన ప్రతీ సందర్భంలో సైతం తన అనుచరులకు ధనరాసుల వాగ్దానాలు, అధికార హోదాల లాలసలు చూపనే లేదు. ఇబ్నె ఇస్హాఖ్ ఉల్లేఖనం ప్రకారం, దైవ సందేశహరులు(స) హజ్ సందర్భంగా విభిన్న తెగల వద్దకు స్వయంగా వెళ్ళేవారు. వారిని సంబోధిస్తూ, 'ఓ ఫలానా తెగవారలారా! నేను అల్లాహ్ సందేశహరునిగా మీ వైపునకు పంపబడినవాడిని. ఆయనను తప్ప మరెవ్వరినీ మీరు ఆరాధించరాదని ఆజ్ఞ ఇవ్వబడింది. ఆయనకు సహవర్తులుగా ఎవరినీ భావించరాదు. ఎవరిని అయితే మీరు అల్లాహ్‌కు సహవర్తులుగా భావిస్తున్నారో వారిని త్యజించండి. నన్ను విశ్వసించండి. నా సత్యసందేశాన్ని స్వీకరించండి. అల్లాహ్ సందేశాన్ని– దాని సత్యతను స్థాపించే అవకాశం నాకు ఇవ్వండి" అని చెప్పేవారు.

ఇబ్నె ఇస్హాఖ్ మరో ఉల్లేఖనం 'జహరి' ద్వారా ఉటంకించబడింది. అందులో ప్రవక్త(స) 'బనూ ఆమీర్ బిన్ సాస' వద్దకు ఏతెంచారు. ఆయనను అల్లాహ్ ధర్మం వైపునకు ఆహ్వానించారు. ఆయన ముందు తన సందేశ పరత్వపు సత్యతను విశదపర్చారు. ఆ సమయంలో 'బైజర బిన్ ఫరాస్' అను పేరుగల వ్యక్తి 'ఒకవేళ ఈ ఖురైష్ యువకుడిని నేను పొందగలిగితే సమస్త అరబ్బు భూభాగంపై ఆధిపత్యం వహించవచ్చు' అని భావించి, ప్రవక్త(శ్రీ

వారితో ఇలా అడిగారు 'ఒకవేళ, మేము మీ చేతిపై ప్రమాణం చేస్తే- ఆ తర్వాత అల్లాహ్ మీ విరోధులపై మీకు విజయం అందిస్తే మీ తరువాత మాకు (అనగా మా తెగ వారికి) అధికారాలు సంప్రాప్తమవుతాయా?' దానికి ప్రవక్త(స) ఇలా బదులిచ్చారు. 'అధికారాలైతే ఆ సర్వేశ్వరుడైన అల్లాహ్‌కు మాత్రమే ఉంటాయి. ఆయన ఎవరిని తలిస్తే వారికే బాధ్యతలు (పదవులు) అప్పగించబడతాయి' అని బదులిచ్చారు. దానికి 'ఫరాస్'... అంటే విజయం సాధించిన తర్వాత మాకు అధికార హోదాలు దొరికే హామీ లేదు. మరి అటువంటి సమయంలో మొత్తం అరబ్బులతో ప్రత్యేకించి ఖురైష్‌తో శతృత్వం కొనితెచ్చుకొనే అవసరం మాకేముంది? మీకెందుకు సహాయపడాలి? అని చెప్పి ప్రవక్త(స) వారి సందేశాన్ని తిరస్కరించాడు.

పరిస్థితి ఇలా వుంటే, మరి ఈ అద్భుతమైన మార్పు ఎలా సంభవించింది. ఒక వ్యక్తి ఒంటరిగా తన ఎదురు నిల్చిన అత్యంత బలమైన గోడను ఎలా కూల్చగలిగాడు. ప్రవక్త(స) ఈ కార్యనిర్వహణలో చమత్కార పూర్వక అద్భుతాల సహకారం, సహాయం కూడా పొందలేదు. స్వయంగా తన అద్భుతాన్ని 'దివ్యఖుర్‌ఆన్'గా ప్రకటించి అద్భుతాల పునాదులపై పనిచేయడాన్ని రద్దుపర్చారు. ఇటువంటి పరిస్థితుల్లో ఈ భావ విప్లవం విశాలమైన, సర్వజనీనమైన దైవసంప్రదాయం ఆధారంగా సంభవించిందే తప్ప మరో రకంగా కాదు. ప్రజలు ఈ భావజాలాన్ని ఆమోదించే ప్రతి పరిస్థితుల్లో ఈ విప్లవం తప్పక సంభవించి తీరుతుంది. ఇస్లామీయ వ్యవస్థ యొక్క విజయం భౌతిక పరిస్థితులపై ఆధారపడటం ద్వారా కాక- మనిషిలోని సహజమైన అంతర్గత జాగృతి వల్ల సాధ్యమవుతుంది. మానవ అంతర్గత నైజం ద్వారా, సంఘీభావం సాధించడం ద్వారా సాధ్యమవుతుంది. మనిషిలోని సహజ నైజం అంతర్గతంగా మహాశక్తిమంతమైనది. ఈ శక్తి అజ్ఞానపు అంధకారం నుండి విముక్తి కలిగించి, జ్ఞానమార్గం వైపునకు దారి మళ్ళించినట్లయితే, భౌతిక వ్యతిరేకశక్తులు ఆ వ్యక్తిని ఎదుర్కోజాలవు. అతనిపై ఆధిపత్యం వహించజాలవు.

మానవ అంతరాత్మపై వందలాది ఆరాధ్యులు తిష్ఠవేసుకొని వున్న ఆ చీకటికాలంలో ఇస్లాం **'లాఇలాహ ఇల్లల్లాహ్'** (సృష్టికర్త తప్ప మరెవ్వడూ ఆరాధ్యుడు కాడు) అనే నినాదాన్ని మానవ సమాజం ముందుకు తెచ్చింది. బయటి ప్రపంచం సరే స్వయంగా కాబా గృహంలో చిల్లర దేవుళ్ళు అనేకం పోగుపడివుండేవి. వాటి తాలూకు విశ్వాసాలు, మూఢనమ్మకాలు జన మస్తిష్కాల్లో విషంలా నిండివుండేవి. తెగల సాంప్రదాయం- దాని నాయకత్వాలు సైతం ఈ చిల్లర దేవుళ్ళ పునాదులపైనే ఏర్పడి ఉండినాయి. పూజారి వర్గం, మాంత్రికుల బృందం ప్రజలను మూఢత్వపు అధఃపాతాళానికి నెట్టివేశారు. జీవన్మరణాలపై, ఆర్థిక లావాదేవీలపై, మొక్కుబడులపై ఆధారపడిన సామాజిక వ్యవస్థలో ఎన్నికల మానసిక రుగ్మతలు సంభవమో. అవి అన్ని తెగలలో వాటి తాలూకు జన సమూహాలల్లో తిష్ఠవేసుకొని ఉన్నాయి. ఈ నేపథ్యంలో ఇస్లాం మనిషిలోని సహజత్వాన్ని, అతని నైజాన్ని సంబోధిస్తూ అతని ముందుకు వచ్చింది. సృష్టించిన సృష్టికర్తకు మాత్రమే చట్టాన్ని నిర్దేశించే అధికారం, ఆరాధనాధికారం వుందని స్పష్టంగా ప్రకటించింది. నిజపోషకుడు, ఆరాధ్యుడు అయిన దేవుడు, ఆయన గుణవిశేషణాలను ప్రజలకు పరిచయం చేయడం మొదలెట్టింది. ఈ కృషి ఫలితంగా అజ్ఞాన అంధకారపు దట్టమైన పొరల క్రింద అణచివేయబడివున్న మనిషి సహజమైన నైజం- అంతరాత్మ మేల్కొంది. ప్రవక్త(స) ద్వారా మానవ సహజ నైజపు అంతరాత్మను ఇలా సంబోధించడం జరిగింది.

> "ఇలా అను: భూమ్యాకాశాల సృష్టికర్త, ఉపాధి ప్రదాతే తప్ప, ఉపాధి గ్రహీతకానివాడు అయిన అల్లాహ్‌ను కాదని మరెవరినైనా నా సంరక్షకునిగా చేసుకోవాలా? ఇలా చెప్పు : అందరికంటే ముందు నేను ఆయనకు విధేయుణ్ణి కావాలని నన్ను ఆదేశించడం జరిగింది. (ఇంకా ఇలా తాకీదు ఇవ్వబడింది. ఎవరైనా షిర్క్ చేస్తే చేయనీ) 'నీవు మాత్రం ముష్రిక్కులలో కలిసిపోవద్దు' ఇంకా ఇలా అను: ఒకవేళ నా

ప్రభువు ఆజ్ఞలను ఉల్లంఘిస్తే- ఒక మహా (భయంకర మైన) రోజున శిక్షను తప్పించుకొన్నవాడిని అల్లాహ్ నిజంగా కరుణించి నట్లయితే, అదే ప్రస్ఫుటమైన సాఫల్యం. అల్లాహ్ కనుక మీకు ఏదైనా నష్టం కలిగిస్తే- ఆయనకు తప్ప, ఆ నష్టాన్నుండి మిమ్మల్ని రక్షించగలిగేవారు ఎవరూ లేరు. ఆయన మీకు ఏదైనా మేలు చేయదలిస్తే ఆయనకు అన్నింటిపైనా అధికారం ఉంది. ఆయనకు తన దాసులపై సంపూర్ణ మైన అధికారాలు కలిగి ఉన్నాడు. ఇంకా అత్యంత వివేకవంతుడు, అన్నీ తెలిసినవాడు. వారిని అడుగు: ఎవరి సాక్ష్యం సాక్ష్యంకంటే గొప్పది? అని. ఇలా అను: నాకూ మీకూ మధ్య సాక్షిగా అల్లాహ్ వున్నాడు. ఈ ఖుర్ఆన్ నా వద్దకు 'వహీ' ద్వారా పంపబడింది. మిమ్మల్నీ, మరి ఇది ఎవరెవరి వద్దకు చేరుతుందో వారందరినీ నేను హెచ్చరించాలని. అల్లాహ్‌తోపాటు ఇంకా ఇతర దేవుళ్ళు కూడా వున్నారని మీరు నిజంగా సాక్ష్యం ఇవ్వగలరా? ఇలా అను: నేను అలాంటి సాక్ష్యం ఎంతమాత్రమూ ఇవ్వలేను. అను : దేవుడు ఆయన ఒక్కడే. మీరు చేసే షిర్క్‌ను నేను అసహ్యించుకుంటున్నాను.

*(దివ్యఖుర్ఆన్ 6 : 14-19).*

"ప్రవక్తా! వారితో ఇలా అను: అల్లాహ్‌ను కాక, మీరు వేడుకునే ఇతరులకు దాస్యం చేయడం నాకు నిషేధించబడింది. ఇలా అను: నేను మీ కోరికలను అనుసరించను. అలా చేసినట్లయితే, నేను మార్గభ్రష్టుడనయిపోతాను. సన్మార్గం పొందిన వారిలో వుండను. అను: నా ప్రభువు వద్ద నుండి వచ్చిన ఒక సుస్పష్టమైన ప్రమాణం విషయంలో నేను స్థిరంగా ఉన్నాను. మీరు దానిని అసత్యమని తిరస్కరించారు. ఇప్పుడు మీరు తొందర పెడుతున్న విషయం మాత్రం నా ఆధీనంలో లేదు. నిర్ణయాధికారం పూర్తిగా అల్లాహ్‌కే వుంది. ఆయనే సత్య

విషయాన్ని ప్రకటిస్తాడు. ఆయనే ఉత్తమ నిర్ణయం చేసేవాడు. ఇలా అను: మీరు తొందరపెట్టే విషయం నా అధీనంలోనే గనుక ఉన్నట్లయితే, నాకూ మీకూ మధ్య ఎప్పుడో తీర్పు జరిగిపోయివుండేది. కాని దుర్మార్గుల పట్ల ఎలా వ్యవహరించాలో అల్లాహ్‌కు బాగా తెలుసు. అగోచరాల తాళం చెవులు ఆయన వద్దనే ఉన్నాయి. వాటిని ఆయన తప్ప మరెవ్వరూ ఎరుగరు. భూమిలోనూ సముద్రంలోనూ ఉన్నదంతా ఆయనకు తెలుసు. చెట్టు నుండి ఏ ఆకైనా ఆయనకు తెలియకుండా రాలదు. భూమిలోని చీకటి పొరలలో ఉన్న ఏ గింజైనా ఆయనకు తెలియకుండా లేదు. తడిగా ఉన్నదీ, పొడిగా ఉన్నదీ అంతా విపులమైన ఒక గ్రంథంలో వ్రాయబడి వుంది. ఆయనే రాత్రివేళ మీ ఆత్మలను వశపర్చుకుంటాడు. పగటి వేళ మీరు చేసేదంతా ఆయన తెలుసు కుంటాడు. మళ్ళీ రెండో రోజు ఆయన మిమ్మల్ని ఈ వ్యవహార ప్రపం చంలోకి తిరిగి పంపుతాడు. మీ నిర్ణీత జీవితకాలం పూర్తి కావటానికి. చివరకు మీరు ఆయన వైపునకే మరలిపోవాలి. అప్పుడు ఆయన మీరు చేస్తూ ఉన్నదంతా చూపుతాడు. తన దాసులపై ఆయనకు పూర్తి అధికారం వుంది. మిమ్మల్ని కనిపెట్టి వుండేవారిని నియమించి పంపు తాడు. చివరకు మీలో ఎవరికైనా మరణం ఆసన్నమైనపుడు ఆయన పంపిన దూతలు అతని ప్రాణం తీసుకుంటారు. తమ కర్తవ్య నిర్వహణలో వారు ఏమాత్రం అజాగ్రత్త చూపరు. మళ్ళీ వారంతా తమ నిజమైన ప్రభువు అల్లాహ్ సన్నిధికి మరలింపబడతారు. తెలుసుకోండి. తీర్పు తీర్చే సర్వాధికారాలు ఆయనకే ఉన్నాయి. లెక్కను తీసుకోవడంలో ఆయన ఒడిగలవాడు.

"ప్రవక్తా! వారిని ఇలా అడుగు : భూ సముద్రాల చీకట్లలోని ప్రమాదాల నుండి మమ్మల్ని కాపాడేది ఎవరు? మీరు (ఆపద సమయంలో) కడుదీనంగా విలపిస్తూ అతిగోప్యంగా వేడుకొనేది ఎవరిని? ఈ

ఉపద్రవం నుండి ఆయనగనుక మిమ్మల్ని రక్షిస్తే, మేము తప్పకుండా కృతజ్ఞులం అవుతాము అని మీరు అనేది ఎవరితో? ఇలా అను: అల్లాహ్ మీకు దాని నుండి ప్రతి బాధ నుండీ విముక్తి కలిగిస్తాడు. తరువాత మీరు ఇతరులను ఆయనకు భాగస్వాములుగా నిలబెడతారు. ఇలా చెప్పు: ఆయనకు ఈ శక్తివుంది. ఏదైనా శిక్షను పైనుండి మీపై అవతరింపజేయగలడు. లేదా, మీ పాదాల క్రింద నుండి తీసుకు రాగలడు. లేదా మిమ్మల్ని వర్గాలుగా విభజించి ఒక వర్గం బలాన్ని మరొక వర్గానికి రుచి చూపించగలడు. చూడండి! వారు బహుశా సత్యాన్ని గ్రహిస్తారని, మేము ఏ విధంగా మా సూచనలను మాటి మాటికీ రకరకాలుగా వారి ముందు పెడుతున్నామో"

*(దివ్యఖుర్ఆన్ 6 : 56–65)*

మానవ నైజం సహజంగా ఈ సంబోధనను శ్రద్ధగా ఆలకించింది. ఆనాటి చీకటికాలంలో పరిస్థితుల బలమైన అడ్డుగోడల ఆవల నుండి తన వైపునకు వచ్చిన ఈ సంబోధనను స్వీకరించింది. తర్వాత తన వాస్తవ ఆరాధ్యుని వైపుకు మానవ సహజ నైజం మరలింది. ఫలితంగా ఈ నూతన ఇస్లామీయ సందేశం ఆనాటి అజ్ఞానపు చీకటిపై విజయం సాధించింది.

ఎప్పుడైతే ప్రజలు తమ నిజప్రభువు అయిన ఆ ఒకే ఒక్క దైవం వైపునకు మరలినారో... ఈ భూమిపై మనిషి మరో మనిషికి చేసే దాస్యం– మనిషి ఆధిపత్యం రద్దయిపోయింది. ఒకరిముందు మరొకరు సమానులైపోయారు. సమస్త మనోమస్తిష్కాలు తమ ఏకైక ప్రభువు ముందు వినమ్రమైపోయాయి. ఫలితంగా జాత్యాహంకారం, వంశపారంపర్య అహంభావం, వర్ణబేధం– పవిత్ర రక్తం తద్వారా సంభవించే అధికారాల హోదాలు అన్నీ సమాప్తం చేయబడ్డాయి. ఈ విప్లవాత్మక మార్పు ఎలా సంభవమైంది?

అరబ్బు ద్వీపకల్పం– దాని చుట్టుపక్కల ఉన్న తెగల, భౌతిక, ఆధ్యాత్మిక

జాతిపునాదుల పరిస్థితులపై ఆధారపడి ఏ వ్యవస్థ నిర్మించబడివుందో దానిని దాని ద్వారా లబ్ధి పొందే వర్గంతోపాటు, ఈ పరిస్థితుల వల్ల నష్టపోతున్నవారు కూడా ఈ వ్యవస్థనే గౌరవించారు. దానికి కనీస వ్యతిరేకత కూడా చూపేవారు కాదు. ఖురైష్ తెగవారు తమ్ముతాము అధికులమని భావించేవారు. ఇతర తెగలపై తమ ఆధికృతల హక్కును, అధికారాన్ని ప్రత్యేకంగా చెలాయించేవారు. హజ్ సందర్భంలో మిగిలిన తెగల ప్రజలు 'అరాఫత్' మైదానంలో విడిది వుంటే- ఖురైష్ వారు ప్రత్యేకంగా 'మజ్‌దలిఫా'లో విడిది చేసేవారు. తమ ఆచార వ్యవహారాల ద్వారా, తెగ, జాతి, రక్తం పునాదులపై ప్రత్యేకించబడిన ఈ ఖురైష్ తెగ, తమ ప్రత్యేకతల కారణంగా మొత్తం అరబ్బు భూభాగంపై ప్రత్యేక అదనపు లాభాలు పొందేవారు. తమ ఆధిపత్యాన్ని ఇతర తెగలపై ఆధ్యాత్మిక, ఆచారాల పేరుతో రుద్దేవారు. కాబా ప్రదక్షిణ సమయంలో ఖురైష్ తెగవారి వద్ద కొన్న దుస్తులు మాత్రమే ధరించాలనే కట్టడి కూడా విధించారు. అలా కొనలేనివారు నగ్నంగా కాబా ప్రదక్షిణ చేయవలసి వచ్చేది. అరబ్బు భూభాగమంతా తెగల సంస్కృతి మూలంగా కక్షలు, కార్పణ్యాలు, పోరాటాలు, యుద్ధాలు, రక్తపాతాలతో నిండి ఉండింది.

అరబ్బులకు పొరుగునే ఉన్న పారశీక (ఇరానీ) సమాజం వర్గాలుగా చీలివుండింది. కులీనులు, కులహీనులు, పూజారులుగా ముక్కలై వుండింది. ఈ వర్గాల మధ్య వైరుధ్యాలు దూరాలు కడుదీర్ఘంగా వుండేవి. ఈ దూరాల మధ్య సయోధ్య అనే వారధి నిర్మించడం బహుకష్టతరంగా, కాదు అసాధ్యంగా ఉండింది. కనీసం కలయిక కూడా సాధ్యమయ్యేది కాదు. కులీనుల, రాజ వంశీకుల ఆస్తులను సాధారణ ప్రజలు కొనడం చట్టపరమైన నేరంగా పరిగ ణించబడేది. ఈరానీ పాలకుల రాజ్యనిర్మాణంలో ప్రతి మనిషి అతని జాతి, జన్మరీత్యా ఏ స్థితిని కలిగివుంటాడో అందులోనే శాశ్వతంగా ఉంచడం అత్యంత ప్రధానమైన విషయంగా ఉండేది. తన జన్మరీత్యా దొరికిన సామాజిక హోదా

నుండి పైకి ఎదగడానికి ఎట్టి పరిస్థితుల్లోనూ అనుమతి వుండదు. తన వృత్తి తప్ప మరే వృత్తి వైపునకు కన్నెత్తి చూసే అధికారం కూడా ఉండదు. ఇరానీ సామ్రాజ్యాధికారి 'కిస్రా' (కిస్రా అనేది పారశీక సామ్రాజ్యాధిపతి బిరుదు) ఏ వ్యక్తికి కూడా వ్యక్తిగతంగా పనులు అప్పగించేవాడు కాదు. ప్రజలు స్వయంగా తాము ఏ వర్గం లేక వృత్తికి చెందినవారో ఆయా వృత్తిని సామాజిక హోదాను స్వచ్ఛందంగా స్వీకరించేవారు. పారశీక రాజులు తమ వంశంలో 'దైవరక్తం' ప్రసరిస్తూ వుందని భావించేవారు. తనకుతానుగా దైవవారసునిగా భావించేవాడు. ఇక సాధారణ ప్రజలు రాజును దైవాంశ సంభూతునిగా భావించేవారు. మరికొందరు రాజునే దైవంగా పూజించేవారు. వారు సాధారణ ప్రజలకంటే ప్రత్యేకతలు కలిగినవారుగా చెలామణి అయ్యేవారు. ప్రజలు వారికి ముడుపులు చెల్లించడం తమ జన్మహక్కుగా భావించేవారు. వారిని ఆరాధనల్లో భాగంగా కీర్తిస్తూ గానాలాపనలు చేసేవారు. వారిని రాజ్యాంగేతర శక్తులుగా, విమర్శకు అతీతులుగా భావించేవారు. వారు చెప్పిందే వేదం- చేసిందే చట్టం. అమలు పర్చేదే న్యాయం. రాజును అతని నిజనామంతో పిలవడం, సంబోధించడం పాపంగా భావించేవారు. రాజు సమక్షంలో కూర్చోవడం కూడా నేరంగా భావించబడేది. సమస్త పాలితులపై రాజుకు సంపూర్ణ హక్కు ఉంటుంది. కాని ప్రజలకు రాజుపై ఎలాంటి హక్కు వుండదు. రాజు తన రాజ్యంలోని ఏ వ్యక్తి నుండి అయినా అతని సంపదను గాని, అతని గృహపు సుందర వనితలను గాని, కానుకగా లేక కోరికగా తీసుకుంటే, అది ఆ గృహస్థ గౌరవంగా భావించబడేది. ఈ దౌష్ట్య పరిపాలనను, చేష్టలను మూగగా భరించడం తప్ప వారికి మార్గాంతరం వుండేది కాదు. రాజవంశానికి ప్రత్యేకతలు ఆపాదించడం ద్వారా వీరి వంశస్థునికి మాత్రమే కిరీటధారణ హక్కు అధికారం వుందనీ- వీరికి మాత్రమే శిస్తులు వసూలు చేసే అధికారం వుంటుందని నమ్మబడేది. ఈ హక్కు వంశపారంపర్యంగా కొనసాగేది. ఈ హక్కును ప్రశ్నించడం

రాజద్రోహంగా, దైవధిక్కారంగా భావించబడి శిక్షార్హంగా వుండేది. రాజవంశానికి చెందినవారు మాత్రమే రాజపాలనకు వారసులయ్యేవారు. ఈ హక్కులో ఎలాంటి మార్పులకు అనుమతి వుండదు. ఈ రాజవంశంలో ఎదిగిన మగవారు లేనిపక్షంలో పసిబాలుడినైనా వారసునిగా పట్టాభిషేకం జరుపబడేది. ఒకవేళ మగవారు లేనిపక్షంలో ఈ వంశపు స్త్రీని సర్వాధికారిణిగా ప్రకటించేవారు. పారశీక రాజవంశంలోని 'షేరోయి' తర్వాత అతని ఏడేండ్ల కుమారుడు 'ఉర్దేషేర్' రాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు. ఇదేవిధంగా 'షాపర్వేజ్ కిస్రా' అతి పిన్నవయసులో సింహాసనం అధిష్టించాడు. 'బోరాన్ బిన్తె కిస్రా', 'అజ్రమీదుఖ్' లనబడే సుకుమారులైన స్త్రీలను వారి వంశం నుండి, మగవారులేని సమయంలో గద్దెపై కూర్చోబెట్టారు. కాని అదే సమయంలో రాజవంశానికి చెందని మహాయోధుడు 'రుస్తుం'కు రాజ్యాధికార పగ్గాలు అప్పగించే ఆలోచనే కలగలేదు.

ఇక భారతదేశంలో వర్ణవ్యవస్థ సమాజాన్ని అందులోని మెజారిటీ ప్రజలను అత్యంత క్రూరంగా అణిచివుంచింది. క్రీ.శ. 300 సంవత్సరం క్రితం భారతదేశంలో బ్రాహ్మణ సంస్కృతీ ప్రచారం అత్యంత బలంగా వుండింది. ఆ కాలానికి చెందిన ధర్మశాస్త్ర కోవిదుడైన 'మనువు' భారతదేశపు హిందూ సమాజానికి ఒక చట్టాన్ని, ధర్మశాస్త్రాన్ని అందించి దానిని అత్యంత పటిష్ఠంగా ఆచరింపజేశాడు. ఈ మను ధర్మశాస్త్రం హిందూ సమాజానికి చట్టపరమైన దస్తావేజుగా చెలామణి అయ్యింది. వికటాట్టహాసం చేసింది. (అంబేద్కర్‌లాంటి దళిత మేధావులు ఈ మను ధర్మశాస్త్రాన్నే బహిరంగంగా తగులబెట్టారు) ఈ మనుధర్మశాస్త్రం ప్రకారం, సమాజం నాలుగు వర్ణాలుగా నిచ్చెన మెట్ల వలె విభజించబడింది. 1) బ్రాహ్మణులు అనగా మతపరమైన ఆధ్యాత్మిక నాయక వర్గం 2) క్షత్రియులు, అనగా యుద్ధకౌశలం ఎరిగిన యోధుల వర్గం 3) వైశ్యులు: అనగా వ్యాపార, వ్యావసాయిక వర్గం 4) శూద్రులు, అనగా

ప్రత్యేకమైన పనిబాధ్యతలు లేని; కేవలం పై మూడు వర్ణాలను సేవించడమే వృత్తిగా కలిగిన సేవిక వర్గం. ఈ నిచ్చెన మెట్ల సామాజిక వ్యవస్థకు దైవాంగీకారం ఆపాదిస్తూ 'మనువు' ఇలా ప్రకటించాడు. 'సృష్టికర్త అయిన బ్రహ్మ సామాజిక కార్యకలాపాల నిర్వహణకు తన ముఖం నుండి, తన బాహువుల నుండి, తన తొడల నుండి, తన పాదాల నుండి- బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను సృజించాడు. ఈ ప్రపంచ పరిరక్షణకు, సంక్షేమానికి ఆయన ప్రతి వర్ణానికి ప్రత్యేకమైన విధులను ఏర్పర్చాడు. బ్రాహ్మణులకు వేద విద్య నేర్వడం, నేర్పించడం, దేవతల సంతుష్టి కొరకు అర్పణలు సమర్పించడం, దానాలు స్వీకరించడం విధి చేయబడింది. క్షత్రియులకు, వర్ణ వ్యవస్థ రక్షణా బాధ్యతను అప్పగించడం జరిగింది. ఇంకా దానాలు ఇవ్వడం, సంతర్పణలు చేయడం, వేదం నేర్వడం, స్వలాభాపేక్షకు దూరంగా వుంటూ కర్తవ్య నిర్వహణ చేయడం విధి చేయబడింది. వైశ్యులకు, ఆర్థిక వ్యవస్థ అప్పగించబడింది. వ్యవసాయం చేయడం, వ్యాపారం ద్వారా వ్యవస్థకు ఆర్థిక పుష్టి కల్పించడం ఆదేశించబడింది. పై రెండు వర్గాలకు సేవ చేయడం, దానాలు ఇవ్వడం, సంతర్పణలు అర్పించడం, వేదం నేర్వడం అనుమతించబడింది. శూద్రులకు పై మూడు వర్ణాలకు సేవ చేయడమనే ఒకేఒక విధిని సృష్టికర్త విధించాడు.

*(మను ధర్మశాస్త్రం- మొదటి భాగం)*

ఈ మను ధర్మశాస్త్రం పునాదులపై బ్రాహ్మణ వర్ణం మిగిలిన వర్ణాలకంటే ఉన్నతులయ్యారు. వారికి ప్రాధాన్యత- ప్రముఖత్వం, పవిత్రతలు ఈ ధర్మశాస్త్రం ద్వారా ఆపాదించబడ్డాయి. వారు దేవతలకు సరిసమానులయ్యారు. (దైవం మంత్రాధీనం - మంత్రం బ్రహ్మణాధీనం- బ్రాహ్మణీమమ దేవతః) అనగా దైవం మంత్రబద్ధుడై ఉన్నాడు, ఈ మంత్రం బ్రాహ్మణుని అధీనంలో ఉంది కనుక బ్రాహ్మణుడే నా దైవం) మనుధర్మ శాస్త్రం బ్రాహ్మణుల ఆధిక్యతను చాటుతూ ఇలా ఆదేశం జారీచేసింది. అప్పుడే జన్మించిన బ్రాహ్మణ బాలుడు సైతం సృష్టిలో అత్యున్నత స్థానం కలిగివుంటాడు. ఈ

భూమికి అతను అధిపతి. ఈ భూమిలోని సమస్త జీవరాశులకు అతను అధినేత. ధర్మశాస్త్ర పరిరక్షణ అతని ప్రధాన బాధ్యత. ఈ ప్రపంచంలోని సమస్త వస్తుసముదాయం బ్రాహ్మణుని సొత్తు. ఎందుకంటే; ఈ సృష్టిలో సర్వోన్నత జన్ముడు బ్రాహ్మణుడే. సమస్త సంపద అతనిదే' *(మనుధర్మశాస్త్రం-మొదటిభాగం)*

"బ్రాహ్మణుడు తన సేవకుడైన శూద్రుని సంపదను బలవంతంగా తీసుకోగలడు. ఈ చర్య ఎంతమాత్రమూ పాపం కాదు. ఈ చర్యను నేరంగా పరిగణించరాదు. ఎందుకంటే; సేవకుడు సంపదకు యజమానిగా వుండ కూడదు. సేవకుడూ, అతని సంపదా సమస్తమూ అతని యజమాని (బ్రాహ్మణుని) సొత్తు' *(మనుధర్మశాస్త్రం- ఎనిమిదవ భాగం)*

"ఏ బ్రాహ్మణునికి రుగ్వేదం చదవవచ్చునో - అతను సర్వపాపాల నుండి పవిత్రుడు. ముల్లో కాలను అతను సర్వనాశనం చేసినా అతనికి పాపం అంటదు. ఎవరి ఆహారాన్ని అయినా అతను (బ్రాహ్మణుడు) అపహరించవచ్చు. అతనికి పాపం అంటదు" *(మనుధర్మ శాస్త్రం- తొమ్మిదవ భాగం)*

"మరణశిక్ష విధించవలసిన నేరంలో కూడా- నేరస్తుడు బ్రాహ్మణుడైతే అతనికి కేవలం శిరోముండనం చేయాలి. అదే నేరం ఇతర వర్ణస్తులు చేస్తే మరణశిక్ష అమలుపర్చాలి." *(మనుధర్మశాస్త్రం- ఎనిమిదవ భాగం)*

"దేశానికి రాజైనవాడు ఎంతటి అవసరంలో ఉన్నా చివరికి మరణ శయ్యపై ఉన్నా అతను బ్రాహ్మణుని వద్ద నుంచి సుంకం (పన్ను) వసూలు చేయకూడదు. దేశంలోని ఏ ఒక్క బ్రాహ్మణుడు కూడా ఆకలితో మరణించ కుండా రాజు జాగ్రత్త పడాలి" *(మనుధర్మ శాస్త్రం- ఏడవ భాగం)*

మనుధర్మ శాస్త్ర ప్రకారం క్షత్రియ, వైశ్యవర్ణాలు పై తరగతికి చెంది నప్పటికీ బ్రాహ్మణులకు సరిపాటి కారు. ఈ విషయం మనువు ఇలా సెలవిచ్చారు.

'పదేండ్ల బ్రాహ్మణ బాలుడు, వందేళ్ళ క్షత్రియుడు తమ తమ హోదాల ప్రకారం బ్రాహ్మణ పసిబాలుడు తండ్రి హోదా కలిగివుంటాడు. శతాధిక వృద్ధుడైన క్షత్రియుడు కుమారుని హోదా కలిగివుంటాడు"

(మనుధర్మశాస్త్రం- రెండవ భాగం)

ఇక శూద్ర, అతిశూద్ర అంటరాని ప్రజా సమూహం హిందూ వర్ణ వ్యవస్థలో పశువుల కంటే హీనంగా, కుక్కలకంటే నీచమైన స్థానం కలిగివుండే వారు. ఈ విషయాన్ని వివరిస్తూ మనుధర్మ శాస్త్రం ఇలా వక్కాణించింది. బ్రాహ్మణ సేవయే శూద్రునికి అత్యంత గౌరవనీయమైన కర్తవ్యం. ఇందుకుగాను అతనికి లభించే పుణ్యఫలం చాలా గొప్పది. శూద్రునికి అవకాశం లభించినా సంపదను సంపాదించరాదు. అలా సంపదను జమచేయడం ద్వారా ఆ శూద్ర సేవకుడు బ్రాహ్మణునికి మనస్తాపం కలిగిస్తాడు (మనుధర్మశాస్త్రం- పదవభాగం)

"శూద్రుడు ఎప్పుడైనా ద్విజునిపై (బ్రాహ్మణునిపై) చేతితోకాని, కర్రతో కాని దాడిచేయ ప్రయత్నిస్తే అతని చేతులు నరికివేయాలి. ఒకవేళ క్రోధంతో కాలితో దాడిచేస్తే అతని కాలు నరికివేయాలి. ఒకవేళ శూద్రుడు బ్రాహ్మణునితో సమానంగా కూర్చోవడానికి ప్రయత్నిస్తే అతని పిరుదులు ఖండించి వేయాలి. దేశ బహిష్కరణ చేయాలి" మను ధర్మశాస్త్రం- ఎనిమిదవ భాగం) మనుధర్మ శాస్త్రం ఇంకా ఇలా స్పష్టం చేస్తుంది. "ఒకవేళ ఒక శూద్రుడు బ్రాహ్మణునిపై దాడిచేసి అతనిని దూషిస్తే ఆ శూద్రుని నాలుకను ఖండించి వేయాలి. శూద్రుడు విద్యాబోధన చేయపూనుకుంటే సలసలమరిగే నూనె అతని చేత తాగించాలి. ఇంకా... 'ఒక శూద్రుణ్ణి చంపడం- కుక్క పిల్లి, కాకి, గుడ్ల గూబలను చంపడంతో సంభవించే పాపానికి సమానం"

ఇక ప్రసిద్ధిగాంచిన రోము నాగరికతను పరిశీలిస్తే రోము రాజ్యవ్యవస్థ మొత్తంగా బానిసలపై ఆధారపడివుండింది. ఈ వ్యవస్థలోని మూడు వంతుల

ప్రజలు బానిసలుగా వుంటారు. నాలుగవ వంతు బానిస యజమానులు, సైనికుల హోదా కలిగివుంటారు. చట్టం అమలులో ప్రభుత్వం, బానిసల మధ్య పూడ్చసాధ్యంకాని అంతరం ఉండేది. కులీనుల, సాధారణ బానిసల మధ్య స్పష్టమైన విభజన రేఖ వుండేది. ప్రఖ్యాత చరిత్రకారుల రచనల ప్రకారం, "ఒక కులీన వర్గ వ్యక్తి ఒక వితంతువునుగాని, లేక కులీన స్త్రీని గాని బలవంతపరిస్తే దానికి శిక్ష అతని సంపదను జప్తు చేసుకోవడంగా ఉండేది. ఇదే నేరం ఒక వృత్తాకార సాధారణ పౌరుడు లేక బానిస చేస్తే అతనికి కొరడా దెబ్బల శిక్షతోపాటు దేశబహిష్కరణ జరుపబడేది"

ప్రపంచవ్యాపితంగా పైవిధమైన అజ్ఞానపు– అకృత్యాల వ్యవస్థలు వికటాట్టహాసం చేస్తూ వుండిన చీకటికాలంలో– ఆ చీకటి ద్వారా అణచివేయ బడి ఉన్న మానవ సహజ నైజాన్ని ఇస్లాం సంబోధించింది. మార్పు వైపునకు పిలుస్తూ వుండింది. మానవ అంతర్గత నైజంపై వాతావరణానికి పూర్తి వ్యతిరేక మైనదని ఇస్లాంకు స్పష్టంగా తెలుసు. మానవ నైజం సహజంగానే ఇస్లామీయ పిలుపును ఆమోదించింది. అల్లాహ్ ఆదేశాలను శిరసావహించింది. ఆ విప్లవాత్మకమైన ఇస్లామీయ పిలుపు ఇలా సాగింది.

"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకోవడానికి మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరికంటే భయభక్తులు కలిగినవాడే అల్లాహ్ దృష్టిలో గౌరవ పాత్రుడు" *(దివ్యఖుర్ఆన్ 49: 13)*

ఈ మానవ సహజ నైజం ప్రవక్త ముహమ్మద్(స) సంబోధననూ ఆలకించింది. పులకించింది... అంగీకరించింది. 'జనులారా! మీ ప్రభువు ఒక్కడే. మీ తండ్రి కూడా ఒక్కరే. అందరూ ఆదం నుండి వచ్చినవారే. ఆదం (అలై) మట్టి నుండి సృజించబడ్డారు. మీలో దైవం పట్ల భయభక్తులు కలవారే

అత్యంత గౌరవపాత్రులు. అరబ్బుకు అరబ్బేతరుపై గాని, అరబ్బేతరునికి అరబ్బుపైగాని, నల్లవానికి తెల్లవానిపైగాని, తెల్లవానికి నల్లవానిపైగాని ఎలాంటి ఆధిక్యత లేదు. భయభక్తుల పునాదులపై తప్ప." *(బుఖారి- ముస్లిం)*

ప్రవక్త(శ్రీ ప్రత్యేకంగా తన స్వంత తెగ అయిన ఖురైష్ వారిని సంబోధిస్తూ ఇలా పలికారు. "ఓ ఖురైష్ తెగవారలారా! మీకై మీరు శ్రమపడండి. నేను అల్లాహ్ వద్ద ఏ విధంగానూ సహాయపడలేను. ఓ మునాఫ్ సంతానమా! నేను అల్లాహ్ వద్ద మీకు ఎలాంటి సహాయమూ అందించలేను. ఓ అబ్బాస్ ఇబ్నె ముతల్లిబ్! అల్లాహ్ సమక్షంలో నేను మీకు ఎలాంటి సహాయమూ అందించలేను. ఓ ముహమ్మద్(స) పుత్రిక ఫాతిమా! నా సంపద నుండి నీకు కావలసినది కోరుకో... తీసుకో! కాని, అల్లాహ్ సమక్షంలో నేను, నీకు ఎలాంటి సహాయమూ అందించలేను. ' *(బుఖారి- ముస్లిం)*

మానవ సహజ నైజం ఈ ఆమోదయోగ్యమైన, అద్భుతమైన, పిలుపును అందుకుంది. అలా అందుకున్న వెంటనే తన చుట్టూ వున్న సామాజిక చీకటి పటాపంచలైపోయింది. తదుపరి దైవిక మార్గదర్శకత్వం, దాని వ్యవస్థ చూపిన మార్గంపై నడక ప్రారంభించింది. ఈ మొత్తం ఆచరణ దైవసంప్రదాయం విధివిధానాలకు అనుగుణంగానే సంభవించింది. ఇది ఎప్పుడైనా, ఏ కాలంలోనైనా, ఎక్కడైనా సంభవమే.

అరబ్బు భూభాగంపై దైవవ్యవస్థ స్థాపించబడి దాని వెలుగులు నలు దిక్కులా ప్రసరిస్తూ సాగుతూవుండిన కాలంలో- ఈ వ్యవస్థ తాత్విక సైద్ధాంతిక పునాదులు మెజారిటీ ప్రజలచే ఆమోదింపబడ్డాయి. వ్యవస్థీకృతం అయ్యాయి. ఒక వ్యక్తి (అనగా ప్రవక్త ముహమ్మద్(స) తన వ్యక్తిగత ఆదర్శాలను, తన ప్రాంతీయ స్థాయిలో స్థాపించాడని ఎవరైనా భావిస్తే అది అతని సంకుచిత ఆలోచనలకు నిదర్శనంగా నిలుస్తాయి. ఖురైష్ వ్యాపార వర్గం వేసవిలో సిరియా వైపునకు, చలికాలంలో యమన్ వైపునకు వ్యాపార బిడారాలను

నడిపేవారు. ఈ సీజనల్ వ్యాపారం ద్వారా వారు అమితంగా లాభాలు గడించేవారు. బద్ర్ యుద్ధ సమయంలో అబూ సుఫియాన్ వర్తక బిడారు కోసం ముస్లింల చిరుసైన్యం మాటువేసి ఉండింది. ఈ వర్తక బిడారులో సుమారు వేయి ఒంటెలపై లాభాల సామాను ఉండింది. ఈ సందర్భంగా గుర్తుంచుకో వలసిన విషయమేమంటే, సామాజిక పరిస్థితులకు అనుగుణంగా మార్పు సంభవిస్తుందనే సాధారణ సూత్రాలకు భిన్నంగా అరబ్బు సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థ వుండింది. ఆనాడు 'వడ్డీ' కేవలం వ్యక్తిగత విషయంకాదు. వడ్డీ పునాదులపై నాటి అరబ్బు ఆర్థిక వ్యవస్థ నిర్మించబడి ఉండింది. ఈ కారణంగానే అల్లాహ్ మాటిమాటికీ 'వడ్డీ'కి వ్యతిరేకంగా తన ఆదేశాలను జారీచేశాడు. ప్రవక్త ముహమ్మద్(స) మాటిమాటికి ఈ క్రూర వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడారు.

ప్రవక్త ముహమ్మద్(స) జన్మించకముందు నుండి అరబ్బు భూభాగంలో వడ్డీ సాధారణ విషయంగా వుండింది. వ్యాపార లావాదేవీలు, ఇచ్చిపుచ్చుకో వడాలు అన్నీ వడ్డీ పునాదులపైనే జరిగేవి. ఒక్కమాటలో నాటి ఆర్థిక వ్యవస్థకు పునాదిగా 'వడ్డీ' వుండింది. మదీనా నగరంలో కూడా ఈ ఆర్థిక విధానమే అమలయ్యేది. మదీనాలోని ఆర్థిక వ్యవస్థను యూదు వడ్డీవ్యాపారులు నియంత్రించేవారు. ఇస్లాం మదీనా నగరానికి రావడంతోనే మొట్టమొదటి ఈ క్రూరమైన, నీచమైన వడ్డీ ఆధారిత ఆర్థిక వ్యవస్థపై వేటుపడింది. దానికి ప్రత్యామ్నాయంగా జకాత్ ఆధారిత ఆర్థిక వ్యవస్థను అది సమాజానికి అందించింది. జకాత్, ఖర్జె హసనా (సహాయకరణం) సహకారం, సహాయం, మద్దతులాంటి పదాలను, పద్ధతులను ఆర్థిక విధానంలో ప్రవేశపెట్టింది. అమలు జరిపింది. సూరతె బఖర 274 నుండి 281వ వాక్యాల వరకు అల్లాహ్ ఈ పద్ధతిని సవివరంగా ఇలా విశదీకరించాడు.

"తమ సంపదను రేయింబవళ్ళు బహిరంగంగానూ, రహస్యంగానూ ఖర్చుచేసేవారు తమ ప్రతిఫలాన్ని తమ ప్రభువు వద్ద పొందుతారు. వారికి ఏ

విధమైన భయంగాని, దుఃఖంగాని కలిగే అవకాశం లేదు. కాని వడ్డీ తినేవారి స్థితి షైతాన్ పట్టడం వల్ల ఉన్మాది అయిన వ్యక్తి స్థితిలాంటిది. ఈ స్థితికి గురి కావడానికి కారణం వారు 'వ్యాపారం కూడా వడ్డీలాంటిదేగా'అని అనటమే. వాస్తవానికి అల్లాహ్ వ్యాపారాన్ని ధర్మసమ్మతం (హలాల్) చేశాడు. వడ్డీని నిషిద్ధం (హరామ్) చేశాడు. కనుక తన ప్రభువు చేసిన ఈ హితబోధ అందే వ్యక్తి ముమ్మందు వడ్డీ తినడం త్యజిస్తే, అతను పూర్వం తిన్నదేదో తిన్నాడు. అతని వ్యవహారం చివరకు అల్లాహ్ వద్దకే పోతుంది. ఆదేశం తర్వాత మళ్ళీ ఈ దుశ్చేష్టకు పాల్పడేవాడు నిశ్చయంగా నరకవాసి. అక్కడ అతను శాశ్వతంగా వుంటాడు. అల్లాహ్ వడ్డీని నశింపజేస్తాడు. దానధర్మాలను పెంచి అధికం చేస్తాడు. కృతఘ్నుడూ, దుష్టుడూ అయిన వ్యక్తిని అల్లాహ్ ప్రేమించడు. కాని విశ్వసించి మంచిపనులు చేసేవారికి, నమాజ్‌ను స్థాపించేవారికి, జకాత్‌ను యిచ్చేవారికి వారి ప్రభువు వద్ద తగిన ప్రతిఫలం లభిస్తుంది. వారికి భయం కాని, శోకంకాని కరిగే అవకాశం లేదు. విశ్వసించిన ప్రజలారా! మీరు నిజంగా విశ్వాసులే అయితే, అల్లాహ్‌కు భయపడండి. ఇంకా మీకు ప్రజల నుండి రావలసిన వడ్డీని విడిచిపెట్టండి. కాని, ఒకవేళ మీరు అలా చేయకపోతే, మీపై అల్లాహ్ తరఫు నుండి, ఆయన ప్రవక్త వైపు నుండి యుద్ధ ప్రకటన వుంది. అనే విషయం తెలుసుకోండి ఇప్పుడైనా మీరు పశ్చాత్తాపపడితే (వడ్డీని వదులుకుంటే) అసలు సొమ్ము తీసుకోవడానికి హక్కుదారులవుతారు. మీరూ అన్యాయం చేయకూడదు. మీకూ అన్యాయం జరగకూడదు. మీ బాకీదారుడు ఆర్థిక ఇబ్బందులలో వుటే, అతని పరిస్థితి మెరుగుపడే వరకు గడువు ఇవ్వండి. లేక మీరు తెలిసినవారే అయితే ఆ బాకీని అతనికి దానం చెయ్యండి. అది మీకు ఎక్కువ శ్రేయస్కరం. అల్లాహ్ వద్దకు మీరు మరలివెళ్ళే రోజున జరిగే పరాభవం నుండి, కలిగే ఆపద నుండి రక్షించుకోండి. అక్కడ ప్రతి ఒక్కడికి అతడు చేసిన మంచి చెడ్డలకు పరిపూర్ణ ప్రతిఫలం లభిస్తుంది. ఎవరికీ ఏమాత్రం అన్యాయం జరగదు"

మానవ సహజ నైజం తాను మునిగివున్న నీచ నికృష్ట పరిస్థితి నుండి మహోన్నతమైన దైవసందేశాన్ని శ్రద్ధగా ఆలకించింది. వడ్డీ ఆధారిత ఆర్థిక వ్యవస్థ నుండి తన్ను తాను ప్రత్యేకపర్చుకొంది. ఇలా ప్రత్యేకించుకోవడం నాటి పరిస్థితుల దృష్ట్యా కఠినమైన, అసాధారణ విషయంగా వుండింది. అయినా మానవ సహజ నైజం ఈ దుష్టవ్యవస్థ నుండి బయల్పడింది. ఈ మొత్తం ఆచరణలో అతికష్టమైన అడ్డంకులన్నింటినీ, మానవ సహజనైజం ఉత్సాహంగా, ఆమోదయోగ్యంగా, అత్యంత దృఢంగా ఎదిరించింది... అధిగమించింది. ముస్లిం సమాజం (దైవవిధేయుల సమాజం) సామాజిక పీడ అయిన అజ్ఞాన వ్యవస్థనుండి తన్ను తాను విముక్తపర్చుకొంది. పవిత్రమయ్యింది. ఈ మార్పు దైవసంప్రదాయానికి అనుగుణంగానే సంభవించింది. అసమ, అజ్ఞాన వ్యవస్థ ఉనికిలో వున్న ప్రతీచోట ప్రతీకాలంలో, ఈ మార్పు సంభవమే. అయితే ఆ కాలంలో మానవనైజానికి ఈ విప్లవాత్మక పిలుపు అందించవలసి వుంటుంది. ఈ పిలుపు అందిన వెంటనే మానవ సహజ నైజం స్పందించి తీరుతుంది. చీకటి తెరలను చీల్చుకుంటూ వెలుగు వైపునకు ప్రస్థానం కొనసాగిస్తుంది.

వ్యతిరేక పరిస్థితులు, శక్తులు ఆధిక్యత కలిగివున్న సమయాల్లోనూ, చుట్టూ వున్న సామాజిక వాతావరణం అననుకూల స్థితిలో ఉన్నకాలంలోనూ, దైవధర్మ వ్యవస్థ విజయవంతమై తీరుతుందని రుజువు చేయడానికి పై మూడు చారిత్రక ఉదాహరణలు సరిపోతాయి. పై చారిత్రక ఉదాహరణలు రుజువుల ప్రకారం, విశ్వాసాలు, ఆలోచనలు, దృక్పథాలు, పరిస్థితులు, ఆచార వ్యవహారాలు, సాంస్కృతిక నేపథ్యాలు, వ్యవహారశైలులు వాటి తాలూకు వ్యవస్థలు, వాటి సత్యతలను దైవధర్మ వ్యవస్థ త్రోసిరాజని ముందుకు సాగుతుందని రూఢీ అవుతుంది. సహజంగా సమాజంపై పైన వివరించిన అంశాలే ఆవరించి, ఆధిపత్యం వహిస్తూ ఉంటాయి. మానవ సహజ నైజపు జ్ఞానం లేనివారు ఈ అంశాలనే సత్యమైనవిగా, మార్పుకు లోనుకానివిగా భావిస్తారు. ఇస్లాంపై

సామాజిక నేపథ్యంలో ఈ పరిణామానికి అణుకువగల సేవకునిగా ససేమిరా నిలువదు. తత్వ్యతిరేకంగా ఈ నేపథ్యాన్ని పూర్తిగా నేలమట్టం చేసివేస్తుంది. నూతన పునాదులపై దృఢమైన నూతన సామాజిక వ్యవస్థను స్థాపించే కృషిని ప్రారంభిస్తుంది. దానిని పరిపూర్తి చేస్తుంది.

పైన వివరించిన దైవధర్మ స్థాపనా విధానం అంతా అల్లాహ్ విధివిధానాల, సాంప్రదాయాల ప్రకారమే జరుగుతుందనే విషయం మరోసారి గుర్తుంచుకోవాలి. పరిణామాత్మక లేక గుణాత్మక లేక అలవాటైన పడికట్టు పదాల పద్ధతిలో ఈ మార్పు సంభవించదు. ఇటువంటి మహత్తర మార్ప చరిత్రలో ఒకసారి సంభవించివుంది. అలాంటి మార్పు మరోసారి కూడా సంభవమే అవుతుంది. ఎవరైతే మానవ నైజపు ఈ సహజ శక్తిని వెలికితీస్తాడో- దానిని సామూహిక శక్తిగా మలుస్తాడో, దానికి సరైన దైవాదేశ మార్గదర్శకత్వం అందిస్తాడో అతను ఈ దైవవ్యవస్థా నిర్మాణాన్ని తప్పనిసరిగా నిర్మించి నిలబెట్టగలడు.

నేటి మానవ సమాజం ఈ సత్యవంతమైన చైతన్యాన్ని పొందడానికి గతం కంటే ఎక్కువ అర్హత కలిగివుంది. నేటి సమాజం ముందు, గతకాలపు అపార అనుభవాలు, ఆచరణలు, ప్రత్యేకించి ఆదర్శవంతమైన ఖలీఫాల కాలం మనసు, మార్గదర్శకత్వం, రుజుమార్గం అందించడానికి సిద్ధంగా ఉంది. మొట్టమొదటిసారిగా ఈ దైవిక వ్యవస్థను స్థాపించే కృషిచేసిన వారు కష్టాల కడలికలను వ్రాశారు. వ్యతిరేకతల పర్వతాలను దాటారు. దుర్మార్గాల ఎదురు దెబ్బలను కాచుకున్నారు. విరుచుకుపడిన సాయుధ దళాలను ఎదుర్కొన్నారు. ఈ నేపథ్యంలోనే మానవ సహజ నైజం దైవధర్మ వ్యవస్థా స్థాపనకు అంగీకరించింది. ఆచరించింది. చివరగా స్థాపించింది. తన ఈ మహాప్రస్థానంలో అపార అనుభవాల తాలూకు లోతైన ఆధారాలను, జ్ఞాపకాలను, అనుభూతులను, సాక్ష్యాలను ముందు తరాలవారికి అందించి వెళ్ళింది.



# అనుభవాల నుండి ఆచరణ వైపునకు..

మనిషిలోని సహజ నైజపు అంతర్గత శక్తి ద్వారా మొట్టమొదటి సారిగా మానవ సమాజానికి ఇస్లాం ఎదురు నిల్చింది. మానవ సహజ నైజం దైవవ్యవస్థకు అనుకూలంగా ఉంటుంది. అయినా వంశం, తెగ, జాత్యాహంకారం, పవిత్ర రక్తం లాంటి అజ్ఞానకాలపు భావజాలం మానవ నైజాన్ని చీకటిలా ఆవరించి వుండింది. ఈ కారణంగా మానవ సహజ నైజం తన సహజత్వం నుండి బహుదూరంగా విసిరివేయబడివుండింది. కాని మానవ అంతర్గత నైజం ఈ కటిక చీకటి కంటే ఎంతో బలీయమైన శక్తి కలిగి వుంటుంది. అది తన పరిపూర్ణ శక్తి ద్వారా చీకటిని చీల్చివేసే సామర్థ్యం కలిగి వుంటుంది.

గతంలో ఈ విషయాన్నే మనం అనేక వాస్తవాల ద్వారా తెలుసుకున్నాం. ఇస్లాం 'మొదటి తరం' ఒక అద్భుతమైన కాలంగా విరాజిల్లింది. అది మానవ సమాజపు ఆకాశయానంగా లేక మహా ప్రస్థానంగా కొనియాడదగింది. అది వెలుగును విరజిమ్మే దీపస్థంభం లాంటిది. సృష్టికర్త అయిన అల్లాహ్ సాంప్రదాయానికి అనుగుణమైన, ఆదర్శవంతమైన నమూనాగా నిలిచింది. భవిష్యత్ తరాలకు తమ ఆచరణకు కొలమానాలను, ప్రమాణాలను అందించింది. తద్వారా మరలా మరోసారి మానవ సమాజం తమ ప్రతిభలకు అనుగుణంగా మొదటి తరం అందించిన నమూనా సామాజిక వ్యవస్థను నిర్మించే

కృషిలో నిమగ్నం కాగలదు. నిజానికి ఇస్లామీయ వ్యవస్థను స్థాపించిన ఆ మొదటి తరం నాటి సామాజిక, రాజకీయ, ఆర్థిక, భావాత్మక పరిస్థితులకు అనుగుణంగా ఉనికిలోకి వచ్చింది ఎంతమాత్రమూ కాదు. మానవ సహజ నైజానికి మార్గదర్శకత్వం, నాయకత్వం, శిక్షణ, అవకాశం అందిన వెంటనే అది తన సంపూర్ణ రూపంలో ఖిలాఫత్ వ్యవస్థగా సాక్షాత్కరించింది. దైవసహాయంతో ఎంచుకోబడిన ఒక మానవ బృందం, నైతిక విలువల ఉన్నత శిఖరాలపై విరాజిల్లింది కాని, మానవ సమాజం మొత్తంగా ఈ మహోన్నత శిఖరాలపై ఎక్కువ కాలం నిలువలేకపోయింది. అనేది కాదనలేని సత్యం. కాని ఇదే కాలంలో ఒక అద్భుతంగా, అత్యంత వేగంగా, ఇస్లాం ప్రపంచం నలు మూలలా వ్యాపించింది. చరిత్రలో ఎన్నడూ సంభవించని ఒక మహాద్భుతంగా సమూహాలకు సమూహాలు ఇస్లాంను అంగీకరించాయి. ఈ కారణంగా ఇస్లామీయ ఉన్నత విలువల శిక్షణ ఇవ్వడం కష్టతరమైంది. ఈ కారణంగా మెజారిటీ ప్రజలు ఈ శిక్షణను పొందలేకపోయారు. క్రమక్రమంగా ఈ శిక్షణలోని కొరత కారణంగా మొదటి తరం చేరుకున్న ఉన్నత శిఖరాలకు చేరలేక ఒక మెట్టు క్రిందిస్థాయికి మాత్రమే చేరగలిగింది. విలువల ఉన్నత శిఖరాలకు చేరడం – సహజ నైజానికి నిరంతర శిక్షణ ఇవ్వడం ద్వారా సాధ్య మయ్యే ఆచరణ, ఈ ఆచరణల స్థాయి ఎంచుకోబడిన వ్యక్తులు మాత్రమే పొందగలరు.

దాదాపు వేయి సంవత్సరాల వరకు ఇస్లామీయ సమాజం మొదటి తరపు ప్రత్యేక బృందం నెలకొల్పిన ఉన్నత శిఖరాల నుండి క్రింది స్థాయిలోని వివిధ ప్రమాణాలలో, స్థాయిలలో కొనసాగింది. అయినప్పటికీ నాటి ప్రపంచంలో ఉనికిలోవున్న వివిధ నాగరిక సమాజాల, సామాజిక స్థాయికన్నా ఉన్నత స్థాయి కలిగి విరాజిల్లింది. ప్రపంచ మానవ సమాజాలు ఇస్లామ్ అందించిన ఈ విలువల నుండి మార్గదర్శకత్వాన్ని, జ్ఞానపు వెలుగులను

గ్రహించాయి. ఇస్లామీయ ఉద్యమ ప్రభావానికి గురికాని నాగరిక ప్రమాణాలు నాడు లేవని చెప్పడానికి చరిత్రయే సాక్ష్యంగా నిలిచివుంది.

మానవ చరిత్రలో ఇస్లామీయ 'మొదటితరం' స్థాపించిన ఉన్నత విలువలు ఈ వేయి సంవత్సరాలలో వ్యర్థం కాలేదు. సరికదా, మరింత విస్తృత పర్చబడ్డాయి. మొదటితరం అంతరించిన తర్వాత దాని మార్గదర్శకత్వంలో దాని అనుభవాల ద్వారా సమాజం ముందకు సాగిందే తప్ప, వెనుకకు మరల లేదు. అలా వెనుకకు మరలడం దైవ సంప్రదాయానికి వ్యతిరేకమైంది. మాన వత్వపు శరీరం నిరంతరం సజీవంగా వుండి తన అనుభవాల ద్వారా లబ్ధి పొందుతూ, తద్వారా సముపార్జించిన జ్ఞానాన్ని క్రోడీకరిస్తూ ముందుకు సాగుతుంది. అజ్ఞానపు పరదాలు కప్పివేయబడినా, దౌర్జన్యపు చిమ్మచీకట్లు కమ్ముకున్నా అనుభవాల ద్వారా పొందిన జ్ఞానం మానవత్వాన్ని చైతన్యపరు స్తూనే ఉంటుంది. మానవత్వపు శరీరాన్ని నిరంతరం ప్రభావశీలంగా వుంచు తుంది. ఇస్లామీయ సందేశం మొదటిసారిగా తన గొంతు సవరించినప్పుడు అది మనిషిలోని సహజ నైజపు శక్తి ఆధారంగా మానవ సమాజ పరిసరాలను ఎదుర్కొంది. (మొదటిసారిగా అంటే ప్రవక్త ముహమ్మద్(స) గారికి ముందు కూడా ఆయా కాలాల్లో ఆయా ప్రవక్తలు ఇస్లామీయ సందేశం ఇవ్వడం జరిగింది. అయితే అది ఆయా తెగలకు, ప్రాంతాలకు, జాతులకు మాత్రమే పరిమితమైంది. చివరి ప్రవక్త ముహమ్మద్ (స) మొదటిసారిగా ప్రపంచ మానవాళి మొత్తానికి ఇస్లామీయ సందేశం అందించడానికి దైవం తరపున పంపబడ్డారు) ఈనాటికీ మన సహజ నైజంలో అంతర్గతంగా "ఆ మొదటి తరం" వదలివెళ్లిన ప్రభావాలను, చైతన్యాలను జీవితపు అన్నిరంగాలలో గమనించగలుగుతాం.

ఇస్లామీయ వ్యవస్థ ఈ అద్భుత అనుభవాలు నిరంతరం మనిషిని చైతన్యపరుస్తూనే ఉన్నాయి. కొందరు ఇస్లామీయ విశ్వాసాలను అంగీకరిం

చారు. కొందరు ఇస్లాంలో ప్రవేశించారు. మరికొందరు ఇస్లామీయ రాజ్య నీడలో జీవించారు. మరికొందరు ఇస్లామీయ ఉద్యమ విస్తృతి, ప్రచారాల ద్వారా ప్రభావితులయ్యారు. అదే సందర్భంలో దైవాదేశాల నుండి ఒక సమాజం దూరంగా తొలగినప్పుడు ఆ సమాజంపై ఆవరించిన అజ్ఞానపు చీకట్లు, దాని పర్యవసానాలను కూడా మానవ చరిత్ర అనుభవించింది.

ఇస్లాం మొదటిసారిగా, నియమ నిబంధనలు, సిద్ధాంతాలు, ప్రమాణాలు, పరిస్థితులు, దాని పటిష్ఠ నిర్మాణం ద్వారా మానవ సమాజాన్ని ఎదుర్కొంది. ఆ సమయంలో ఇస్లాం వద్ద మానవ సహజ నైజపు శక్తి తప్ప మరే ఆయుధమూ లేదు. ఆకాలపు మానవ సమాజం ఈ నూతన జీవన విదానంతో ప్రప్రథమంగా కఠినంగానూ, మరింత దృఢంగానూ వ్యతిరేకించింది. ఆ కాలంలో ఇస్లామీయ తత్వచింతన, ఆచరణలు మానవ సమాజానికి నూతన విషయాలుగా కనిపించాయి. ఈ నూతన ఆవిష్కరణకు, గత కాలపు భావజాలానికి మధ్య పూడ్చలేని అగాధం వుండింది. నూతన విలువలు, నియమనిబంధనలు, సిద్ధాంతాలు, జీవన విధానం, సమస్త మానవాళి అంతరంగాల్లో, సాంస్కృతిక విలువలలో దూసుకెళ్ళాయి. తమ సంపూర్ణ శక్తితో వారి మధ్య స్థిరత్వం సంపాదించాయి. ఆ తరువాత గడిచిన సుదీర్ఘకాలంలో ఇస్లాం దాని వివిధ ప్రమాణాల్లో మానవ జీవితాన్ని ప్రభావితం చేస్తూనే ఉంది. పద్నాలుగు వందల సంవత్సరాల తర్వాత ఇస్లామీయ జీవన విధానం ప్రపంచ ప్రజలకు ఇప్పుడు అపరిచితమైనది కాదు. ఆచరణాత్మక వ్యవస్థగా, దాని అనుభవం నేడు లేకపోయినా జ్ఞానాత్మక అనుభవం దాదాపు ప్రపంచమంతా ఎరిగివుంది. ఇస్లామీయ ఉన్నత విలువలు, నియమ నిబంధనలు, విశ్వాసాలు, ప్రమాణాలు పటిష్టమైన, నిర్మాణపరమైన సమిష్టి జీవనం వగైరాలు ఇప్పటి ప్రపంచానికి సుపరిచితాలైనాయి. ఈ కారణంగా 'మొదటితరం' ఎదుర్కొన్న అజ్ఞానపు సామాజిక స్థితి నేడు లేదు. గతంకన్నా ఇప్పుడు ఇస్లామీయ వ్యవస్థ నిర్మాణానికి పరిస్థితులు, అనుభవాలు అనుకూలంగా ఉన్నాయి.

మానవ సమాజం ఆ 'మొదటి తరం'లో తప్ప ఆ తర్వాతి కాలంలో ఇస్లామీయ మహోన్నత విలువలను రుచి చూడలేదన్నది కాదనలేని సత్యం. అదే సమయంలో వివిధ కాలాలలో ఇస్లామీయ వ్యవస్థ వివిధ ప్రమాణాలలో స్థాపించబడింది. కాని ఆ 'మొదటితరం' ఉచ్ఛస్థితి, ఆత్మ అందులో కానరాలేద న్నదీ ఒక నగ్నసత్యం. అదే విధంగా ఆ మహోన్నత విలువల శిఖరంపై అధిరోహించే ప్రయత్నం నిరంతరంగా మానవ సమాజంలో జరుగుతూనే ఉందనేది కాదనలేని వాస్తవం. సైద్ధాంతికంగా ఆలోచిస్తే ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థ మొదటిసారిగా స్థాపించబడినపుడు, ఆనాటి వాతావరణానికి అది పూర్తిగా నూతన జీవన విధానం. అయినప్పటికీ అది స్థాపించబడింది. మరి ఇప్పుడు సైద్ధాంతికంగానూ, వివిధ ప్రమాణాల ఆచరణల ద్వారానూ ప్రతిభా ప్రభావాల ద్వారానూ ఇస్లామీయ వ్యవస్థ నేటి ప్రపంచానికి సుపరిచితమై ఉంది. ఈ కారణంగా ఇస్లామీయ స్వభావాన్ని అర్థం చేసుకోవడం, దానిని స్వీకరించడం గతంకన్నా నేడు అనుకూలమైంది. ఈ వాస్తవాన్ని మరింతగా రుజువు చేయడానికి కొన్ని ఉదాహరణలను, సాక్ష్యాలను క్లుప్తంగానైనా సరే నేడు చారిత్రకంగా పరిశీలించవలసి ఉంది. ఈ చిరుపుస్తకంలో వివరణా త్మకంగా విషయాన్ని చర్చించడం సాధ్యం కాదు. కనుక కొన్ని, కొండగుర్తు రుజువులను గమనిస్తూ సాగుదాం. ఇస్లామీయ వ్యవస్థ తన వివిధ ఆచరణల ద్వారా ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో జీవితపు విభిన్న కోణాలలో ఏ ప్రభావాలను ప్రభవింపజేసింది అవి కడు విశాలమైనవి, అత్యంత లోతైనవీనూ. ఈ విస్తృతమైన, విశాలమైన ప్రభావాలన్నింటినీ అక్షరబద్ధం చేయడం ఏ రచయితకు కూడా సాధ్యంకాని పని. జీవితంలోని ప్రతి కోణంలో ఇస్లామీయ వ్యవస్థ తనదైన స్పష్టమైన గుర్తులను, ప్రమాణాలను వదిలింది. ఆ ప్రమాణాల పునాదులపైనే అభివృద్ధిని గురించి ఆలోచించడం, ఉన్నత విలువల గురించి చర్చించడం సాధ్యమవుతుంది. ప్రపంచంలోని ఉన్నత స్థాయి చారిత్రక పరిశోధ

కులు, రచయితలు ఈ ప్రమాణాలను, ప్రభావాలను, విలువలను పునాదులుగా అంగీకరించారు.

యూరప్‌లో ఆధ్యాత్మిక పరిష్కారాన్ని కోరుతూ 'మార్టిన్ లూథర్' నడిపిన వర్ణ వివక్షతా వ్యతిరేక ఉద్యమం 'కాల్‌ఫిన్' కొనసాగింపు ఉద్యమం. అప్పటి నుండి, ఇప్పటి వరకు అభివృద్ధి, హక్కులకు సంబంధించి జరిగిన ఉద్యమాలు ఉదాహరణకు, రాచరిక వ్యవస్థకు వ్యతిరేకంగా, వంశం, తెగ, జాతి, లేక ఒక వర్ణ ప్రజల ఆధిపత్యానికి వ్యతిరేకంగా సాగిన ప్రజాస్వామిక ఉద్యమాలు, మానవ హక్కుల ఉద్యమాలు ఫ్రెంచి విప్లవం, అనుభవాల నుండి అభివృద్ధి వైపునకు సాగే వైజ్ఞానిక ఉద్యమాలు ఆశ్చర్యచకితులుగా చేసే వైజ్ఞానిక ఆవిష్కరణలు, చరిత్రలో మైలురాళ్లుగా నిలిచిపోయే అనేక చారిత్రక ఉద్యమాల వ్రేళ్లు ఇస్లామీయ తత్వదర్శనం నుండి గ్రహించబడ్డవేనని చెప్పడం అతిశయోక్తి కాదు. పైన పేర్కొన్న ప్రజాస్వామిక, అభివృద్ధికర ఉద్యమాలన్నీ ఇస్లామీయ వ్యవస్థతో లోతుగా, పునాదిపరంగా ప్రభావితమయ్యాయని చెప్పడం ఒక చారిత్రక వాస్తవం. 'డాక్టర్ అమిన్‌మిస్రీ' తన ప్రఖ్యాత చారిత్రక గ్రంథం 'సహీ అల్ ఇస్లాం'లో ఇలా వివరించారు.

"ఎనిమిదవ శతాబ్దంలో క్రైస్తవ ప్రపంచం అనేక సమస్యలతో సతమత మవుతూ ఉండింది. ఆధ్యాత్మికంగా ఆ సమస్యలను పరిష్కరించడానికి ఉద్య మించిన ఉద్యమాలన్నీ కూడా ఇస్లామీయ తాత్విక దృక్పథంతో, ఇస్లామీయ విశ్వాసాలతో ప్రభావితమైనవే. ఉదాహరణకు, ఫ్రాన్స్‌లోని ఒక ప్రాంతమైన 'సిప్టమానియా'లో క్రైస్తవ ఫాదరీల ముందు పాప ఒప్పుదలకు వ్యతిరేకంగా ఒక ఉద్యమం లేవదీయబడింది. ఫాదరీలకు పాపాలను వినే, వాటిని క్షమింప జేసే హక్కు లేదని ఈ ఉద్యమకారులు వాదించారు. మనిషి ఒకవేళ పాపం చేస్తే ఆ పాపానికి క్షమాపణ పొందడానికి దైవం ముందు చేతులు జోడించి వేడుకోవాలే తప్ప పాపక్షమాపణకై ఫాదరీల వద్దకు వెళ్లరాదని పాపక్షమాపణా

హక్కు ఫాదర్లకు లేదని వీరు తీర్మానించారు. ఈ ఉద్యమకారుల వాదనలు, ఇస్లామీయ బోధనలకు అనుగుణమైనవనేది జగమెరిగిన సత్యం. ఇస్లాంలో మధ్యవర్తిత్వ ఫాదరీ వ్యవస్థకు, సన్యాస వ్యవస్థకు తావులేదు. భగవంతునికి, భక్తునికి మధ్య మధ్యవర్తి అవసరం లేదని ఇస్లాం బోధిస్తుంది. తొమ్మిదవ శతాబ్దంలో విగ్రహ విధ్వంసక విప్లవం యూరప్‌ను కుదిపివేసింది. విగ్రహాల స్థాపనను, వాటి పూజను ఈ ఉద్యమకారులు వ్యతిరేకించారు. క్రీ.శ. 726లో 'లియోసోమ్' చక్రవర్తి విగ్రహ ప్రతిష్టాపనలు చట్టవ్యతిరేకమైనవిగా ప్రకటించాడు. క్రీ.శ. 730లో ఇదే చట్టాన్ని మరలా మరింత కఠినంగా అమలు చేయాలని ఆజ్ఞ జారీ చేశాడు. నాలుగవ లియో, ఐదవ 'ఖస్‌తన్‌తీన్'ల ఆలోచనలు కూడా విగ్రహ ప్రతిష్టాపనలకు వ్యతిరేకంగా ఉండేవి. అదే సమయంలో ఆ ప్రాంత రోమన్ కాథలిక్ పీఠాధిపతి అయిన పోప్ జర్మానుస్ మరియు రాజ్యపు మహారాణి విగ్రహారాధనకు అనుకూలంగా ఉండేవారు. ఈ రెండు గ్రూపుల మధ్య తీవ్రమైన పోరాటం జరిగేది. ఈ విగ్రహ వ్యతిరేక ఉద్యమ బీజాలు ఇస్లామీయ తాత్విక భూమిక నుండే గ్రహించబడ్డాయనేది జగమెరిగిన సత్యం. ఆ కాలంలోనూ, ఈ కాలంలోనూ విగ్రహాలకు, వాటి పూజకు వ్యతిరేకంగా ఉన్న ఆధ్యాత్మిక ఉద్యమ జీవితం కేవలం ఇస్లాం మాత్రమే. ఆనాటి మరో కేథలిక్ పీఠాధిపతి క్లాడియస్ క్రీ.శ. 828లో పీఠాధిపతిగా నియుక్తుడైన వెంటనే ఆయన శిలువ పూజను, విగ్రహారాధనను ఖండిస్తూ విస్తృతంగా ప్రచారం చేశాడు. ఈయన ఇస్లామీయ స్పెయిన్‌లో జన్మించాడు. ఆయన బాల్యం ఇస్లామీయ వాతావరణంలో గడిచింది. ఈ కారణంగా ఆయన విగ్రహ వ్యతిరేకునిగా జీవించాడు. త్రిత్వాన్ని అంగీకరించక, ఏక దైవ ఉపాసనను అంగీకరించే ఒక గ్రూపు ఇప్పటికీ క్రైస్తవ ప్రపంచంలో ఉంది. వీరు ఏసును ఒక ప్రవక్తగా అంగీకరిస్తారే తప్ప దేవుడు 'కన్న కుమారుని'గా అంగీకరించరు. ఇది కూడా ఇస్లామీయ తత్వచింతనా ప్రభావ ఫలితమే తప్ప మరొకటి కాదు.

పదకొండవ శతాబ్దంలో శిలువ సైనికులు ఇస్లామీయ తూర్పు నుండి

తిరుగుముఖం పట్టినప్పుడు తనతోపాటుగా ఇస్లామీయ సామాజిక నిర్మాణపు చిత్రపటాన్ని దాని ప్రభావాలను తోడు తీసుకుని వెళ్లాయి. ఇస్లామీయ సామాజిక వ్యవస్థ సాధించిన ప్రగతి విశేషాల నుండి తీవ్రంగా ప్రభావితు లయ్యారు. ఈ ప్రభావాల ఫలితంగా వారిలో జనించిన మొట్టమొదటి అంశం 'సమానత్వపు భావజాలం'. పాలకుడు (ఖలీఫా), కార్యనిర్వాహక అధికారగణం మరియు పాలితులైన ప్రజలు అందరూ ఒకే షరీఅత్ (ధర్మశాస్త్రం)కు కట్టుబడి వుండటం వారిని విశేషంగా ఆకర్షించింది. పరిపాలనలో ఒక ప్రత్యేక వర్గం, వంశం, పవిత్ర రక్తంల ప్రస్తావన, ప్రత్యేకతలు కానరాని ఒక సామాజిక వ్యవస్థను వారు అబ్బురపడి వీక్షించారు. యూరప్‌లో ఈ విలువలు మచ్చుకు కూడా ఆ కాలంలో కానవచ్చేవి కావు. ఇస్లామీయ వ్యవస్థలో సమానత్వంతో పాటు వ్యక్తిగత స్వేచ్ఛ హద్దులు మించి, విశృంఖలంగా మార్పు చెందకుండా జాగ్రత వహించే హద్దుల నిర్ణయం. వ్యక్తిగతంగా ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యపు హక్కు కలిగి ఉండటం, ఆస్తిపాస్తులను తనకున్న ప్రతిభల ద్వారా, చట్ట పరిధిలో అభివృద్ధిపరచుకునే స్వేచ్ఛ, తన కృషి ద్వారా సమాజంలో గౌరవప్రదమైన స్థానం సంపాదించుకునే అవకాశాల సమృద్ధి కలిగి ఉండటం లాంటి అంశాలన్నీ యూరోపియన్‌లకు కళ్లు తెరపింపజేశాయి. ఈ ప్రజాస్వామిక విలువలు యూరప్‌పై తీవ్ర ప్రభావాన్ని కలిగించాయి. యూరప్‌లోని జాగీరుదారి వ్యవస్థలో బానిసల్లా పనిచేసే సాధారణ ప్రజలు, ఆలోచనాపరులు, ఈ అద్భుతమైన ఇస్లామీయ వ్యవస్థ నుండే ఇతోధిక చైతన్యాన్ని పొందారు. అప్పటి యూరప్‌లో ప్రభువుల అభిప్రాయమే చట్టంగా అమలయ్యేది. వారి వర్గ ప్రయోజనాలకే ప్రాధాన్యత ఉండేది. ప్రభువుల స్థాయి వారసత్వంగా కుటుంబానికి దక్కేది కాబట్టి వారి స్థాయి శాశ్వతంగా భావించబడేది. ఈ క్రూర సామాజిక స్థితి ఫలితంగానే ప్రభువులు, జమీందారు లకు వ్యతిరేకంగా సాధారణ ప్రజలు తిరుగుబాటు లేవదీశారు. భూస్వామ్య,

జమీందారీ వ్యవస్థకు మంగళంపాడి ప్రజలు తమ భూ బానిసత్వం నుండి స్వేచ్ఛను పొందారు. అయితే సామాజికంగా, ఆధ్యాత్మికంగా, నైతికంగా ఉన్న బానిసత్వం నుండి, అజ్ఞానం నుండి వారు స్వేచ్ఛ, విముక్తి పొందలేకపోయారు. ఇస్లామీయ సామాజిక స్థాయికి యూరప్ కడుదూరంగానే వుండిపోయింది.

స్పెయిన్ యూనివర్శిటీల్లో ఇస్లామీయ సంస్కారాలు, తాత్విక చింతనలు ఆవరించి వుండేవి. ఈ కాలంలోనే యూరప్ దార్శనికలు ఇస్లామీయ తాత్విక గ్రంథాలను తమ భాషల్లోకి అనువదించుకున్నారు. పద్నాల్గవ శతాబ్దంలో పుట్టుకొచ్చిన అనేక శాస్త్రీయ ఉద్యమాలకు ఈ గ్రంథాలే మూలకాలుగా నిలిచాయి. ఆధునిక విజ్ఞానశాస్త్ర అభివృద్ధి, పరిశోధనల నుండి ఫలితాలను రాబట్టే హేతుబద్ధ ఆలోచనా విధానం ఒక ఉద్యమంలా యూరప్‌ను చుట్టి వేయడం వెనుక ఇస్లామీయ తాత్వికతే ప్రధాన భూమిక పోషించింది. 'బ్రెఫోర్డ్' వ్రాసిన ప్రఖ్యాత గ్రంథం 'మానవత్వ నిర్మాణం'లో ఆయన ఇలా వివరించాడు.

"వర్తమాన ప్రపంచానికి కానుకగా (వి)జ్ఞానాన్ని అందించిన ఘనమైన చరిత్ర అరబ్బు సంస్కృతికి మాత్రమే ఉంది. ఈ జ్ఞాన ఫలితాలు చేతికందడానికి సుదీర్ఘకాలం పట్టవచ్చు. స్పెయిన్‌లో అరబ్బు (ఇస్లామీయ) సాంస్కృతిక చైతన్యం అందించిన విలువలు గుబాళించడానికి సుదీర్ఘకాలమే పట్టింది. అప్పటివరకు ఉన్న స్పెయిన్ (యూరప్ మొత్తంగా కూడా) సాంస్కృతిక భావ జాలం కేవలం అజ్ఞానపు చీకటి తెరలలో వుండింది. యూరప్ ప్రజల జీవితాలలో చైతన్యం నింపిన ఇస్లామీయ ప్రభావం కేవలం 'జ్ఞాన సముపార్జనకే పరిమితం కాలేదు. దానికి సామాజిక, రాజకీయ, ఆర్థిక, న్యాయ, నైతిక, తాత్విక దృక్పథాలు సైతం ప్రజలను ప్రభావితపరచాయి. యూరప్ నేడు సాధించి ఉన్న సకారాత్మక అభివృద్ధి అది ఏ రంగానికి చెందినదైనా దానిపై ఇస్లామ్ బలమైన ముద్ర తప్పక వుండి తీరుతుంది. వైజ్ఞానికంగా యూరప్ సాధించిన అభివృద్ధి తద్వారా అది సముపార్జించిన శక్తి సామర్థ్యాలన్నింటిపై

ఇస్లామీయ ప్రభావం బలంగా వుందని చెప్పడం అతిశయోక్తి కానేకాదు. (గమనిక : నాటి యూరోపియన్ రచయితలందరూ ఇస్లామీయ దృక్పథాన్ని 'అరబ్బు'దృక్పథంగా పేర్కొనేవారు. వారికి 'ఇస్లాం'అనే పదం మింగుడు పడేది కాదు. విశ్వజనీన ఇస్లామీయ వ్యవస్థను 'అరబ్బు ప్రాంతీయ' వ్యవస్థగా కుదించడానికి ఈ రచయితలు తీవ్ర కృషి చేసి విఫలమయ్యారు.)

యూరప్ సాధించిన వైజ్ఞానిక ప్రగతి అరబ్బులు పొందిన నూతన, అద్భుతమైన తాత్విక, సైద్ధాంతిక, సభ్యత, సంస్కృతులు, నైతిక విలువల ముందు వినమ్రమవుతుంది. పురాతన ప్రపంచానికి శాస్త్రీయ జ్ఞానపు సుగంధం కడు దూరంగా వుండింది. గ్రీకుల ఖగోళ శాస్త్ర జ్ఞానం, అప్పటి &ప్రపంచానికి అంతుబట్టనిదిగా వుండింది. వారి అంతుబట్టని ఈ రంగాలను, అరబ్బులు అభివృద్ధిపరిచారు. వాటికి శాస్త్రీయతలను తమ అనుభవాల ద్వారా, పరిశోధనల ద్వారా కల్పించారు. అదే సందర్భంలో గ్రీకుల పురాణ మాలిన్యాల నుండి తమను తాము ఎప్పటికీ పరిశుద్ధంగానే వుంచుకున్నారు. గ్రీకులు మతాన్ని నిర్మాణపరంగా పటిష్ఠపరిచారు. చట్టాలకు సామూహికత కల్పించారు. ఆలోచనల అభివృద్ధికి తర్కాన్ని ఉపయోగించారు. కాని తర్కశాస్త్ర ప్రయోజనం వారికి తెలియదు. ఒకే విషయాన్ని విభిన్న కోణాలలో పరిశీలించడం, వాటిని గ్రంథస్థం చేయడం, జ్ఞాన వివరణాత్మకత, నిరంతరం లోతైన పరిశీలన, అనుభవాల నుండి ఆచరణను సరిదిద్దుకోవడం లాంటి శాస్త్రీయ దృక్పథం గ్రీకుల స్వభావానికి గిట్టని అపరిచిత విషయాలై ఉంటాయి. యూరప్‌లో నేడు అనుభవాల నుండి, శాస్త్ర శోధన నుండి నూతన విషయాల ఆవిష్కరణలు విస్తృతంగా జరుగుతున్నాయి. ఈ పరిశోధనలనే, ఈ ఆవిష్కరణలనే మనం వైజ్ఞానిక అభివృద్ధి అని పిలుస్తున్నాం. ఈ అభివృద్ధికి అసలు ఆత్మలా పనిచేసే యోచన, ఆలోచన, పరిశీలనలు వాస్తవానికి యూరప్‌లోనికి అరబ్బుల ద్వారా ప్రవేశించింది.

'రడ్‌గర్ బైకన్' అరబ్బీ భాషను, శాస్త్ర విజ్ఞానాన్ని –స్పెయిన్ అరబ్బు పండితుల, వైజ్ఞానికుల నుండి ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో నేర్చుకున్నాడు. 'ఫ్రాన్సిస్ బైకన్', 'రడ్‌గర్ బైకన్' వీరిరువురూ పరిశోధన, అనుభవాల నుండి జ్ఞానం (భౌతికశాస్త్ర విజ్ఞానం) అనే సిద్ధాంతానికి ఆధునిక ఆద్యులుగా గుర్తింపు పొంది ఉన్నారు. అయితే ఈ గుర్తింపు పొందే హక్కు తమకు నిజంగా లేదనీ, తమ జ్ఞానానికి, పరిశోధనకు అరబ్బీ భాష, దాని ద్వారా పొందిన విజ్ఞానమే మూల రహస్యమని అనేకసార్లు వీరు స్పష్టపరిచారు.

పరిశోధనాత్మక విజ్ఞానాన్ని అవలంబించే వారు లేవనెత్తిన అనేక ప్రశ్నలు వాదాలు వాటి ఫలితాలు యూరప్ సాంస్కృతిక నేపథ్యాన్ని, వాటి పునాదులను కూకటివేళ్లతో పెకిలించి వేశాయి. బైకన్ వాదన ప్రకారం, ఆనాటి యూరప్‌లో అరబ్బు తాత్వికత లేక ఆలోచనా విధానం (ఇస్లామీయ తత్వజ్ఞానం) విస్తారంగా ప్రబలివుండింది. దేశపు విభిన్న ప్రాంతాల్లోని ప్రజలు ఈ ఆలోచనా విధానం వైపునకు అమితోత్సాహంతో పరుగులెత్తేవారు. బైకన్ ఏ విజ్ఞాన శాస్త్రాలను అధ్యయనం చేస్తాడో వాటికి ప్రేరణ, మూలం స్పెయిన్ లోని ఇస్లామీయ యూనివర్శిటీలేనన్నది తిరుగులేని వాస్తవం. బెకన్ తన గ్రంథం 'సీపస్ మెజస్' లోని ఐదవ భాగంలో 'ప్రత్యక్ష జ్ఞానం– అనుభవాలం జ్ఞానం'పై విస్తృతమైన చర్చ చేశారు. నిజానికి 'ఇబ్నుల్ హైతిమ్'చే వ్రాయబడిన పరిశోధనాత్మక గ్రంథం 'అల్‌మునాజిర్' ఈ చర్చకు భూమికగా –మూల గ్రంథంగా వుండింది.

న్యూయార్క్ యూనివర్శిటీ ప్రొఫెసర్ 'డ్రైబర్' తన గ్రంథం 'మత ఘర్షణలు –శాస్త్ర విజ్ఞానం'లో ఇలా వ్రాశాడు.

"కేవలం బుద్ధి, తాత్విక భావజాలం పునాదులపై అభివృద్ధి సాధ్యం కాదని ముస్లిం పండితులు ఖరాఖండిగా తేల్చివేశారు. వాస్తవ జ్ఞానం పొంద డానికి, సత్యశోధనకు, 'సంఘటనలు–పరిస్థితుల' అధ్యయనం తప్పనిసరి అని

వారు ప్రకటించారు. వారు తమ పరిశోధనలలో 'ఆచరణ- అనుభవాలు- నిరూపితమైన సత్యాలు, విధానాన్ని అవలంబించారు. ఈ విధానం ద్వారా వారు సాధించిన అభివృద్ధి, దాని గుర్తులు, సాక్ష్యాలు మనకు కోకొల్లలుగా దర్శనమిస్తాయి. నేడు మనం అనుసరిస్తున్న ఆధునిక విజ్ఞాన శాస్త్ర విధానాన్ని, వాటి పునాదులను, ఆనాటి ఇస్లామీయ అరబ్బు పండితులు వ్రాసిన గ్రంథా లలో గమనించి అబ్బురపడతాం. ఆచరణాత్మక జ్ఞానం, దాని అధునాతన సైద్ధాంతిక పునాదులను గమనించి ఆశ్చర్యచకితులు కాక తప్పదు. ఉదాహ రణకు, విశ్వవ్యవస్థ ఆవిర్భావం, ఆ తర్వాతి పరిణామాలను నాటి ఇస్లాం పండితులు తమ పాఠశాలల్లో విద్యార్థులకు బోధించేవారు. ఈ సిద్ధాంతాలనే నేడు ఆధునిక విద్యావిధానంలో విద్యార్థులకు బోధించబడుతుంది. ఇంకా ముందుకెళ్లి నాటి ఇస్లామీయ అరబ్బు పండితులు, పదార్థం- పదార్థ పరిణామం- పదార్థంలో అంతర్గతంగా జరిగే రసాయన చర్యలను సైతం అధ్యయనం చేశారు. (పదార్థ పరిణామవాదం అంటే డార్విన్ ప్రతిపాదించిన మానవ పరిణామవాద సిద్ధాంతం కాదు. ఇస్లామీయ పండితులు ప్రతిపాదిం చిన పదార్థ పరిణామం డార్విన్‌కు పూర్తిగా భిన్నమైంది. నాటి ముస్లిం పండితులు సృష్టిలోని, విభిన్న సృష్టితాల మధ్య ఉన్న భేదాలను, తేడాలను, వైరుధ్యాలను పరిగణనలోకి తీసుకున్నారు. వారు డార్విన్‌లాగా మనిషి 'అసలు'ను జంతువులకు ఆపాదించలేదు. తత్భిన్నంగా ఇస్లామీయ ఆలోచనా విధానం మనిషిని సంపూర్ణ సృష్టితంగా నిర్ధారించింది.) వైద్యరంగంలో అరబ్బులు రసాయన శాస్త్ర విజ్ఞానాన్ని ఉపయోగించి పరిశోధనలు చేశారు. శరీరంలో వృద్ధాప్యం ద్వారా సంభవించే క్షీణతను, దాని కారణాలను వారు గ్రంథస్థం చేశారు. చలన సిద్ధాంతంలో నాటి ముస్లిం పండితులు పూర్తి అవగాహన కలిగివుండేవారు. 'కాంతి-దృశ్యం'లకు సంబంధించి వారి ఆలోచనలు అత్యంత ఆధునికంగా ఉండేవి. నాటి గ్రీకు విజ్ఞానులు 'దృశ్యం

కంటి ద్వారా శరీరంలోనికి ప్రవేశిస్తుంద'ని తద్వారా మనకు 'చూపు' ఏర్పడు తుందని భావించేవారు. కాని, కాంతి పరావర్తనం ద్వారా మాత్రమే మనకున్న దృశ్యాన్ని చూడగలుగుతుందని అరబ్బు పండితులు నిరూపించారు. 'హసన్ బిన్ హైసమ్', వస్తువుపై కాంతి పడి వాయుతరంగాల ద్వారా ఆ కాంతి ప్రయాణించి మన కంటి వరకు చేరుతుందని ప్రకటించాడు. దృష్టి రహస్యాన్ని ఛేదించాడు. తద్వారా ఆయన సూర్య చంద్రాదులను మన కన్ను, నిజానికి అవి ఆకాశంలోకి వచ్చిన కొద్ది సమయం తర్వాతనే గమనించగలవనీ అలాగే సూర్యాస్తమయం 'వాస్తవంగా' జరిగిపోయిన తర్వాతనే మన కన్ను దానిని వీక్షించగలదని నిరూపించాడు. (అల్ ఇస్లాం దీనే ఇల్మ్ ఖాలిద్ గ్రంథం రచయిత ముహమ్మద్ ఫరీద్ వజదీ -కాలం హిజ్రీ 233, క్రీ.శ.863)

మానవ చరిత్రపై ఇస్లాం, దాని తాత్విక ఆలోచనా విధానం, ఆచర ణాత్మక జీవన విధానాలు తనదైన బలమైన ముద్రలను, తీవ్రమైన ప్రభావాన్నే వేసింది. ప్రపంచ వ్యాప్తంగా ఉవ్వెత్తున లేచిన ప్రజాస్వామిక, వైజ్ఞానిక అభివృద్ధికర ఉద్యమాలన్నింటిపై దాని ప్రభావం ఉంది. కాని చరిత్రకారులు సర్వసాధారణంగా ఈ విషయాన్ని దాచిపెట్టే ప్రయత్నం చేశారు. కొంతమంది చరిత్రకారులు ఈ విషయాన్ని స్పృశించినా అది అరబ్బు చరిత్రగా లేక ఆనాటి అభివృద్ధికర ధర్మంగా ముద్ర వేసే యత్నం చేశారు. ప్రపంచ నాగరికత నిర్మాణంలో, శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధిలో ప్రజాస్వామిక విలువల స్థాపనలో, సమత సమన్యాయాల అమలులో, ఆర్థిక, రాజకీయ సామాజిక రంగాల అభివృద్ధిలో ఇస్లాం భాగస్వామ్యాన్ని చీకటి కోణంలో బంధించడానికే ఈ సోకాల్డ్ చరిత్రకారులు కృషి చేశారు. ఈ కారణంగా నేటి ముస్లిం సమాజం ప్రపంచ నాగరికతా అభివృద్ధిలో, నూతన అభివృద్ధికర ఈ ప్రపంచంలో తమ భాగస్వామ్యం ఏమీలేదని అమాయకంగా భావించడం జరుగుతుంది. ప్రపంచ అభివృద్ధిలో ఇస్లాం పాత్ర ఏమీ లేదేమోనని దాని అనుయాయులు భావించడం

కద్దు. ఇస్లామీయ చరిత్ర గురించి, దాని ప్రభావ పరిణామాల గురించి మనకు తెలియకపోవడం కడు బాధాకరమైన విషయం. ఈ కారణంగా ఇస్లాం వ్యతిరేకులు చేస్తున్న దుష్ప్రచారాన్ని మూగగా భరించడం తప్ప గొంతెత్తి ఖండించలేకపోతున్నారు. ఇస్లామీయ జీవన వ్యవస్థ స్థాపన గురించి మన సమాజంలో ఉండవలసినంత ఉత్సాహం, ఆత్మవిశ్వాసం, నమ్మకం లేకపోవడానికి ఈ దుష్ప్రచార ఫలిత ఉదాసీనతే ప్రధాన కారణంగా పనిచేస్తుంది.

ముస్లిం సమాజంలో నెలకొని ఉన్న నిరాశానిస్పృహలకు శాస్త్రీయమైన సత్యమైన ఇస్లామీయ చారిత్రక అవగాహనా రాహిత్యం ప్రధాన కారణమవుతుంది. ఈ ఇస్లాం వ్యతిరేక దుష్ప్రచారకులు, సర్వమానవ సంక్షేమకర వ్యవస్థ అయిన 'ఇస్లాం'ను స్థాపించబడకుండా అడ్డుకోవాలని తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు. పైన పేర్కొన్న చర్చలో కేవలం ఇస్లాం తన మొదటి స్థాపనా కాలం నుండి ఇప్పటి వరకు ప్రపంచ నాగరికతపై, దాని వ్యవస్థలపై పడవేసిన ప్రభావాన్ని, వదలిన ముద్రలను క్లుప్తంగా వివరించడమే ప్రధాన లక్ష్యం. నేటి మనిషి ఈ ఇస్లామీయ ఖిలాఫత్ దైవ వ్యవస్థను స్థాపించడానికి మరింత అర్హుడైవున్నాడు. అంతేకాదు, దాని స్థాపనకు అవసరమైనంత అంతర్గత శక్తి సామర్థ్యాలను సమృద్ధిగా కలిగివున్నాడు.



# ప్రపంచంపై ఇస్లామ్ వేసిన శాశ్వత ముద్రలు

ప్రవక్త ముహమ్మద్ (స) నాయకత్వంలో ఇస్లామీయ వ్యవస్థ స్థాపించబడిన తరువాత దాని మొదటి తరం అంతరించిన తరువాత అనగా ఖిలాఫత్ వ్యవస్థ పతనానంతరం –మరలా దైవేతర అజ్ఞాన వ్యవస్థ ప్రపంచ నాయకత్వపు పగ్గాలు చేపట్టింది. ఒకప్పుడు ఈ నాయకత్వ స్థానాన్ని ఇస్లామీయ వ్యవస్థ – అజ్ఞాన వ్యవస్థ నుండి గుంజుకుని వుండింది. షైతానీయ దుష్టత్వం మరలా రొమ్ము విరుచుకున్నది. ప్రపంచ మైదానంలోకి అడుగుపెట్టింది. అయినా అది సంపూర్ణంగా ప్రపంచాన్ని మళ్లించలేకపోయింది. ప్రపంచంపై పూర్తి స్థాయి పట్టు సాధించలేకపోయింది. దీనికి కారణం ఏమిటంటే – ఇస్లాం వ్యవస్థీకృతంగా ఉనికిలో లేకపోయినప్పటికీ అది భావజాలంగా– జీవన విధానంగా మానవ సమాజాన్ని చైతన్యపరుస్తూ వుండింది. ఇస్లామ్ విశాలమైన,గాఢమైన ముద్రలు ప్రజల మనోమస్తిష్కాలలో బలంగా నాటుకొని వున్నాయి. విశ్వాసులు వ్యవస్థీకృతంగా కాలేకపోయినా, వ్యక్తిగతంగా, చిరుబృందాలుగా ఇస్లామ్‌ను ఆచరిస్తూ వున్నారు. ప్రపంచ వ్యాపితంగా ఇస్లామ్ అనుచరులు విస్తారంగా వుండారు. ఈ అధ్యాయంలో ప్రపంచంపై ఇస్లామ్ వేసిన బలమైన ముద్రలను, వాటి గ్రంథాలను గురించి క్లుప్తంగా తెలుసుకుందాం.

ఇస్లామ్ ఒక వ్యవస్థగా మొట్టమొదటిసారిగా ఈ ప్రపంచంలోకి అరుదెంచిన సమయంలో, ప్రపంచ జనావళి – తెగ, వంశం, జాతి, వర్ణం, ప్రాంతం లేక దేశ విభేదాల సంకెళ్లలో క్రూరంగా బంధించబడి వుండింది. మానవత్వానికి ఈ సంకుచిత పరిధి నుండి బయటపడే ఆలోచన కూడా లేకుండా వుంది. మొట్టమొదటిసారిగా ఇస్లామ్ 'సమస్త మానవాళి ఒక్కటే' అనే విప్లవాత్మక ప్రకటన ప్రకటించింది. అంతేకాదు, సమస్త మానవాళి పునాది లేక మొదలు కూడా ఒకటేనని ఇస్లామ్ స్పష్టం చేసింది. తెగ, జాతి, వంశం, ప్రాంతీయతలు కేవలం మనుషుల మధ్య పరిచయం కోసమేనని బోధించింది. మానవుడు దైవం వైపు నుండి భూమిపైకి పంపబడిన ప్రతినిధి (ఖలీఫా) అనీ, అతను మరలా తిరిగి దైవం వైపునకే మరలి వెళ్లవలసివుందని స్పష్టం చేసింది. ఈ తాత్విక మరియు సైద్ధాంతిక విషయాన్ని దివ్యఖుర్‌ఆన్ ఇలా ప్రకటించింది.

"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగా, తెగలుగా చేశాము. వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞానం కలవాడు. సకల విషయాలూ తెలిసిన వాడు" *(దివ్యఖుర్‌ఆన్ 49:13)*

మరోచోట దైవవాణి అయిన దివ్యఖుర్‌ఆన్ ఇలా బోధించింది.

"మానవులారా! మీ ప్రభువుకు భయపడండి. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణినుండి పుట్టించాడు. అదే ప్రాణినుండి దాని జతను సృష్టించాడు. ఇంకా, ఆ జంట ద్వారా ఎంతో మంది పురుషులను, స్త్రీలను అవనిలో వ్యాపింపచేశాడు. ఏ దేవుని పేరు చెప్పుకొని మీరు పరస్పరం మీమీ హక్కులను కోరుకుంటారో, ఆ దేవునికి భయపడండి. బంధుత్వ సంబం

ధాలను తెంచటం మానుకోండి. అల్లాహ్ మిమ్మల్ని పరికిస్తున్నాడనే విషయాన్ని తెలుసుకోండి." *(దివ్యఖుర్ఆన్ 4:1)*

మరోచోట ఇలా తెలిపింది:

"ఆయన సూచనలలో ఆకాశాలనూ, భూమినీ సృజించటమూ, మీ భాషల, రంగుల వైవిధ్యాలూ వున్నాయి. నిశ్చయంగా విజ్ఞులకు ఇందులో ఎన్నో సూచనలున్నాయి". *(దివ్యఖుర్ఆన్ 30:22)*

పై బోధనలన్నీ కేవలం సైద్ధాంతిక ప్రబోధాల వరకే పరిమితం కాలేదు. ఇస్లాం, పై ప్రబోధనలను ఆచరణాత్మకంగా ప్రపంచం ముందు వుంచింది. ఏ ఏ ప్రాంతాలలో ఇస్లాం ప్రవేశించిందో, ఆ ప్రాంతాలలోని తెగల, జాతుల ప్రజలందరినీ తనలో ఇముడ్చుకుని ముందుకు సాగింది. అందరూ ఇస్లామీయ వ్యవస్థలో కలగలసిపోయారు. రంగు, వంశం, జాతి, తెగల ప్రత్యేకతలను, ప్రాధాన్యతలను ఇస్లాం రద్దు చేసింది. ప్రతి ఒక్కరూ సరిసమానులైన సోదరులయ్యారు. అదే సమయంలో వారి వ్యక్తిత్వాల భద్రతకు జాగ్రత్త వహించింది. ఈ కారణంగా ప్రపంచ పటంపై ఇస్లామీయ తాత్విక, ఆచరణాత్మక ముద్రలు శాశ్వతంగా ముద్రించబడ్డాయి. ప్రజలచే తీవ్రంగా వ్యతిరేకించబడిన గతంలోని మానవీయ విలువలు ఇప్పుడు అందరికీ అత్యంత ప్రియమైనాయి. ఇస్లాం తన ఉచ్ఛస్థాయి నుండి తొలగిన తర్వాత కూడా దాని మానవీయ విలువల ప్రభావం ప్రపంచంపై శాశ్వతంగా ఉండిపోయిందే తప్ప అదృశ్యం కాలేదు. ఇస్లామీయ వ్యవస్థలో కొనసాగినట్లుగా ఈ మానవీయ విలువలు ఉచ్ఛస్థాయిలో కొనసాగకపోయామన్నది ఒక వాస్తవం అయినప్పటకీ ఇస్లాం అందించిన సమత–సమానత్వపు నినాదం నేడు ప్రపంచంలో విస్తరిస్తూ పోయింది వుంది. మరో వైపున మానవత్వం రంగు, జాతి, తెగ, ప్రాంతీయ, జాతీయ, భాషాపరమైన బేధాలలో, విద్వేషాలలో మునిగివుంది.

అమెరికా, దక్షిణాఫ్రికా దేశాలలో నల్లజాతీయులు జాతి వివక్షతకు గురవుతున్నారు. శ్వేత భారతీయుల జాత్యాహంకారానికి అవమానాలకు, బాధలకు, హక్కుల ఉల్లంఘనకు గురవుతూనే ఉన్నారు.

ఇన్ని ప్రతికూల పరిస్థితుల మధ్య కూడా ఇస్లామీయ సమత-మానవతా విలువల నినాదం ప్రపంచ వ్యాపితంగా బలం పుంజుకుంటూనే వుంది. ప్రపంచ మానవాళిని ఉర్రూతలూగిస్తూనే వుంది. ఇస్లాం చిత్రించిన సమత-సమన్యాయ-మానవతా విలువల చిత్రపటం నేటికీ ఉజ్వలంగా దర్శనమిస్తూనే వుంది. ఇస్లాం, తన ఉచ్ఛస్థితికి ముందు మానవ నైజపు సహజ శక్తిని సంపూర్ణంగా విశ్వసించి ఆచరణకు పురికొల్పింది. అదే మానవ నైజపు సహజ శక్తిపై నేడు కూడా విశ్వసిస్తుంది. అదే విశ్వాసంలో రానున్న తరానికి తన గుర్తులను, శాశ్వత ముద్రలను అందించింది. నేటి మానవ సమాజం ఆ గుర్తులను, ముద్రలను, గుభాళింపులను ఆస్వాదించగలుగుతుంది.

ఇస్లాం భూమిపై ఒక వ్యవస్థగా అడుగుపెట్టక ముందు మానవ సమాజం తెగలుగా, విభిన్న వర్గాలుగా చీలివుండింది. గౌరవ మర్యాదలు కేవలం కొన్ని ప్రత్యేకించిన రంగాలకు మాత్రమే దక్కేది. సాధారణ ప్రజలు కనీస గౌరవ మర్యాదలకు నోచుకొనేవారు కారు. మొట్టమొదటిసారిగా గౌరవ మర్యాదలు జన్మరీత్యా కాక, వారి సదాచారాల వల్ల మాత్రమే లభించగలవని ఇస్లాం ప్రకటించింది. జాతి, వర్ణం, తెగ, సంపద పునాదులపై గౌరవం లభించదని స్పష్టపర్చింది. జన్మరీత్యా మానవులందరూ సమానులు కనుక అందరికీ సమాన హక్కులు లభించాలని ప్రకటించిం ఈ విషయంలో దైవ ఆదేశం ఇలా వుంది.

"మేము ఆదం సంతతికి (గౌరవ మర్యాదలను) పెద్దరి కాన్ని ప్రసాదించాము. వారికి నేలపైనా నీటిలోనూ నడిచే వాహనాలను ప్రసాదించాము. వారికి పరిశుద్ధమైన వస్తువులను ఆహారంగా ఇచ్చాము. మేము

సృష్టించిన ఎన్నో ప్రాణులపై వారికి స్పష్టమైన ఆధిక్యాన్ని అనుగ్రహించాము." *(దివ్యఖుర్ఆన్ 17:70)*

మరోచోట

"నేను భువిలో ఒక ప్రతినిధిని (ఖలీఫాను) సృష్టించబోతున్నాను" అని నీ ప్రభువు దైవదూతలతో అన్న సంధర్భాన్ని గుర్తు తెచ్చుకో *(2:30)*

మరోచోట సర్వ మానవుల ఔన్నత్యాన్ని ఇలా వివరించబడింది.

"మేము దూతలకు మీరు అందరూ ఆదంకు తలవంచండి' అని అదేశించినపుడు వారందరూ తలవంచారు. కాని, షైతాన్ ధిక్కరించాడు. దురహంకారానికి గురై అవిధేయులలో కలిసిపోయాడు." *(2:34)*

మరోచోట స్పష్టం చేయబడింది:

"భూమిలోని, ఆకాశాలలోని సకల వస్తువులను తన ఆజ్ఞతో ఆయన మీకు వశపర్చాడు." *(దివ్యఖుర్ఆన్ -45:13)*

మానవుడు జన్మరీత్యా దేవుని సమక్షంలో ఒక ఉన్నతమైన స్థానం కలిగి వుంటాడని ఇస్లామీయ తాత్విక భావజాలం ద్వారానే తెలుసుకున్నాడు. ఈ స్థానమే మానవునికి తన అసలైన స్థాయిని తెలుపుతుంది. మానవుడు మొదటి సారిగా తాను తెగ, వంశం, రంగు, ప్రాంతం పునాదులపై గౌరవోన్న తులు పొందజాలడని తెలుసుకున్నాడు. జన్మరీత్యా మానవునిగా పుట్టిన ప్రతి ఒక్కరి స్థాయి దైవం వద్ద సమానమని ఇస్లాం తెలిపింది. ఈ తాత్విక దృక్పధం కేవలం భావజాలంగా, సిద్ధాంతంగా కాక, దానిని ఆచరణాత్మక జీవిత విధానంగా, వ్యవస్థాగతంగా ప్రపంచంలో స్థాపించి చూపింది. ఇస్లాం అనుయాయులు ప్రపంచం నలుమూలలా ఈ సామాజిక సమతుల్యాన్ని -సమన్యాయవ్యవస్థను పరిచయం చేశారు. తమ జీవితాల ద్వారా శాశ్వత ముద్రలను సమాజంపై

వేశారు. ఈ ప్రభావం మూలంగానే ప్రపంచ మానవాళి తమలో తాము అందరితో సమానులమని - మానవునికి అందవలసిన హక్కులకు తాము కూడా సమాన హక్కుదారులమని గుర్తించారు. ప్రతి ఒక్కరూ తమ తమ ప్రతిభల ద్వారా నాయకత్వ స్థానానికి అర్హత పొందగలమని గుర్తించారు. అణచివేత, అసమ-అవమానకర సంబంధాలను ఇక ఎంతమాత్రం అంగీకరించేది లేదనీ తీర్మానించుకున్నారు. అదే సమయంలో పాలకవర్గం, నాయకవర్గం సైతం తాము ఇతరుల కంటే జన్మరీత్యా గొప్పవారం కాదనీ- ఇతరుల హక్కులను కాలరాచే అధికారం తమకు లేదనీ తెలుసుకున్నారు. ఈ విప్లవాత్మక భావజాలం ఒక నూతన మానవ సమాజానికి ఒక నూతన జీవన వ్యవస్థకు నాంది పలికింది. నూతన మానవుని జన్మకూ కారణమైంది. అప్పటి వరకు చరిత్ర ఎరుగని ఒక అద్భుత సమాజాన్ని, పాలనావ్యవస్థను ఇస్లాం ఈ భువిపై ఆవిష్కరించింది. మానవుడు కేవలం తాను మానవునిగా జన్మించిన కారణంగానే గౌరవోన్నతుడు కావటం, అప్పటివరకు మానవ చరిత్ర ఎరుగదు. మొదటి ఖలీఫా హజ్రత్ అబూబక్ర్ (రజి) తన ఖిలాఫత్ కాలంలో ఈ క్రింది ప్రకటన చేశారు. "ప్రజలారా! నన్ను మీకు బాధ్యునిగా ఎన్నుకోవడం జరిగింది. వాస్తవానికి నేను ఈ బాధ్యతకు అర్హుడిని కాను. నేను నా బాధ్యత కాలంలో ప్రజా సంక్షేమ పరునిగా ప్రవర్తిస్తే నాకు సహకరించండి. ఒకవేళ ప్రజా వ్యతిరేక నిర్ణయాలు తీసుకుంటే నన్ను సరిదిద్దండి. నేను, అల్లాహ్ ఆదేశం, ప్రవక్త (స) సాంప్రదాయాలను అనుసరిస్తూ వున్నంతకాలం మీరు నన్ను అనుసరించాలి. (నాకు విధేయత చూపాలి), ఒకవేళ నేను, అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త (స)కు వ్యతిరేకంగా ఆచరిస్తే నన్ను అనుసరించవలసిన అవసరం లేదు."

రెండో ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) తన ఖిలాఫత్ కాలంలో ఒక ఉపన్యాసంలో ఖలీఫాకు, ప్రజలకూ మధ్యనున్న బాధ్యతలను, హక్కులను ఈ క్రింది విధంగా స్పష్టం చేశారు. "ప్రజలారా! దైవసాక్షి, మీపై గవర్నర్లను

(అధికారులను), మిమ్మల్ని బాధించడానికో – మీ ధన సంపత్తిని గుంజుకోవ డానికో నియమించలేదు. మీకు దైవాదేశాలను, ప్రవక్త సాంప్రదాయాలను నేర్పడానికి తదనుగుణంగా మీ జీవితాలను తీర్చిదిద్దుకునేలా తర్ఫీదు ఇవ్వ డానికి ఈ అధికారులు నియమించబడ్డారు. ఒకవేళ ఈ అధికారులు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే వారు నా ముందు హాజరుకాబడతారు. దైవసాక్షి! నేను వారిపై సమన్యాయ శిక్షను అమలుపరుస్తాను."

ఈ ప్రకటన విన్నంతనే ఒక గవర్నర్ పదవిలో వున్న ఉమర్ బిన్ ఆస్ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు. "ఓ విశ్వాసుల నాయకుడా! ఒకవేళ మీరు నియమించిన నాయకుడు (గవర్నర్) ఇస్లాం నేర్పే క్రమంలో కొంత శారీరకంగా దండిస్తే దానిపై కూడా మీరు సమన్యాయ శిక్ష విధిస్తారా?" అని ప్రశ్నించారు. దానికి ఖలీఫా ఉమర్ (రజి), "ఎవరి చేతిలో నా ప్రాణాలు బందీ అయి వున్నాయో ఆ దైవం సాక్షి! నేను తప్పకుండా ఆ అధికారికి సమన్యాయ శిక్ష విధిస్తాను. నేను ప్రవక్త (స) అలా చేస్తూ వుండగా నా కళ్లారా చూశాను. జాగ్రత్త! ధర్మం నేర్పే క్రమంలో ప్రజలను అవమానపర్చేలా శిక్షించకండి! వారిని తమ బంధుమిత్రుల నుండి దూరం చేయకండి. వారికి వారి హక్కులు దక్కనీయకుండా అడ్డుపడకండి! ఇటువంటి చరిత్ర వల్ల సమాజంలో అలజడి రేపకండి. తద్వారా విశ్వసించిన ప్రజలు విశ్వాస వ్యతిరేకులుగా మారిపోయే ప్రమాదం ఉంది" అని స్పష్టం చేశారు.

మూడవ ఖలీఫా ఉస్మాన్ (రజి) ఇస్లామీయ ఖిలాఫత్ పాలనలోని విభిన్న ప్రాంతాల బాధ్యులకు ఒక సర్క్యులర్ పంపారు. అందులో వారిని ఈ క్రింది విధంగా తాకీదు చేశారు. "నా చేత నియమింపబడిన గవర్నర్లు ఏ సమయంలోనైనా నన్ను కలిసే అవకాశం కల్పించాను. అలా కలిసిన ప్రతిసారీ, వారికి ప్రజల పట్ల బాధ్యతతో వ్యవహరించమని ప్రజలకు మంచిని స్థాపించేలా ఆదేశించమనీ చెడు నుండి తమ్ముతాము నిరోధించుకోమనీ వారికి హితవు

చెబుతూ వుంటాను. ఈ పని కోసమే మిమ్మల్ని నియమించానని గుర్తు చేస్తూ వుంటాను. నాపట్ల, నా గవర్నర్ల పట్ల ఏమైనా విమర్శలు వస్తే వాటిని మనసారా స్వీకరిస్తాను. ప్రజలకంటే, నేను, నా గవర్నర్లు ముఖ్యులుకారు, మదీనావాసులలో కొందరు, నా నియమిత గవర్నరు వారి పట్ల కఠినంగా వ్యవహరిస్తున్నాడనీ, మనసును గాయపర్చేలా కఠిన పదాలు వాడుతున్నాడనీ ఫిర్యాదు చేసి వున్నారు. ఒకవేళ ఎవరైనా ఇటువంటి చర్యలకు పాల్పడివుంటే వారు ( నా గవర్నర్లు) దాని ప్రతిఫలం పొందడానికి ఎదురు చూడవలసి ఉంటుంది. వారికి వారి బదులు (సమన్యాయశిక్ష) తప్పక లభించి తీరుతుంది. ఆ రోజు రాక ముందే వారు పశ్చాత్తాపపడి దానికి పరిహారంగా దానధర్మాలు ఆచరించాలి. అల్లాహ్ దానధర్మాలు చేసే వారి తప్పులను క్షమిస్తాడు."

పైన వివరించినట్లుగా ఇస్లాం కేవలం తన సైద్ధాంతిక భావజాలాన్ని ప్రచారం చేసి ఊరుకోదు. తన సిద్ధాంత భావజాల పునాదులపై ఆచరణాత్మక సమాజాన్ని స్థాపించుతుంది. తన ప్రభావంలోని ప్రజలకు ఇస్లామీయ విధానాల పునాదులపై జీవించేలా తర్ఫీదునిస్తుంది. స్వేచ్ఛ, మానవ హక్కుల పరిరక్షణకు సంబంధించిన అనేక మహోన్నత ఆచరణలు ఇస్లామీయ చరిత్రలో అడుగడుగునా దర్శనమిస్తాయి. ఉదాహరణకు, ఈజిప్టులో జరిగిన 'ఇబ్నె ఖబ్తీ' ఉదంతం, ఆ కాలపు ప్రపంచాన్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. ఈజిప్టు గవర్నర్ అయిన 'ఉమర్ ఇబ్నెఆస్' కుమారునితో ఒక పందెం విషయంగా ఇబ్నె ఖబ్తీ గొడవపడ్డారు. దీనిపై గవర్నర్ ఇబ్నెఆస్ పుత్రప్రేమకులోనై ఖబ్తీని దండిచడం జరిగింది. దానిపై ఖబ్తీ ఖలీఫా ఉమర్ (రజి)ను కలిసి ఫిర్యాదు చేశారు. ఖలీఫా ఉమర్ (రజి) తన గూఢాచారుల ద్వారా వాస్తవాలను తెలుసుకున్నారు. ఆ సంవత్సరం జరిగిన హజ్ యాత్రలో ఖలీఫా ఉమర్ (రజి), ఈ జిప్టు గవర్నర్ ఇబ్నె ఆస్‌పై ప్రతీకారం తీర్చుకునేలా సమన్యాయ శిక్షను బహిరంగంగా అమలుపర్చారు. ఈ సంఘటన నాటి ఈజిప్టు దేశాన్నేకాక, దాని చుట్టుపక్కల

ప్రాంతాలపై విశేష ప్రభావాన్ని చూపింది. మానవ హక్కుల పరిరక్షణ కోసం ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల భద్రత కోసం, ఇస్లాం నిరంతరం కంకణబద్ధమై ఉంటుందని ప్రజలు గుర్తించారు.

ఈ సంఘటన జరగడానికి కొన్ని నెలల ముందు మాత్రమే, ఈజిప్టు ఇస్లాం ఛత్రపునీడలోకి వచ్చింది. అంతకు ముందు ఈజిప్టు దేశంపై రోమన్‌ల ఆక్రమణ ఉండింది. రోమన్ సైనికులు, అధికారులు తమ చేత కొరడాలు ధరించి ప్రజలచే పనులు చేయించేవారు. ప్రజలందరినీ బానిసలుగా భావించే వారు. కొరడా దెబ్బల వాతలు– గాయాలు లేని ఈజిప్టు వీపులు దాదాపు లేవనే చెప్పాలి. 'ఇబ్నె ఖబ్‌తీ' ఈజిప్టుకు చెందిన ఒక సాధారణ వ్యక్తి. గతమంతా రోమన్‌ల దాస్యంలోనే గడిచింది. ఆయన వీపుపై కూడా కొరడా దెబ్బల గాయాల గుర్తులు శాశ్వతంగా వుండినాయి. ఈజిప్టుపై ఇస్లాం విజయం సాధిం చిన తర్వాత ప్రజలందరితోపాటు 'ఇబ్నె ఖబ్‌తీ' కూడా స్వేచ్ఛాగాలులు పీల్చారు. ఈ నేపథ్యంలో ఒక సాధారణ పౌరుడు అయిన ఖబ్‌తీ ఈజిప్టుకు అత్యున్నత అధికారి (గవర్నర్) అయిన 'ఇబ్నెఆస్'కు వ్యతిరేకంగా ఖలీఫాకు ఫిర్యాదు చేస్తారు. ఇస్లామ్, ఈజిప్టు ప్రజలను రోమన్ సామ్రాజ్యవాద కొరడా దెబ్బల నుండి, క్రూరపాలన నుండి విముక్తి కలిగించడమే కాదు. వారికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, మానవ హక్కుల పాఠ్యాలు కూడా బోధించింది. ఫలితంగా నిన్నటి మామూలు సేవకుడైన 'ఇబ్నెఖబ్‌తీ' తనకు ఇస్లాం ప్రసాదించిన హక్కు లను పరిరక్షించుకునేందుకు తీవ్రమైన పోరాటం చేశారు. ఆయనకు పోరాడే తత్వాన్ని సైతం ఇస్లాం ప్రసాదించింది. ఒక పరుగు పందెంలో ఓడినవాడు గవర్నర్ కుమారుడు. గెలిచింది ఒక సాధారణ వ్యక్తి అయిన ఇబ్నెఖబ్‌తీ. ఈ అవమానం భరించలేని ఆ గవర్నర్ కుమారుడు, తండ్రిని రెచ్చగొడతాడు. పుత్రవాత్సల్యానికి గురైన గవర్నర్ 'ఖబతీ'ను శిక్షిస్తాడు. ఈ మానవ హక్కుల ఉల్లంఘనను ఆమోదించని 'ఖబ్‌తీ' సుదూర ప్రయాణం ఈజిప్టు నుండి మదీనా

నగరానికి ప్రయాణిస్తాడు. మోటారు వాహనాలు, వాయుదూత్‌లు లేని ఆ కాలంలో నిర్జన ఎడారిలో కేవలం బండి ప్రయాణమే శరణ్యం. ఒంటెపై ఒంటరిగా కేవలం తన హక్కుల పరిరక్షణ కోసం ఇంతటి కఠినమైన సుదూర ప్రయాణం చేసే పోరాటతత్వం, చైతన్యం 'ఖబ్‌తీ'కి ఎలా అలవడింది? విశ్వాసుల నాయకుడు దైవప్రతినిధి (ఖలీఫా ఉమర్ (రజి))కు ఫిర్యాదు చేసే సాహసం ఎలా అలవడింది? నిన్నటి వరకు ఒక బానిసగా బ్రతికిన వ్యక్తి కేవలం కొన్ని నెలల కాలంలోనే ఇస్లామీయ శిక్షణ ద్వారా స్వేచ్ఛకై పోరాడే ధీరునిగా మార్పు చెందాడు. ఈజిప్టును రోమన్ సామ్రాజ్యవాదం నుండి విముక్తి కల్పించిన వెంటనే ఖలీఫా ఉమర్ (రజి) ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ప్రకటన గావించారు. అలా స్వాతంత్ర్యం, స్వేచ్ఛ పొందిన వారిలోని ఒకానొక వ్యక్తే ఈ 'ఇబ్నెఖబ్‌తీ'. మొదటి క్షణంలోనే ఇస్లాం సమత-సమన్యాయ వ్యవస్థను రుచి చూసిన ఖబ్‌తీ- దాని తాత్విక దృక్పథాన్ని, స్వేచ్ఛ మానవ హక్కులకు ఇస్లాం యిచ్చే ఈ ప్రాముఖ్యాన్ని, దాని నాయకుడైన ఖలీఫా ఉమర్ (రజి) నుండి గ్రహించారు. ఈ కారణంగానే తన హక్కులకు భంగం కలిగినప్పుడు తీవ్రంగా స్పందించారు. హక్కుల పరిరక్షణకోసం కష్టతరమైన సుదూర ప్రయాణానికి సిద్ధపడ్డారు. తన ఫిర్యాదు ద్వారా తన హక్కులను పరిరక్షించుకున్నారు. రోమన్ సామ్రాజ్యవాదానికీ ఇస్లామీయ సమత, సమన్యాయ, సామాజిక వ్యవస్థల మధ్యనున్న పూడ్చసాధ్యంకాని వ్యత్యాసాన్ని 'ఇబ్నె ఖబ్‌తీ' అర్థం చేసుకున్నారు. ఈ సంఘటన నాటి ఈజిప్టునే ఏకమొత్తం ఆఫ్రికా ఖండాన్నే తీవ్రంగా ప్రభావితం చేసిందనడంలో సందేహమే లేదు.

ఇస్లామీయ వ్యవస్థ ఉన్న ఈ తాత్విక భావజాలాన్ని లోతుగా అర్థం చేసుకోవడమే కాదు, మరింత లోతుగా అధ్యయనం చేయవలసి వుంది. పైన ఉదహరించిన 'ఖబ్‌తీ' సంఘటన ఖలీఫా ఉమర్ (రజి) న్యాయశీలతకు నిదర్శనం కాదు. ఒకానొక చారిత్రక కాలంలో, న్యాయపాలనలో ఆయనకు

ఎదురులేకపోవచ్చు. కాని ఖలీఫా ఉమర్ (రజి)కు ఈ సమన్యాయ శీలతను అందించింది ఇస్లామీయ తాత్విక చింతనే అనేది గమనించాలి. ఇస్లామీయ జ్ఞాన సరోవరం నుండియే ఖలీఫా ఉమర్ (రజి) ఈ న్యాయశీలతను గ్రహించారనేది కూడా మరువకూడని సత్యం. ఈ ఇస్లామీయ జ్ఞాన సరోవరమే దాని ఊటలో ప్రపంచం మొత్తాన్ని ముంచెత్తాయనేది కూడా మరువరాని కఠోర వాస్తవం. మనిషికి అతను మనిషి అయినంత మాత్రాన్నే, అతనికి అందవలసిన గౌరవ మర్యాదలను హక్కులను అతనికి ఇస్లాం అందించింది. మానవత మొదటి ఇస్లామీయ బృందపు ఉన్నత స్థాయికి ఆ తరువాత సమాజంలో చేరువ కాలేకపోయింది. కాని, ఇస్లాం మనిషి గౌరవం ఉన్నతి, స్వేచ్ఛ, బాధ్యతలు, హక్కులు తాలూకు ఏ శాశ్వత ముద్రలు, గుర్తులను వేసిందో అవే నేటి ఆధునిక సమాజంలో మానవ హక్కులుగా ప్రకటించబడుతున్నాయి. ఇస్లాం స్థాపించిన ఈ శాశ్వత ముద్రలు మానవ సమాజ ప్రయాణపు ప్రతి దశలోనూ మార్గదర్శక సూచికలుగా మార్గదర్శకత్వం అందించాయి. మానవ హక్కులు, దాని అసలు రూపంలో నేటికీ మన సమాజానికి దక్కకపోవడం ఒక నిజం. అయినప్పటికీ ప్రపంచపు వివిధ ప్రాంతాల్లోని మానవులు, ఇంకా అవమానం, నిర్లక్ష్యానికి, కనీస మర్యాదలకు కూడా నోచుకోలేకపోతున్నప్పటికీ ప్రపంచంలో ఉనికిలో ఉన్న కొన్ని వ్యవస్థలు సైద్ధాంతికంగానే మానవులను గౌరవోన్నతులకు దూరం చేస్తున్నప్పటికీ – ఎదుర్కొనే ధైర్యం, చైతన్యం, ప్రజలకు అందిస్తూ వున్నది ఇస్లామీయ తాత్వికతయే అనేది మరో తిరుగులేని వాస్తవం. దేశాల ఆక్రమణకు, సహజ వనరులను దోచుకోవడానికి, మార్కెట్లను ఆక్రమించడానికి, ఉత్పత్తిని పెంచడానికీ –సామ్రాజ్యవాదులచే మానవ సమాజపు స్వేచ్ఛం, స్వాతంత్ర్యాలు హరించివేయడం జరుగుతుంది. ఈ మట్టికాళ్ల రాక్షసిని ఎదిరించే శక్తులు, తమ చైతన్యాన్ని ఇస్లామీయ తాత్వికత నుండే గ్రహించాయి.

ఇస్లాం ప్రపంచ పటంపై మొట్టమొదటిసారిగా, సంపూర్ణ వ్యవస్థగా స్థాపించబడినపుడు తన చుట్టూవున్న మానవ సమాజం రంగు, జాతి, తెగ, దేశం, ప్రాంతం లాంటి విలువలేని హీనస్థాయిగల విషయాలలో మునిగి వుండింది. అజ్ఞానపు చీకటి కబంధ హస్తాలలో బంధించబడి వుండింది. ఈ స్థాయి, హోదా, మానవుడులాంటి ఉన్నత సృష్టికి తగినది కాదని ఇస్లాం తెలిపింది. పైన పేర్కొన్న విషయాలు అన్నీ మానవ ఔన్నత్యాన్ని మరుగుపర్చే దృక్పథాలని ఇస్లాం స్పష్టం చేసింది. పై దృక్పథాలన్నీ మానవుల మధ్య విద్వేషాలు ఏర్పడటానికి ఉపకరిస్తాయే తప్ప ఐక్యతకు దోహదకాలు కావని రుజువులతో సహా ప్రపంచానికి తెలిపింది. నిజానికి మానవ ఔన్నత్యం రంగు, జాతి, తెగ, దేశ, ప్రాంతీయ తత్వాలపై కాక, సృష్టికర్తతో మానవునికి వున్న సంబంధంపై ఆధారపడివుందని తెలిపింది. ఎందుకంటే, ఈ సంబంధమే నిజానికి మనిషికి, మనిషి యొక్క ఔన్నత్యం ప్రసాదించగలుగుతుంది. సృష్టి దాస్యం నుండి విముక్తుడైన వాడే నిజమైన దైవదాసునిగా మారగలడు. ఉన్నత విలువల మానవతా ఔన్నత్యపు శిఖరాలను అధిరోహించగలడు. సృష్టితాలలో ఉత్తమోత్తమమైన సృష్టితం మానవుడు. ఈ మానవుడు తన సృష్టికర్త అయిన విశ్వ సామ్రాట్టును గుర్తించడం పైనే, అతని మరణానంతర జీవితపు ఫలితం ఆధారపడి వుంటుంది. సృష్టికర్త అయిన అల్లాహ్ మాత్రమే మానవుని సృజనకు కారకుడు. ఆయనే మానవునికి ఈ సృష్టిలో గౌరవ మర్యాదలను ఉన్నత స్థానాన్ని ప్రసాదించాడు. భూమ్యాకాశాల మధ్య ఉన్న సమస్తాన్ని ఆయన మానవుని కోసమే సృష్టించాడు. ఈ భావజాలపు పునాదులపై మాత్రమే మానవుల మధ్య తేడా – వ్యత్యాసాలను గుర్తించాలే తప్ప హీనస్థాయికి చెందిన రంగు, వంశం, తెగ, జాతి, ప్రాంతీయ, దేశ పునాదులపై కాదు. మానవ సమాజం ఐక్యత సాధించడానికి ఒక ఉన్నతస్థాయిగల తాత్విక విశ్వాసం పునాదిగా వుండాలి. అందుకు విశ్వసృష్టికర్తతో సంబంధం కలిగిన స్థాయి తప్ప, మరే స్థాయి అయినా మానవుని హోదాకు తగింది కాదు. మానవత్వపు

అత్యంత ఉన్నతమైన స్థాయిలలోనే ఈ ఐక్యత సాధించబడుతుంది. అలా కాకపోతే, అది భౌతిక కాంక్షల జంతు సమ్మేళనంగా మారిపోతుంది. అంతిమ విశ్లేషణలో ప్రపంచంలో రెండే రెండు గ్రూపులు ఉన్నాయి. ఒకటి మహోన్నత మైన మానవతా విలువలు కలిగిన సృష్టికర్త గ్రూపు. మరొకటి, విధ్వంసకర, అశాంతిమయ షైతాన్ గ్రూపు. సృష్టికర్త గ్రూపు, సృష్టికర్త జెండా క్రింద సమీకృతమవుతుంది. సృష్టికర్త ఆదేశానుసారం ఈ సృష్టిని, అందులోని ప్రధా నంగా ఈ భూమండలాన్ని తీర్చిదిద్దే కృషి చేస్తుంది. షైతాన్ గ్రూపు సృష్టికర్త జెండాకు బయట నిలబడి వున్న రంగు, జాతి, తెగ, కులం, మతం, దేశం, వ్యక్తి అహంకారాలను తన జెండా క్రింద సమీకరించుకొని విలయం సృష్టించ డానికి ప్రయత్నిస్తుంది.

ఒకే రకమైన ఆశలు, ఆశయాలు, లక్ష్యాలు, విశ్వాసాలు కలిగివుండి, పోతపోసిన సీసపు గోడలాంటి నిర్మాణ వ్యవస్థ గల మానవ సమూహాన్నే ఇస్లామీయ పరిభాషలో మిల్లత్ (ఉమ్మడి సంఘం, సంస్థ) అని పిలుస్తారు. ఈ ఏకీకృత లక్ష్యంగల, దృఢమైన నిర్మాణపు బంధం లేకుండా మానవ సమూహం 'ఉమ్మత్'గా రూపుదిద్దుకోజాలదు. మానవ సమాజాన్ని ఐక్యపర్చడానికి ఉన్నత స్థాయిగల తాత్విక విశ్వాసాలు పునాదిగా వుండాలే తప్ప హీనస్థాయి ప్రయోజనాలు కాకూడదు. ఉన్నత స్థాయిగల మానవ మేధస్సు సంతృప్తి చెందే స్థాయి ఉన్నతంగానే వుండాలి. మానవుని ఉనికి, అతని జీవన విధానం –'దైవ సంబంధం'లాంటి ఉన్నత స్థాయిలో అనుసంధానించబడింది. ఈ అనుసంధా నమే మనిషిని జంతు ప్రపంచం నుండి వేరుపర్చింది. సృష్టికర్త అయిన అల్లాహ్ ప్రపంచ వ్యాపితంగా ఉన్న విశ్వాసులను వారి రంగు, తెగ, జాతి, ప్రాంతీయ, దేశీయ భిన్నత్వాలకు అతీతంగా ఇలా సంబోధించాడు

"మీ సంఘం వాస్తవానికి ఒకే సంఘం. నేను మీ ప్రభువును. కనుక మీరు నన్నే ఆరాధించండి." *(దివ్యఖుర్ఆన్ 21:92)*

మరోచోట మానవుల మధ్య వ్యత్యాసం చూడవలసిన అంశాన్ని ఇలా వివరించబడడం జరిగింది.

"అల్లాహ్‌నూ, పరలోకాన్నీ విశ్వసించే వారు అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ వ్యతిరేకించే వారిని ప్రేమించటాన్ని నీవు ఎన్నడూ చూడ లేవు. వ్యతిరేకించేవారు వారి తల్లిదండ్రులైనా, వారి కుమారులైనా, వారి సోదరులైనా సరే లేదా వారి కుటుంబీకులైనా సరే. వారి హృదయాలలో విశ్వాసాన్ని స్థిరంగా నాటాడు. తన తరఫు నుండి ఒక ఆత్మను ప్రసాదించి వారికి బలాన్ని ఇచ్చాడు. ఆయన వారిని కాలువలు ప్రవహించే స్వర్గ వనాలలో ప్రవేశింపచేస్తాడు. ఆ వనాలలో వారు శాశ్వతంగా వుంటారు. అల్లాహ్ వారిపట్ల ప్రసన్నుడయ్యాడు. వారు అల్లాహ్ పట్ల సంతుష్ఠి చెందారు. వారు అల్లాహ్ పక్షానికి (సంఘానికి-లేక పార్టీకి) చెందినవారు జాగ్రత్త! అల్లాహ్ సంఘుస్తులే (పక్షం వారే) సఫలీకృతులయ్యేవారు." *(దివ్యఖుర్ఆన్ : 58:22)*

ప్రపంచంలో, దుష్టత్వంతో, దౌర్జన్యంతో (షైతాన్ పక్షంతో) పోరాడే పరిస్థితులు ఏర్పడినప్పుడు విశ్వాసుల మరియు ప్రపంచ ప్రజల ప్రయోజనాలు సర్వనాశనం అవుతున్నప్పుడు జాత్యాహంకారుల స్వార్థానికి, ప్రపంచ శాంతి బలిపెట్టబడుతున్నప్పుడు - ఈ పరిస్థితులను నిరాకరించడానికి పోరాటంలో బలప్రయోగం తప్పనిసరి అయినప్పుడు -విశ్వాసుల పక్షానికి అల్లాహ్ వైపు నుండి ఈ ఆదేశం అందుతుంది.

"విశ్వాస మార్గాన్ని ఎంచుకున్న వారు అల్లాహ్ మార్గంలో పోరాడు తారు. అవిశ్వాస మార్గాన్ని ఎన్నుకున్నవారు 'తాగూత్' (ఆధిపత్య- జాత్యాహంకార - సామ్రాజ్యవాద శక్తులు) మార్గంలో పోరాడుతారు. కనుక (మీరు) షైతాన్ సహచరులతో పోరాడండి. వాస్తవంగా షైతాన్ జిత్తులు ఎంతో బలహీనమైనవని నమ్మండి." *(దివ్యఖుర్ఆన్ 4:76)*

ఇస్లాం ఒక వ్యవస్థగా స్థాపించబడటానికి పూర్వం ప్రపంచ ప్రజలకు 'సైద్ధాంతిక పునాదులపై ఐక్యత సాధించడం' అనేది పరిచయం లేని నూతన విషయం. అప్పటివరకు ఐక్యత కేవలం జాతి, తెగ, వంశం, భాష, వర్ణం లేక ప్రాంతీయతల వంటి సంకుచిత పునాదులపై సాధ్యమయ్యేది. ఆనాడు ఇస్లామీయ సైద్ధాంతిక ఐక్యత ఒక అద్భుతంగా, విపరీతంగానూ భావించారు. కాని, నేడు ఈ 'సైద్ధాంతిక పునాదులపై ఏకీకరణ' సర్వసాధారణమైన, న్యాయమైన పద్ధతిగా ప్రపంచ వ్యాపితంగా ఆమోదించబడింది. ఆచరించబడుతుంది. ఈ 'సైద్ధాంతిక ఐక్యత', దైవ ఏకత్వ పునాదులపై జరగడం లేదనేది నిజమైనప్పటికీ – తాత్విక సిద్ధాంతపు పునాదులపై జరిగే మానవ ఏకీకరణ మాత్రమే శాస్త్రీయమైనదని నేడు ప్రపంచం అంగీకరించింది. ఈ సమతావాద, సమన్యాయ ప్రతిపాదన ఇస్లామీయ జ్ఞాన సరోవరం నుండే పరవళ్లు తొక్కుతూ ప్రవహించింది. ప్రపంచం మొత్తాన్ని ప్రభావితం చేసింది.

ఇస్లాం, తాత్విక పునాదులపై మానవ సమాజాన్ని ఐక్యపర్చింది. ఈ కారణంగా మనుషుల మధ్య హెచ్చుతగ్గులను కూడా తాత్విక పునాదులపైనే పాటించింది. అయితే తన భావజాలాన్నే ప్రజలందరూ ఆమోదించి తీరాలని ఇస్లాం ఎన్నడూ, ఎవరినీ బలవంతపెట్టలేదు. అంతేకాదు, ఇస్లామీయ తాత్విక భావజాలాన్ని వ్యతిరేకించిన వారిని ఎన్నడూ దండించలేదు. సరికదా, వారి పట్ల కనీస వివక్షతాపూర్వక వ్యవహారాన్ని కూడా ఎన్నడూ పాటించలేదు. ఇస్లాం, ముస్లిం సమాజాన్ని (ఉమ్మత్, సంఘం) దైవమార్గంలో నిరంతరంగా కృషిచేయమని (జిహాద్ చేయమని) ఉత్సాహపర్చింది. అయితే ఈ జిహాద్ (నిరంతర కృషి) సమత– సమన్యాయ వ్యవస్థాపన కోసం చేయమని ఆదేశిచిందే తప్ప బలవంతంగా ఇస్లామీయ భావజాలాన్ని ప్రజలచే అంగీకరింపజేసేందుకు కాదు. ఇస్లామీయ సమత – సమన్యాయ–సంక్షేమకర ఖిలాఫత్ వ్యవస్థ ద్వారా, ప్రజలు– సుఖసంతోషాలను, గౌరవమర్యాదలను, మానవ

హక్కులను సమృద్ధిగా ఆస్వాదించి, ఈ జీవన వ్యవస్థతో సంతృప్తి చెంది, మనసారా అంగీకరిస్తే వారికి ఇస్లాం ఆహ్వానం పలికింది. ఇస్లాంను అంగీక రించని వారి పట్ల ఎలాంటి బేధభావం చూపక, ముస్లిం-ముస్లిమేతర ప్రజల మధ్య సమాన న్యాయాన్ని పాటించిందే తప్ప వివక్షతను ఎన్నడూ చూపలేదు. ఈ విషయంగా దైవాదేశం ఈ క్రింది విధంగా వుంది.

"ధర్మం విషయంలో నిర్బంధంగాని, బలాత్కారం గానీ లేవు. సత్యవాక్కు అసత్యవాక్కుల నుండి ప్రస్ఫుటం చేయబడింది. ఇక నుండి 'తాగూత్' (అసమ సంబంధాల వ్యవస్థ)ను తిరస్కరించి, అల్లాహ్‌ను విశ్వసించి నవాడు సుస్థిరమైన, ఎన్నటికీ విడిపోని ఆశ్రయం పొందినట్లే, (ఈ ఆశ్రయం పొందినవానిని) అల్లాహ్ సర్వం వింటాడు. సమస్తమూ తెలిసినవాడు." *(దివ్యఖుర్ఆన్ -2:256)*

ఏ భూభాగంపై అయితే సమత- సమన్యాయ-సంక్షేమకర ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థ స్థాపించబడుతుందో, ఆ భూభాగాన్ని ఇస్లాం "శాంతి స్థలం లేక శాంతి మండలం" (దారుస్సలామ్)గా పిలిచింది. ఈ భూభాగంలో నివ సించే ప్రజలు ఏ విశ్వాసానికి చెందినవారైనా, వారు ముస్లింలైనా లేక ముస్లిమేతరులైనా వారికి శాంతిమయ జీవితం అందించడం ఇస్లాం తన హక్కుగా స్వీకరించింది. అదే సమయంలో ఏ భూభాగంలోనైతే ఈ ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థ లేదో - ఆ భూభాగాన్ని 'దైవేతర మండలం' (దారుల్ హరబ్)గా నామకరణం చేసింది. ఆ ప్రాంతంలో ముస్లిములున్నా - లేకున్నా ఈ నామకరణంలో తేడా వుండదు. 'దారుస్సలామ్' మరియు 'దారుల్ హరబ్'ల మధ్య సంబంధ బాంధవ్యాల విషయంలో ఇస్లాం అత్యంత పారదర్శకమైన, ఉత్తమ నైతిక నడవడికల నిబంధనావళిని విశ్వాసుల బృందానికి (దారుస్స లామ్ నిర్వాహకులకు) అందించబడింది. బలహీనుడిపై బలవంతుడి దౌర్జన్యం లాంటి అడవి చట్టాలను, జంతు న్యాయాన్ని ఇస్లాం వ్యతిరేకించింది. ప్రత్యర్థి

వర్గ వ్యవస్థతో చేసుకున్న సంధి- లేక ఒప్పందాలపై సంపూర్ణమైన నిబద్ధతను కనబర్చింది. ఈ విషయంగా దైవాదేశాలు ఇలా వివరించాయి. "నిశ్చయంగా భూమిపై సంచరించే ప్రాణులన్నింటిలో కెల్లా, అల్లాహ్ దృష్టిలో మిక్కిలి నీచమైన వారు (ఎవరంటే) సత్యాన్ని అంగీకరించటానికి తిరస్కరించి, ఇక ఎట్టి పరిస్థితి లోనూ దానిని విశ్వసించటానికి సిద్ధంగా లేనివారు. (ముఖ్యంగా) వారితో నీవు ఒప్పందం కుదుర్చుకున్నవారు. అవకాశం దొరికినప్పుడల్లా వారు ఆ బృందాన్ని ఉల్లంఘిస్తారు. (ఉల్లంఘించారు) అల్లాహ్‌కు ఏమాత్రం భయపడరు. కావున ఒకవేళ మీకు వారు రణరంగంలో ఎదురైతే- వారికి ఎలా బుద్ధిచెప్పాలంటే -వారి తర్వాత అదే వైఖరిని అవలంబించనున్న వ్యతిరేకులు భయభ్రాంతులై పారిపోవాలి. ఒప్పందాన్ని ఉల్లంఘించేవారి ఈ పర్యవసానాన్ని చూచి వారు గుణపాఠం నేర్చుకుంటారని అశించవచ్చు. ఒకవేళ మీకు ఎప్పుడైనా, ఏ జాతి వల్లనైనా నమ్మకద్రోహం కలుగుతుందనే భయం వుంటే, బాహాటంగా వారి ఒప్పందాన్ని వారిముందు విసిరేయండి. నిశ్చయంగా అల్లాహ్ నమ్మక ద్రోహు లను క్షమించడు. సత్యతిరస్కారులు తాము గెలిచామనే అపోహకు గురికారాదు. నిశ్చయంగా వారు మమ్మల్ని (అల్లాహ్‌ను) ఓడించలేరు. మీరు మీ శక్తి మేరకు అత్యధిక బలాన్ని, కట్టివేసి సిద్ధంగా వున్న గుర్రాలను, వారిని ఎదుర్కోవటానికి సమాయత్తపర్చుకోండి. తద్వారా అల్లాహ్ శత్రువులనూ, మీ శత్రువులనూ ఇంకా మీరు ఎరుగని, కాని అల్లాహ్ ఎరిగిన ఇతర శత్రువులనూ భయకంపితు లుగా చేయండి. అల్లాహ్ మార్గంలో మీరు ఏది ఖర్చు చేసినా, దాని పూర్తి ప్రతిఫలం మీ వైపునకు మళ్లించబడుతుంది. మీకు ఎంతమాత్రం అన్యాయం జరగదు. ప్రవక్తా! శత్రువు గనక సంధీశాంతుల వైపునకు మొగ్గుచూపితే, నీవు కూడా దానికి సిద్ధపడు. అల్లాహ్‌పై భారం వేయి. ఆయనే అంతా వినేవాడు. అన్నీ తెలిసిన వాడూను. (దివ్యఖుర్ఆన్-8 :55-61)

సృష్టికర్త అయిన అల్లాహ్ బలవంతులు అమలుపర్చే రాజకీయ

జిత్తులను రద్దుపర్చాడు. శాంతి కోసం చేసుకునే స్నేహపూర్వక నిజాయితీతో కూడిన సంధి ఒడంబడికలను - సౌహార్ద ఒప్పందాలను, యిచ్చిపుచ్చుకునే సహకారపూర్వక వ్యాపార ఒప్పందాలను తుదికంటా కొనసాగించవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఒప్పంద ఉల్లంఘునకు పాల్పడరాదని హెచ్చరించాడు. దివ్యఖుర్‌ఆన్ ఈ విషయంలో ఇలా హితోపదేశం చేసింది.

> "మీరు అల్లాహ్‌తో ఏదైనా ఒప్పందం చేసివుంటే (వాగ్దానం) దానిని నెరవేర్చండి. అల్లాహ్ సాక్షిగా చేసిన ప్రమాణాలను దృఢపరచిన తరువాత భంగపరచకండి. అల్లాహ్ మీ పనులన్నింటినీ ఎరుగును. స్వయంగా తాను శ్రమతో నూలు వడికి, తరువాత తానే దానిని ముక్కలు ముక్కలుగా చేసిన స్త్రీ స్థితి వంటిది మీ స్థితీ కాకూడదు. మీరు మీ ప్రమాణాలను మీ వ్యవహారాలను మోసగించు కోవటానికి పని ముట్లుగా చేసుకుంటారు. ఒక జాతి, రెండో జాతి కంటె ఎక్కువగా లాభాలు పొందటానికి. వాస్తవానికి అల్లాహ్ ఈ ప్రమాణాల ద్వారా మిమ్మల్ని పరీక్షకు గురిచేస్తున్నాడు. తప్పకుండా ఆయన ప్రళయం నాడు మీ సమస్త అభిప్రాయ భేదాల తత్వాన్ని మీకు విశదం చేస్తాడు." *(దివ్యఖుర్‌ఆన్ 16:91-92)*

ఒకవేళ దురదృష్టవశాత్తు యుద్ధమే తప్పనిసరి అయితే అల్లాహ్ యుద్ధరంగానికి సైతం మానవత్వాన్ని నేర్పమని విశ్వాసులకు ఆదేశించాడు. ఏ ఒక్క శత్రు సైనికుడిని కూడా అవమానించరాదు. అతనిని నీచునిగా భావించరాదు. ఏ ఒక్క పసిబిడ్డ, ముదుసలి, స్త్రీ, యుద్ధం వల్ల ప్రాణహానికి గురి కారాదు. చేతిలో ఆయుధం ధరించని ఏ వ్యక్తిపైనా దాడి జరపరాదు. కేవలం చేతిలో ఆయుధం ధరించి యుద్ధరంగంలో ప్రత్యర్థి స్థానంలో దృఢంగా నిలబడి పోరాడే వారిపైనే దాడిని కేంద్రీకరించాలని అల్లాహ్ ఆజ్ఞాపించాడు. మొదటి ఖలీఫా హజ్రత్ అబూబక్ర్ (రజి), హజ్రత్ ఉసామా (రజి) నాయకత్వంలో ఒక

సైనిక బృందాన్ని పంపిస్తూ ఈ క్రింది విధంగా హితవు పలికారు. "ద్రోహ బుద్ధి లేనివాడవై, యుద్ధ సొత్తు విషయంలో అవకతవకలకు పాల్పడనివాడివిగా వుండి, ఎవరినీ అనవసరంగా బాధించకు. పసిపిల్లలను, ముదుసలులను, స్త్రీలను వధించరాదు. పచ్చని పంట పొలాలను ధ్వంసం చేయరాదు. పంట లను తగులబెట్టరాదు. పండ్లనిచ్చే చెట్లను నరకరాదు. మీ ఆహార అవసరానికి తప్ప ప్రత్యర్థుల జంతువులకు నష్టం కలుగచేయరాదు. నీ సైనిక ప్రయాణంలో తమ గృహాలలో మానమర్యాదలతో జీవిస్తూ వుండే మానవతులు తారసపడ తారు. వారిని వారి స్థితిపై వదిలిపెట్టు. ఇక (బిస్మిల్లాహ్) దేవుని పేరుతో బయలుదేరు."

ఇక్కడ దారుస్సలామ్ దారుల్ హరబ్‌ల మధ్య ఉంచవలసిన సంబంధ బాంధవ్యాలు, ముస్లిం ముస్లిమేతరుల మధ్య సంబంధాలు వ్యవహారాలు వాటి తాలూకు నియమ నిబంధనలు వివరించడం ఉద్దేశం కాదు. ఈ అతిక్లుప్తమైన చర్చ ద్వారా సంపూర్ణమైన వివరణ ఇవ్వడం సాధ్యం కూడా కాదు. ఈ చర్చ ప్రధాన ఉద్దేశ్యం, కేవలం విభిన్న శక్తుల మధ్య వుంటూ ఇస్లామీయ వ్యవస్థ తన నియమ నిబద్ధమైన జీవన విధానాన్ని ఎలా కొనసాగించగలదో తెలపడమే. ఇస్లాం వ్యవస్థీకృతం కాకముందు ప్రపంచంలో కేవలం 'బలంగల వాడిదే రాజ్యం' వుండింది. సర్వత్రా మృగ న్యాయమే అమలు అయ్యేది' 'కర్ర ఎవరిదో -బర్రెవానికే' దక్కేది. శక్తి వున్నవాడు బలహీనుడిపై దౌర్జన్యం చేయడం -అతనిని దోచుకోవడం తన జన్మహక్కుగా భావించేవాడు. బలహీనునికి కనీస హక్కులు దక్కేవి కావు. ఈ నేపథ్యంలో ఇస్లాం స్థాపించిన సమన్యాయ గుర్తులు, శాశ్వత ముద్రలుగా చరిత్రలో నిలిచిపోయాయి. నిరంతరం ఏదో ఒక రూపంలో అవి ప్రత్యక్షమవుతూనే వున్నాయి. పదిహేడవ శతాబ్దంలో, చట్ట పరిధిలో చట్టాల ఆధారంగా వ్యవహార నిర్వహణ అమలులోకి వచ్చింది. అంతర్జాతీయ స్థాయిలో మానవ హక్కుల చట్టాల నిర్మాణం ప్రారంభమైంది.

పందొమ్మిదవ శతాబ్దంలో అంతర్జాతీయ సంస్థలు ప్రారంభించబడ్డాయి. ఈ సంస్థలు తమ కర్తవ్య నిర్వహణలో సఫలమైనా, విఫలమైనా అవి కొనసాగు తూనే వున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో చట్ట నిర్మాణానికి –నియమ నిబంధ నల ఏర్పాటుకు సంబంధించిన చర్చలు జరుగుతూనే వున్నాయి. ఈ ఆధునిక కాల అంతర్జాతీయ నిర్మాణాలన్నీ ఇస్లామీయ సమత–సమన్యాయ వ్యవస్థ జ్ఞానసరోవరం నుండి ఉద్భవించినవే.

ఇస్లాం ఏ నైతిక విలువల ఉన్నతిని సమాజంలో స్థాపించదలిచిందో, ఆ ఉన్నతికి సమాజం చేరకపోయి వుండవచ్చు. మొదటి తరానికి చెందిన విశ్వాసుల బృందం ఏ ఉన్నత స్థాయి విలువలు గల సమాజాన్ని స్థాపించిందో ఆ స్థాయిగల సమాజాన్ని, ఆ తర్వాతి తరం వారు ఏర్పర్చటం కష్టతరమూ కావచ్చు. అంతర్జాతీయంగా మానవ సంక్షేమం పేరిట ఏర్పడిన సంస్థలు మాటి మాటికీ తమ స్వీయ నిబంధనలను ఉల్లంఘిస్తూ వుండవచ్చు. దేశాల మధ్య బృందాలు ఎగతాళిపాలై పోతూవుండవచ్చు. యుద్ధ సంబంధ న్యాయ చట్టాలు తుంగలో తొక్కబడుతూ వుండవచ్చు. అడవి మృగాలకంటే కూడా హీనమైన మానవతా సంబంధాలతో నేటి సమాజం జీవిస్తూ వుండవచ్చు. ఆర్థిక ప్రయో జనాల కోసమే అంతులేని మానవ హననానికి పాల్పడే యుద్ధాలు సృష్టిస్తూ యుద్ధానికి, యుద్ధానికి నడుమ దొరికే సమయాన్ని అద్భుత శాంతిగా గొప్పలు చెప్పుకుంటూ వుండవచ్చు. ఇస్లాం ప్రతిపాదించిన దైవమార్గంలో నిరంతర కృషి (జిహాద్), దైవమార్గంలో పోరాటం లాంటి ఆదర్శాలు నేటి యుద్ధాలకు లేకపోవచ్చు. కాని, ఆనాడు ఇస్లాం, ఏ విలువల పునాదులపై నియమ నిబంధ నలను, తాత్విక పునాదులను ప్రతిపాదించి ఆచరించిందో, వాటి తాలూకు పాదముద్రలు, గుర్తులు నేటికీ మానవ మస్తిష్కాల నుండి, చరిత్ర నుండి పరుగు కాలేదు. ఇస్లామీయ విలువలు మానవ సమాజానికి ఏమాత్రం అపరిచితమైనవి కావు. ఈ కారణంగానే ఈ విలువల వైపునకు, ఈ తాత్విక జ్ఞాన సరోవరం

వైపునకు, మానవ సమాజం పిలవవలసిన రీతిలో మరలా పిలవబడితే మానవ సహజ నైజం ఆ పిలుపుకు తప్పకుండా స్పందిస్తుంది. 'హాజరయ్యాను' అని పలుకుతుంది. సై అంటూ బదులిస్తుంది... ఆచరణ వైపునకు కదలివస్తుంది. అజ్ఞానపు ఊబిలో కొట్టుమిట్టాడుతున్న మానవత్వం, ఇస్లామీయ ఉన్నత తాత్విక జ్ఞానం నుండి కొంతకాలం దూరంగా వుండిన మాట వాస్తవమే. అయినప్పటికీ ఇస్లాం వేసిన అడుగుజాడలు, పాదముద్రలు, మానవత్వానికి నిరంతరం ప్రేరణ కల్పిస్తూ వున్నాయి. ఏ సమాజ సహజ నైజం పునాదులపై మొదటిసారిగా ఇస్లాం, ఒక ఉన్నత నైతిక విలువల వ్యవస్థను స్థాపించిందో అదే మానవ సహజ నైజంపై పూర్తి నమ్మకంతో మరోసారి ఈ కృషిని విజయవంతంగా అమలు చేయగలదు. సుదీర్ఘ కాలంగా అందిన అనుభవాల ఖజానా నుండి, మార్గదర్శకత్వాలను గ్రహిస్తూ, తన పూర్తి శక్తి సామర్థ్యాలతో, దృఢమైన అడుగు జాడలతో ముందుకు మునుముందుకు అడుగులేస్తూ నిరంతరంగా సాగి పోగలదు.



# చివరి మాటగా

ఈ చిరుపుస్తకంలో, చరిత్రలు ఇస్లాం సాధించిన విజయాలను, వదలిన శాశ్వత ముద్రలను వివరించడం, చర్చించడం సాధ్యమయ్యే విషయం కాదు. గతంలో చరిత్ర ఎన్నడూ ఎరుగని ఉన్నత స్థాయి విలువలను సమాజంలో ఇస్లాం స్థాపించి చూపింది. వాటి తాలూకు చిహ్నాలు నేటికీ విభిన్న రూపాల్లో, విభిన్న స్థాయిలలో రాజకీయ, ఆర్థిక, సామాజిక జీవితాలలో దర్శనమిస్తున్నాయి. కొన్నిచోట్ల ప్రస్ఫుటంగానూ, మరికొన్ని చోట్ల మసకగానూ, మరి కొన్నిచోట్ల ఆ మొదటి తరం స్థాయికంటే కొంత దిగువ స్థాయిలోనూ దర్శనమిస్తున్నాయి. కాని, దైవవ్యవస్థ మానవ సమాజాన్ని ఏ ఉన్నత స్థాయిలో నిలపదలచిందో, ఆ ఉన్నతి ఇంకా సాధించబడలేదు అనేది నిజం. గత పద్నాలుగు వందల సంవత్సరాల నుండి ఏదో ఒక రూపంలో ఇస్లామీయ సమత-సమన్యాయ సంక్షేమకర ఉన్నత స్థాయి నైతిక విలువల గుర్తులు, ప్రతి చారిత్రక దశలోనూ దర్శనమిస్తూ దిశను సూచిస్తూ వున్నాయి. ఈ చర్చను ముగించేముందు మరికొన్ని విషయాలు స్పష్టపర్చడం అత్యవసరమని భావిస్తాను. ఇస్లామీయ సందేశం ప్రపంచానికి అందించడంలో జ్ఞానపరమైన, భౌతిక వనరులపరమైన ఇబ్బందులు చాలానే వున్నాయి. వాటిని ముందుగానే పసిగట్టి, అవసరమైన పకడ్బందీ సాధన అలవర్చుకోవాలి. అపోహలకు గురికాని ఆచరణ, ఆ ఆచరణకు అవసరమైన దృఢసంకల్పం. ప్రపంచం విసిరే సవాళ్లు, కష్ట నష్టాలకు వెరవని ధీశాలీతనం అలవర్చుకోవాలి. సామాజికంగా

నేటి మానవ సమాజం తన నిజప్రభువు, సృష్టికర్త, విశ్వసామ్రాజ్యాధిపతి అయిన అల్లాహ్ నుండి, గతంకంటే, కడు దూరంగా జరిగి వుంది. మానవత్వంపై నేడు ఆవరించి వున్న అజ్ఞానపు చీకటి పొరలు గతంకంటే దట్టంగానూ- మందంగానూ వున్నాయి. గతకాలపు అజ్ఞానం -మూర్ఖత్వం, కొన్ని మానవతా విలువలు, మరికొన్ని మూఢ నమ్మకాలు వగైరాలపై ఆధారపడి వుండేది. కాని, నేటి ఆధునిక అజ్ఞానం చదువు- సంధ్యలపై, పరిశోధనలపై, తాత్విక గందరగోళంపై ఆధారపడి వుంది. పద్దెనిమిది, పంతొమ్మిదోవ శతాబ్దం విజ్ఞాన పురోగతి ప్రధానంగా ధిక్కార స్వభావం కలిగి వుండింది. నాటి యూరోపియన్ (మత) అజ్ఞానం పరిశోధకులను, విజ్ఞాన శాస్త్ర ఆవిష్కర్తలను హింసించడం -వారికి సజీవ దహనం లాంటి శిక్షలు విధించడం లాంటి క్రూర చర్యల వల్ల శాస్త్రవిజ్ఞానంతో (సైన్స్‌లో) విరోధం కొనితెచ్చుకుంది. ఆనాడు యూరప్‌ను శాసిస్తూ వుండిన మత వ్యవస్థతో, సైన్సుకు మధ్యతరగతిని విరోధం, విద్వేషాల కారణంగా శాస్త్రవిజ్ఞానం పెడధోరణికి గురై, మతానికి పునాది – 'దేవుడు' కనుక ఆయన ఉనికినే ప్రశ్నించే సాహసం చేసింది. తదనుగుణమైన తర్కాన్ని, చర్చను ప్రపంచ వ్యాపితంగా లేవనెత్తింది. ఈ కారణంగా విజ్ఞాన శాస్త్రపు ఫలితాలు 'పిచ్చివాని చేతిలో రాయిలాగా' జాత్యాంహంకారులకు, సామ్రాజ్యవాదులకు ఉపయోగపడింది. అన్ని మానవీయ విలువలను ధ్వంసం చేస్తూ, కేవలం పదార్థ భౌతికవాదులుగా ప్రజలను మలిచే కృషి చేసింది. ఈ ఫలితంగా జరిగిన మానవ హననానికి, స్వయంగా మానవ పనులకు సజీవ సాక్ష్యంగా నిలిచింది.

దైవకృప వల్ల 20వ శతాబ్దపు మొదలు నుండి పరిస్థితులలో మార్పులు సంభవించడం మొదలయ్యింది. విజ్ఞాన శాస్త్రవేత్తలు, తత్వవేత్తలు, మేధావులు పెద్ద సంఖ్యలో ఆధ్యాత్మికత వైపు మరలారు. వాస్తవ దైవభావనపై పరిశోధనలు- పరిశీలనలు – చర్చలు మొదలయ్యాయి. దైవం వైపునకు మరలే

ఉద్యమం ఊపందుకుంది. ఏ మానవ నైజం ఒక సుదీర్ఘకాలం అంధకారంలో మునిగి వుండిందో అది మరలా వెలుగు వైపునకు ప్రస్థానం మొదలెట్టింది. తన అజ్ఞానపు పరదాలను తొలగించింది. మరో శతాబ్దంలోగా ఈ పరిస్థితి మరింత ఆశాజనకంగా మారగలదు. వాతావరణంలో దైవ చింతన దైవ సందేశం- దైవ వ్యవస్థ- దైవ నిబంధనలు లాంటి విషయాలు సర్వత్రా చర్చనీయాంశం కాగలవు. (ఇన్షాఅల్లాహ్)

ప్రపంచ వ్యామోహం నేటి ప్రజల దృష్టిలో అత్యంత ప్రాధాన్యత సంతరించుకుంది. వస్తు వినియోగ నాగరికత, జీవితావసరాల పరిధిని అత్యంత విస్తృతం చేసింది. ప్రాపంచిక జీవితానికి ఇవ్వవలసిన ప్రాధాన్యత కంటే వేలరెట్లు అధికంగా ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. సాంకేతిక పరిజ్ఞానం దానితోపాటు మానవుని కోరికలు, వాటి పరిధులు అంతులేనంతగా విస్తరించాయి. ఈ భౌతిక, సాంకేతిక నాగరికతల అభివృద్ధి దైవం పునాదులపై దైవాదేశాల వెలుగులో జరిగివుంటే ఈ సృష్టికి ఒకకర్త వున్నాడు, అతనే ఆరాధనకు, విధేయతకు అర్హుడు అనే తాత్విక పునాదిపై జరిగివుంటే పరిస్థితి వేరేగా వుండేది. మానవుడు ఈ భూమిపై దేవుని ప్రతినిధి (ఖలీఫా)గా జన్మించాడనే సత్యం గ్రహించివుంటే - ఈ భూమిలోని సమస్త వస్తు సముదాయం మనిషి కోసమే సృష్టించబడిందని తెలుసుకొని వుంటే- ఈ ఖలీఫాతనపు నిర్వహణ కోసమే మానవునికి జ్ఞానం, వివేకం ఇవ్వబడిందని గ్రహించివుంటే -మనిషి జీవితంలో సౌకర్యవంతంగా జీవించడానికి అవసరమైన వనరులన్నీ ఇవ్వడం వెనుక, ఈ సౌకర్యాలన్నీ నన్ను పరీక్షించడానికి ఇవ్వబడ్డాయనే గ్రహణం వుంటే - ఈ జీవితంలో జీవించిన విధానం ఆధారంగా, మరణానంతరం ప్రశ్నించబడతాననే వాస్తవం మనిషి గ్రహించి వుంటే - పైన వివరించిన తాత్విక సత్యతల పునాదిపై మానవ సాంకేతిక విజ్ఞానాభివృద్ధి జరిగివుంటే, ఈ ప్రపంచంలోని సామాజిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, రాజకీయ, నైతిక స్థితిగతులు మరో రకంగా వుండేవి. జ్ఞాన సముపార్జన, నాగరికతల వికాసం, జాతుల

ఉత్థానపతనాలు, సాంకేతిక విజ్ఞానాభివృద్ధి మనిషిలో తన సృష్టికర్త పట్ల విశ్వాసం, విధేయత, ఆయన ఆదేశపాలన పట్ల నిబద్ధత, ఆయన వ్యవస్థను స్థాపించడంలో అవిరళ కృషి, సమత, సమన్యాయ సంక్షేమకర సమాజం తప్పకుండా ఉనికి లోకి తెచ్చివుండేది. దురదృష్టవశాత్తు విజ్ఞానశాస్త్ర అభివృద్ధి, దైవ భావనకు వ్యతిరేక దిశలో ఎదిగిన కారణంగా ప్రపంచం అంతులేని బాధలను అనుభవించవలసి వచ్చింది. శాస్త్ర సాంకేతిక విజ్ఞానాభివృద్ధి పేరుతో దైవధిక్కారం ఇక్కడే జరుగుతుంది. నాగరికత పరిశోధనల పేరుతో, దైవశాస నాల పట్ల ద్రోహం చేయబడుతుంది. వికాసం పేరుతో విలయం తాండవి స్తుంది. సభ్యతా సంస్కారాలు, మానవతా విలువలు, హక్కులు, నైతికతలు తుంగలో తొక్కుతున్నాయి. ఒక్క మాటలో దైవభావన లేని అభివృద్ధి మనిషిని జంతువుగా మార్చివేసింది. ఈ కారణం వల్లనే మానవుడు సాధించాడని చెబుతున్న అభివృద్ధి, అతనికి మేలు చేయకపోగా మరింత వినాశం వైపునకు ఈడ్చుకు వెళుతుంది. ఈ వినాశం, ఈ విలయం, ఈ మానవ హననం, రక్తపాతాలకు కారణం కేవలం ఒక్కటే; మానవుడు తన నిజదైవానికి దూరంగా.. మరింత దూరంగా జరిగిన ఫలితమే. ఈ వాస్తవాలను, ఈ కఠోర సత్యాలను, ఇస్లాం అనుయాయులు, ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తలు విస్తృతంగా ప్రచారం చేయవలసివుంది.

భౌతిక వస్తూత్పత్తి సౌకర్యాలు, వినిమయతత్వం, నాగరికతల పేరుతో జరుగుతున్న విశృంఖలత్వం, దాని ప్రభావంతో మానవ సమాజం ఎదుర్కొం టున్న సమస్యలు వగైరాలలో నేటి మానవ నైజం విసిగి వేసారివుందనేది కాదనలేని సత్యం. అదే సమయంలో నైతిక పతనాన్ని మరుపుకు గురిచేస్తున్న భౌతిక సంపద, తద్వారా అనివార్యమయ్యే భోగలాలసత, మనిషిని మత్తులో ముంచివేసింది. జాతులు–వ్యక్తులు, ఉత్థాన పతనాలకు లోనవుతున్నాయి. దౌర్జన్యాలు, రక్తపాతాలు, మానవ మారణ హోమాలు నిత్యకృత్యాలయ్యాయి. ప్రపంచం మానవ మాంసపు విక్రయకేంద్రంగా మారిపోయింది. జంతు ప్రవృ

త్తిని నషాళానికి ఎక్కించేవిగా ప్రసారమాధ్యమాలు తయారయ్యాయి. అభివృద్ధి పేరుతో జరుగుతున్న సరికొత్త ఆవిష్కరణలు సామాజిక, భావాత్మక వాతావరణంలో కాలుష్యాన్ని వేగవంతంగా విస్తరిస్తున్నాయి. మనిషి కేవలం మత్తు పదార్థాల మత్తులో కాక అహంభావపు మత్తులో జోగుతూ వుండటం నేటి విశేషం. ఈ సామాజిక పరిస్థితి చూస్తుంటే; మనిషి సకారాత్మక (పాజిటివ్) ఆచరణ వైపునకు మరలేందుకు, ఈ ఊబి నుండి బయటపడే కృషికై ఉపక్రమిం చేందుకు, మత్తు నుండి కళ్లు తెరిచేందుకు, తదనుగుణంగా ఆలోచించేందుకు ప్రయత్నం మొదలెట్టే లోగానే ఈ శతాబ్దం ముగిసేలా వుంది. గత అజ్ఞానం అమాయకత్వ సహితమై వుంటేది. అమాయకత్వంలోని సరళత, నెమ్మది అందులో మేళవింపబడి వుండేది. కనుక గతానికి చెందిన అజ్ఞానంలోని కొన్ని సాంప్రదాయాలు, నైతిక కట్టుబాట్లకు మానవ సంబంధాలను సజీవంగా వుంచడానికి నిర్ణయాత్మక పాత్ర వహించేవి. మంచితనం, ప్రేమ, కారుణ్యాలు, సహాయసహకారాలు, బంధుత్వ సంబంధాల పట్ల బాధ్యతలు అమలయ్యేవి. ఇస్లామీయ సకారాత్మక సందేశం వీరికి అందిన వెంటనే నాటి మానవ సహజ నైజం, తన అమాయకత్వ మిళితమైన అజ్ఞానపు పరదాలను చీల్చివేస్తూ, అందులోని సకారాత్మక విలువలను గ్రహిస్తూ 'నేనున్నాను' అంటూ బదులు పలికింది. విశ్వాసం అవిశ్వాసాల మధ్య, ఏకదైవ ఆరాధనకు -బహుదైవ ఆరాధనకు మధ్య సంఘర్షణ ఉన్నప్పటికీ నేటికంటే నాటి మానవ సహజ నైజపు స్పందన అధికంగా వుండింది. నేటి మానవుడు విశ్వాసాలు, అభిప్రాయాల, మతాల్ల, తాత్విక భావజాలాల పట్ల అంతులేని నిర్లక్ష్యాన్ని ప్రదర్శి స్తున్నాడు. మనసులో సందేహం, ఆచరణలో ద్వంద్వస్వభావం, జీవితంలో అవకాశవాదాలను కాకుంటే పలాయన వాదాలను ఆశ్రయించడం మొద లెట్టాడు. ఈ మానసిక స్థితి దైవమార్గం వైపుకు మరలడానికి భయంకరమైన ఆటంకాలుగా నిలుస్తుంది. స్వయంగా దైవ సందేశాన్ని అందించే కార్యంలో బయలు దేరినవారు సైతం రాజమార్గం (రుజుమార్గం- జాదెరాహ్) ఏదో

తెలుసుకోవడంలో క్షమించ శక్యం గాని నిర్లక్ష్యం వహించే ప్రమాదం ఎదుర్కొం టున్నారు. చివరికి ఈ 'రాజమార్గం' సత్యమార్గం రుజుమార్గం ఏది? అదే 'తఖ్వా' మార్గం (దైవానికి జవాబుదారీతనం) 'తఖ్వా' అంటే దైవభావన పట్ల జాగరూకత – చైతన్యవంతమైన విధేయత కలిగి వుండటం. దైవమార్గ దర్శకత్వపు వెలుగులో జీవిత పయనం. ఈ పయనంపై సంతృప్తికరమైన, దృఢ మైన నమ్మకం కలిగివుండాలి. ఆపై దైవ సహాయం తప్పనిసరిగా అందుతుంది. "మేము విశ్వాసులకు సహాయపడటం అనేది హక్కుగా కలిగివున్నాము" (దివ్యఖుర్ఆన్ : 30:47) అని అల్లాహ్ ప్రకటించాడు.

పైన వివరించిన ఆచరణ అంతా దైవంపై సంపూర్ణ విశ్వాసంతో ముందడుగు వేసే విశ్వాసుల బృందం కోసమే. అల్లాహ్ ప్రసన్నత, అల్లాహ్ చేసిన వాగ్దానం, ఈ బృందానికి పరమోన్నత సత్యంగా వుంటుంది. ఈ బృందపు నిరంతర కృషిలో -ధర్మ సంస్థాపనా పోరాటంలో, దైవ సాంప్రదాయం నిరంతరం తోడుగా -అండదండలుగా వుండి తీరుతుంది. ఈ బృందమే మానవత్వపు కళ్లపై ఆవరించి వున్న అజ్ఞానపు పరదాలను తొలగించగలుగు తుంది. మానవుని సహజ నైజాన్ని తట్టి లేపగలుగుతంది. దానిని చైతన్యవంతం చేయగలుగుతుంది. ఈ బృందమే దైవాదేశాలను, సమున్నతం చేస్తూ దైవ వ్యవస్థను స్థాపించే కృషిలో తన సర్వ శక్తులను వినియోగించగలుగుతుంది.

> "మీకు పూర్వం ఎన్నో యుగాలు గతించాయి. (అల్లాహ్ ఉపదేశాలు అసత్యా లని) తిరస్కరించే వారి ముగింపు ఎలా జరిగిందో స్వయంగా భూమిపై సంచారం చేసి చూడండి. ఇది ప్రజలకు ఒక స్పష్టమైన హెచ్చరిక. అల్లాహ్‌కు భయపడే వారికి మార్గదర్శకత్వం. హితోపదేశం. -క్రుంగిపోకండి, దు:ఖపడకండి, మీరే ప్రాబల్యం పొందుతారు."
> *(దివ్యఖుర్ఆన్ 3:138-139)*

